# కాకతీయ నాయకులు

ఆంగ్లరచన :

ఆచార్య ఎన్.జి. రంగా

తెలుగు అనువాదం :

డాక్టర్ జేక్కంపూడి సీతారామారావు

ప్రచురణ :

డాక్టర్ జేక్కంపూడి సత్యనారాయణ
M.B.B.S. D.A., F.R.C.A. (London)

# కాకతీయ నాయకులు

ఆంగ్లమూలం : శ్రీ ఎన్. జి. రంగ

అనువాదకులు : డా॥ జేక్కంపూడి సీతారామారావు

మొదటి ముద్రణ : జులై, 1997

రెండవ ముద్రణ : నవంబరు 2008



వెల రూ. 100/-

ప్రాప్తిస్థానము

శ్రీ నన్నపనేని శంకరయ్య, B. Arch.

అశోక్‌నగర్, ప్రజ్ఞా రీజెన్సీ ప్లాట్ నెం. 9

గుంటూరు - 522 007

ముద్రణ : డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రెస్, గుంటూరు -7



శ్రీమతి నాగరత్నం శ్రీ వెంకటసుబ్బయ్య
అమ్మ నాన్నలకు నమస్కృతులతో సమర్పితం



ఛల్లపల్లిలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంపాదించిన కాకతమ్మ విగ్రహం
ముక్త్యాల



# FOREWARD

*Y. Vaikuntam,*
(Former Vice-Chancellor Kakatiya University, Warangal)

The Kakatiya dynasty was unique in many respects for the telugu people. It was the first dynasty to unite the telugu speaking people and developed the culture of its own. Territorial expansion, cultural and economic development, contribution to art and architecture was outstanding. The network of lakes constructed, transformed the economy and till today they outshine the contribution of any dynasty for the development of irrigation and water resources.

The Motupalli inscription, Thousand Pillars Temple inscription, Marco polo's accounts speaks very high of the rulers of Kakatiyas and their contribution to the multifaceted development in the region. Prola II, Rudradeva, Ganapathideva, Rudrama Devi and Pratap Rudra II were the independent rulers of the dynasty ruled from warangal and brought almost the entire telugu speaking areas of Telangana, Coastal Andhra and Rayalaseema under their control. Both the rulers and their feudatory chiefs and Nayaks were responsible for the contribution of finest temples. To mention a few, thousand pillars temple, fort at Warangal as the capital, Ramappa temple at Palampet, Ghanpur temples, Ekaveera temple at Mogilicherla exhibit finest features of Kakatiya architecture and sculpture. The trikuta with well designed pillars and Nandi at thousand pillar temple, Kirthi Toranas, well designed Natya Mandapas and temple in the fort covered by four defence oriented impregnable walls and fortress, salabanjakas or bracket figures at Ramappa, the Sikhara of the temple built with light weight bricks which float on water speaks of great architectural skills and engineering splendour of the Kakatiya artists and the patronage of the rulers. These temples were mostly built with granite, dolerite and sullavai sandstone available around for the construction of temples. Recharla Rudra, feudatory chief

and general of Ganapathi Deva built a beautiful Ramappa temple and the lake. The Ramappa temple with Dravidian Sikhara, beautiful Rangamandapam, bracket figures in black basalt rock speaks of the high architectural and cultural skills, Jayappa Senani's classical dance treatise called *Nritta Ratnavali* explains the dance forms, high light of them was 'Perini Shiva Tandavam, a dance form of Lord Shiva. This temple was regarded as 'the brightest gem in the galaxy of Medieval Deccan temples". Yazdani eulogized the spirit of the art by saying "the culture displays voluptuous joy and sensuality".

They built great lakes like Ramappa, Pakal, Ghanpur, Dharmasagar, Laknavaram, Kesamudram, Anantasagar and many others which are intact even today irrigating thousands of acres under each one in addition to providing drinking water was an engineering and technological achievement. This was an excellent vision of Kakatiyas for planning and development of water resource management.

Not only they were great poets but also great patrons of men of letters. Kridabhiramamu of Vinukonda Vallabha Raya, Pratapa Rudra's, Prataparudra Yasho Bhushanam', Vidyanatha in the court of prataparudra are well known for their literary works. Kakatiyas will be remembered for their achievements in various fields. The present book Kakatiya Nayakas explains their contribution to various fields, by throwing light on many aspects of them, is a good edition to the literature on Kakatiyas.

Prof. Ranga is known as an activist an agitator and a fighter. He was active in freedom struggle. He agitated for debt relief for farmers and got farmers debt relief act passed in Madras Assembly. He fought Zamindari abolition and won. At the same time Prof. Ranga is a researcher that studied rural economy and administration. The out come is the credo of world peasantry and Kakatiya Nayaks in English.

Dr. J.S. Rama Rao translated both of them into Telugu. I congratulate him for his readable rendering.



కీ.శే. పులిచెర్ల సుబ్బారావు
(1940-2002)



కీ.శే. గుంటుపల్లి నాగేశ్వరరావు
(1952 - 2007)



# అభినందనము

## నాగళ్ల గురుప్రసాదరావు

ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని ఔపోశనపట్టిన అపర అగస్త్యులు
సాహిత్యంపై సాధికారిక విమర్శచేయగల సమర్థులు
నిర్దుష్టమైన సంప్రదాయ ఒరవడిగలవారు
దేశవిదేశాలలో పలు సాహితీ ప్రసంగాలు చేసినవారు.

---

డాక్టర్ జేక్కంపూడి సీతారామారావు వృత్తిని బట్టి వైద్యుడు. ప్రవృత్తినిబట్టి సాహితీప్రియుడు. ప్రాచీన సాహిత్యంగానీ, నవీన సాహిత్యంగానీ దేనినయినా చక్కగా సమచిత్తంతో చదివి ఆనందించే రసజ్ఞుడు. సందర్భోచితంగా కావ్యాల్లోని పద్యాలను తార్కాణించే సమయస్ఫూర్తి కలిగినవాడు. దంత్య-తాలవ్య చ-జలను నియమప్రకారం గుర్తించి ఉచ్చరించటం తెలుగుజాతి మరచిపోయిన ఈ "అభ్యుదయ యుగము"న ఇంటిపేరులో దంత్యమయిన "జ" నిలిపిన భాషానిష్ఠ కలవాడు. ఈ సాహితీరసికతకూ, భాషానిష్ఠకూ ఔదార్యమూ తోడై శ్రీ సీతారామారావు వ్యక్తిత్వానికి వన్నెపెట్టింది. దీని కుదాహరణంగా ముప్పైయారేళ్ళనాడు ప్రవర్తిల్లిన వృత్తాంతాన్ని ప్రస్తావిస్తాను. అప్పుడు నేను జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాలలో (గుంటూరు) ఆంధ్రశాఖాధ్యక్షుడుగా ఉద్యోగిస్తున్నాను. కళాశాలాగ్రంథాలయానికి ఉత్తమ సంస్కృతాంధ్ర గ్రంథాలను సేకరించాలని కోరినపుడు కార్యదర్శిగా ఉన్న డాక్టర్ కె. సదాశివరావుగారు అండగా నిలిచారు. పూనాలోని "భాండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్" ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సంస్థ. పరిశోధన పారంగతులయిన ప్రాచ్యపాశ్చాత్య పండితులు పరిష్కరించిన "సంశోధిత" సంస్కృత మహాభారత గ్రంథాన్ని ఆ సంస్థ 1966వ సంవత్సరానికి పూర్తిగా ప్రకటించింది. 18 పర్వాలు 19 సంపుటాలుగా రూపొందాయి. ఈ సంపుటాల పుటలసంఖ్య పదమూడువేలు. వెల దాదాపు పదివేల రూపాయలు. ఈ సంశోధిత సంస్కృత మహాభారతాన్ని కళాశాలా గ్రంథాలయానికి తప్పకుండా చేర్చాలని ఆశపడుచున్నప్పుడు శ్రీ సీతారామారావు ముందుకు వచ్చి, పందొమ్మిది సంపుటాలు కొనటానికి ధనసహాయం చేసాడు. కళాశాలవార్షికోత్సవంనాడు శ్రీసీతారామారావు చేతుల మీదుగా (కార్యదర్శి సదాశివరావుగారు) అధ్యక్షులు జాగర్లమూడి చంద్రమౌళిగారు, సంపుటాలు స్వీకరించారు.

ఇంతగా సాహిత్యానురాగం కలిగిన శ్రీసీతారామారావు చరిత్రమీద చూపుసారించటం సహజమే. చరిత్రకూ, సాహిత్యానికీ విడరాని పొత్తు ఉంటుందని

ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. సాహిత్యప్రీతి కలిగిన రసికుడు చరిత్రను ఉపేక్షింపలేడు, ఉపేక్షింపరాదుకూడ. ఈ సిద్ధాంతం సత్యసమ్మతం అని రుజువు చేయటానికి తగినట్లుగా రాజనీతివిశారదుడైన ఆచార్య ఎన్.జి. రంగా ఆంగ్లభాషలో రచించిన గ్రంథాలెన్నో ఉన్నప్పటికి వారు రచించిన "కాకతీయనాయకాస్" అనే గ్రంథాన్ని "కాకతీయనాయకులు' పేరిట శ్రీ సీతారామారావు తెలిగించాడని నేననుకొంటున్నాను. "శ్రీ ఎన్.జి. రంగాగారి భక్తుడను నేను" అనీ, "పూజ్యరంగాజీ భక్తాంఘ్రిరేణువు నగు నే" ననీ శ్రీ సీతారామారావు నిశ్శంకంగా నిర్ద్వంద్వంగా చాటుకొన్నాడు. రాజకీయనాయకునిపట్ల, రాజకీయ నాయకురాలిపట్ల ప్రదర్శించే నిత్యజపపూర్వక మయిన భక్తి రాజ్యాధికారం సంపాదించి నిలుపుకొంటానికీ, కుబేరసంపద ఆర్జించటానికీ సాధనమై, దుష్కృత్యాలకు దోహదం చేస్తున్న ప్రజాస్వామ్య వ్యవస్థ మనది. శ్రీ సీతారామారావు భక్తి అటువంటిది కాకుండా కాకతీయనాయక చరిత్రను వివరించే ఉత్తమ గ్రంథాన్ని అనువదించటానికి ఉద్బోధకమయింది. ఈ సత్కార్యానికి ఆయనను అభినందిస్తున్నాను. ఇంతేకాకుండా శ్రీసీతారామారావునకు కాకతీయ చరిత్రమీద సహేతుకమయిన యనురాగం కలదనికూడా పాఠకులు గ్రహిస్తారు.

జాగ్రదావస్థలో సంక్లిష్టదేశ సమస్యలతో సతమతమవుతూ విరామానికి నోచుకోని ప్రజానాయకులు చారిత్రక గ్రంథరచన కుద్యమించటం అరుదు. వీరు వృత్తినిబట్టి చరిత్రకారులు కారు. అయినప్పటికీ అనేకగ్రంథాలు సవిమర్శకంగా పఠించి కొత్త చూపుతో చరిత్రను సమీక్షిస్తారు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ద్వారకాప్రసాద్ మిశ్రా మొదలయిన నాయకులందరూ చేసినపని ఇదే. ఆచార్య ఎన్.జి. రంగాకూడా వారికోవలోనివారే. రైతుబాంధవుడుగా రాణకెక్కిన యీ రాజనీతివేత్త రచించిన "కాకతీయనాయకాస్" కూడా కొత్తపోకడలు పోయినట్టిదే. నామధేయాన్నిబట్టే "నాయకులు" ఈగ్రంథంలో ముఖ్యులని చదివినవారు గ్రహిస్తారు. ప్రోలయనాయకుడు, కాపయనాయకుడు, వినాయకదేవుడు, హరిహరరాయలు, బుక్కరాయలు మొదలయిన వీరనాయకులు ఆంధ్రుల చరిత్రలో మరవరాని మహాపురుషులుగా రంగాగారికి గోచరించారు. ఈ కారణంవల్లనే వారు "ఫైట్ ఫర్ ఫ్రీడమ్" పేరుతో రచించిన స్వీయ చరిత్రను ఆ నాయకులకు అంకితం చేశారు. "కాకతీయ నాయకాస్" 1971లో మొట్టమొదట అచ్చయింది. రెండవకూర్పు 1984లో వెలువడింది. ఇది మొదటికూర్పుకంటే విరివిగా వివిధ విషయాలతో కూడినట్టిది. కాకతీయ నాయకుల చరిత్ర కాకతీయరాజ చరిత్రతో ముడిపడిందని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

"...మనది ఆంధ్రదేశం, మనం ఆంధ్రులం అనే జాతీయాభిమానం మొదటిసారి మనకు ఈకాలంలోనే (గణపతిదేవ చక్రవర్తికాలంలో) కలిగింది. దేశములో కొత్త ఉత్సాహం ప్రబలింది..." అని కీర్తికాయుడు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వక్కాణించారు. వారే "ముస్లిములు ఎప్పటికైనా దక్కను దేశంమీదికి, దండెత్తిరాకపోరనే నమ్మకముతోనేమో గణపతిదేవ మహారాజు తెలుగుమాట్లాడే ఆంధ్రుల నందరినీ ఒక్కరాజ్యంలోకి తీసుకురావాలని మొదటిసారి ప్రయత్నించాడ"ని నిర్ణయించారు.

ఆంధ్రుల చరిత్రలో కాకతీయయుగం వీరయుగం. "...ఓరుగల్లు రాజధానిగా తెలుగుదేశమునంతను సుమారు ఇన్నూరేండ్లు పరిపాలించి రాజకీయముగను, సాంఘికముగను తెలుగుజాతికొక ప్రత్యేకతను తీర్చి దిద్దినరాజవంశము కాకతీయులది. ఈరాజులు క్రీస్తు శకము 1150 ప్రాంతంనుండి 1323వరకు స్వతంత్రులుగ రాజ్యపాలనచేసిరి. అంతకుపూర్వ మొకనూటయేబదేండ్లు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంతులుగా హనుమకొండవిషయమేలిరి.." అని డాక్టర్ పి.వి. పరమబ్రహ్మశాస్త్రి పేర్కొన్నారు. వారే కాకతీయరాజుల్లో రుద్రదేవుని కాలంలోనే మొదటి తెలుగుస్వతంత్ర రాజ్యస్థాపన" జరిగిందని చెప్పుచూ "దీనిని మొదటి ఆంధ్రరాష్ట్రోద్యమ మనవచ్చు"నని నిశ్చయించారు.

ఆనాడు ఆంధ్రజాతీయాభిమానం ఎంతగా అతిశయింపకపోతే రాజధానియయిన ఓరుగల్లు నగరాన్ని 'ఆంధ్రనగరం' అని సగర్వంగా ప్రజలు పేర్కొంటారు? కవిబ్రహ్మ తిక్కన "కావున భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి, యంధ్రావలి మోదముంబొరయు నట్లుగ.." మహాకవిత్వదీక్షతో వ్యాసభారతాన్ని తెలుగుగద్య పద్యాల్లో రచిస్తానని ప్రగాఢ ప్రత్యయం ప్రకటిస్తాడు?

ఈ కాకతీయ మహారాజవంశాన్ని గూర్చి చిలుకూరి వీరభద్రరావుగారి నుండి **(1936)** సింథియా టాల్బట్‌వరకు **(2001)** ఎందరో పరిశోధకులు ఉత్తమగ్రంథాలు రచించారు. కాలక్రమాన నూతన శాసనాలూ, నాణెములూ, ఇతర సాక్ష్యాలూ బయటబడినకొలదీ కాకతీయ యుగవిశిష్టత ముందుకంటె ఎక్కువగా ఇప్పుడు ప్రకాశిస్తున్నది. డాక్టర్ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారి గ్రంథం చదివిన తెలుగువారికి ఈ విషయం విదితమే. సింథియాటాల్బట్ రచనకు కాకతీయయుగ శాసనాలు ముఖ్యసాధనాలు. కాకతీయ సామ్రాజ్యం పతనమయిన తరువాత ఆంధ్రభూమిని ఆదివరాహమూర్తులై ఉద్ధరించిన ముసునూరి నాయకుల చరిత్రను "ఆంధ్రచరిత్రలో విస్మృతాధ్యాయము" (ఎ ఫర్గాటెన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్రా హిస్టరీ) అనే పేరుతో రచించి

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రచరిత్రమీద ఆసక్తి కలిగిన తరతరాల తెలుగువారిని తనకు అప్పుపడిన వారినిగా చేసికొన్నారు.

ఆచార్య ఎన్.జి. రంగా అనేక గ్రంథాలు శ్రద్ధగా పరిశీలించి "కాకతీయ నాయకాస్" రచించారు. ఆబాలగోపాలమూ కాకతీయ నాయకుల అడుగుజాడల్లో నడచి హింసాద్వేషాలను రూపుమాపి భారతీయధర్మాన్ని పాదుకొల్పాలనే ఆకాంక్షా, లక్ష్యమూ ఈ గ్రంథ రచనకు వారిని ప్రేరేపించాయి. గ్రంథ ప్రథమభాగంలోని ప్రతిపుటా దీనికి సాక్ష్యమే. కాకతీయనాయకులతో అభేదం భజించి వారీభాగాన్ని రచించారు. ఇక రెండవభాగం కాపయనాయకుని కుమారుడయిన వినాయకదేవుని ఉద్రేకప్రధానమయిన పరాక్రమాన్ని వెల్లడించే నాటిక. సోమశేఖరశర్మగారి గ్రంథంలో 86వ పుటనుండి 89వ పుటదాకా విస్తరించిన విషయానికి ఉద్వేజకమయిన ఏకాంక కల్పనం.

కాకతీయయుగంలో గ్రామసభలు పరిపాలనకు పునాదులు. గణపతిదేవ చక్రవర్తి మండలాధిపతులను జయించినప్పటికీ వారి రాజ్యాలను తిరిగి వారికే అప్పగించాడు. ఆయన పరిపాలనకాలంలో రాజవంశాలకు చెందిన మాండలికులు ప్రబలులై స్వతంత్రులుగా వ్యవహరించేవారు. వీరి శాసనాలను చదివితే వీరు తమ్ముతాము ఎంతగొప్పవారిగా భావించుకొన్నారే తెలుస్తుంది. గణపతిదేవ చక్రవర్తి రాజ్యం మాండలిక సమాఖ్య అని చెప్పవచ్చు. రుద్రమదేవి సింహాసన మెక్కినపుడు ఈ మాండలికు లెదురుతిరిగారు. కాయస్థ కులజుడయిన అంబయదేవుడు ఆడిన ఆటలన్నింటిసీ చరిత్ర చాటుతూనే ఉన్నది. రుద్రమదేవి కాలంలో మాండలికవ్యవస్థను త్రోసిరాజన్న "నాయంకర" పద్ధతి ప్రారంభమై ద్వితీయ ప్రతాప రుద్రుని కాలంలో పరిపుష్టిగాంచింది. ఆనాడు ఇది సైనికవ్యవస్థకు సంబంధించినట్టిది. రాజు ఒక్కొక్క నాయకునకు ఒక్కొక్క "స్థలం" ప్రసాదించేవాడు. కొన్ని గ్రామాల సమూహానికి "స్థలం" అని పేరు. నాయకుని పరిపాలన విభాగానికి "నియోగము" అని కూడాపేరు. నాయకుడు తనపాలికి వచ్చినభూభాగాన్ని పాలిస్తూ కావలసినప్పుడు నిర్ణయించిన సైన్యాన్ని రాజుకు సమకూర్చేవాడు. ఆనాడు డెబ్బది రెండునాయకవంశాలున్నాయని చరిత్రకారులు చెప్పారు. ఈ నాయంకరవిధానం విజయనగర రాజుల కాలంలో పరిపూర్ణంగా ప్రశస్తిగాంచింది. నాయకులేకాకుండా "లెంకలు" అనేవారు కూడా కాకతీయయుగంలో ప్రసిద్ధికెక్కారు. వీరు ప్రభువునకు అంగరక్షకులు. ప్రభుపుత్రులమని చాటుకొన్నారు. రాజుకొఱకు ప్రాణమానాలు సమర్పించటానికి వెనుదీయనివారు. వీరిలో కొందరు రాజు మరణించినతర్వాత ఇంక తాము జీవించటం వ్యర్థమని ప్రాణాలు త్యజించారుకూడా. ఈ లెంకలలో కొందరికి "వీరగల్లులు" తెలుగునాట ఏర్పడ్డాయి.

నాయకులుగానీ, లెంకలుగానీ రాజవంశాలవారుగారు. వీరు సామాన్య కుటుంబాల్లో జన్మించిన కృషీవలులు, ఇతరవృత్తులవారు. అన్నికులాలకు చెందినవారు. అవక్రపరాక్రమ మొక్కటే ప్రధానగుణంగా పైకివచ్చిన వీరమూర్ధన్యులు. అందువల్లనే వీరి శాసనాల్లో మహామండలేశ్వరులూ, మండలేశ్వరులూ, వేయించిన శాసనాలలోని "ప్రశస్తి" కనబడదు. "కాకతీయనాయకాస్" అచ్చమయిన ప్రజాచరిత్ర. భారతదేశ - ప్రాంతీయచరిత్ర రచనలలో సంభవించిన పరిణామానికి ప్రతీక.

ఆచార్య ఎన్.జి.రంగా ఈవిశిష్టగ్రంథంలో అక్కడక్కడా అభివ్యక్తీకరించిన అభిప్రాయాలను అంగీకరించటం నాకు సాధ్యంకాదని చెప్పకతప్పటంలేదు. అభిప్రాయ భేదాలకు కొన్నింటికి కారణాలు క్రమంగా మనవి చేస్తాను.

దేవగిరిరాజులు కాకతీయరాజులు తమ యుద్ధావసరాలకు శైవ-బౌద్ధ-జైన-మతద్వేషాలను రెచ్చగొట్టారనీ, హిందూమత ప్రచారానికై గణపతిదేవ చక్రవర్తి తిక్కన మహాకవిని ఓరుగంటికి పిలిపించాడనీ, కవిబ్రహ్మ బౌద్ధజైనులతో వాదించి ఆ మతాలనిరసన, నిరాదరణ వారిని హింసించటం శాస్త్రసమ్మతమని తనవాదనాపటిమతో తేల్చిచెప్పాడని రంగాగారు ఖరాఖండిగా చెప్పారు.

ఏ సాక్ష్యాలనుబట్టి వారీవిధంగా నిర్ణయించారో దుర్గ్రహంగా వున్నది. ఒకవేళ వారికి సాక్ష్యాలు లభించినవనుకుందాం. అవి ఆ రాజుల కాలంనాటివా? లేక తదనంతరకాలం నాటివా? మొదటి బేతరాజు, రెండవబేతరాజు, రెండవ ప్రోలరాజు, ఇతని కుమారుడు దుర్గరాజు జైనులను ఆదరించారు. జినాలయములకు కానుకలిచ్చారు. జైనబసతులను నిర్మించారు. వీరి తరువాతి కాకతీయరాజు రుద్రదేవుని మంత్రి గంగాధరుడు జైన బసతిని నిర్మించలేదా? చివరికాకతీయరాజు రెండవ ప్రతాపరుద్రుని కాలంలో జైనుడయిన అప్పయార్యుడు "జినేంద్రకళ్యాణాభ్యుదయం" రచించాడే. బెక్కల్లు శాసనం ఆనాటి ప్రజల సర్వమతసమభావాలను వెల్లడిస్తున్నది గదా!

గోళకీమఠానికి చెందిన పాశుపతశైవం గణపతిదేవ చక్రవర్తి కాలంలో వర్ధిల్లింది. పాశుపతమతాచార్యుడు విశ్వేశ్వరశివుడు రాజగురువుగానే కాకుండా గణపతి దేవ చక్రవర్తికి దీక్షా గురువుగా కూడా సంభావితుడయ్యాడు. ఏకారణంవల్ల ఆంధ్ర చక్రవర్తి హిందూ మత ప్రచారం చెయ్యాలని అనుకొన్నాడు? తన దీక్షాగురువు తనకోరిక నెరవేర్చజాలని అశక్తుడని నిశ్చయించి గణపతిదేవుడు నెల్లూరినుండి తిక్కనను పిలిపించాడా? ఈ సందర్భంలో "హిందూమతం" అంటే ఏది? ఈ ప్రశ్నలకు జవాబులు లభించటంలేదు. రాజ్యం పోగొట్టుకొన్న తన ప్రభువు రెండవ మనుమసిద్ధిని సింహాసనస్థునిజేయ సంకల్పించి

తిక్కన గణపతిదేవుని సాహాయ్యమర్థించటానికి ఓరుగల్లు చేరాడని ప్రసిద్ధ చరిత్రకారులు చెప్పారు. జైన బౌద్ధమతాలను నిరసించటం, ఆ మతాలవారిని హింసించటం శాస్త్రసమ్మతమే అని తిక్కన తేల్చిచెప్పాడని రంగాగారనటం విడ్డూరంగా వున్నది. మతద్వేషం కవిబ్రహ్మ ప్రకృతే అయినట్లయితే అది ఆయన రచించిన హరిహరనాథస్తుతి పద్యాల్లో గూడుకట్టుకొనియుండేదే. ఆయన పాల్కురికి సోమనాథునివంటివాడు కాడు. చివరగా ఒక్కమాట. ఆంధ్రజాతీయతకు అహోరాత్రాలూ పాటుపడిన కాకతీయరాజులు మతద్వేషాన్ని రెచ్చగొట్టినట్లయితే వార కోరిక కోరికగానే మిగిలిపోయేది. వారు తమిళ కర్ణాటకరాజుల వాడకట్టులో చేరియుండేవారు.

"రుద్రమదేవికి మగసంతానం లేదు. నలుగురు ఆడుబిడ్డలు" అని రంగాజీ వ్రాసారు. ఈమాట లెంతవరకు నిజమో పరిశీలించాలి. రుద్రమదేవికి నలుగురుకూతుళ్ళు జన్మించారనటం నిజంకాదు. మొన్నమొన్నటిదాకా ఆమెకు ఇద్దరేకుమార్తెలని చరిత్రకారులు భావించారు. వారిపేరులు ముమ్మడమ్మ, రుయ్యమ్మ. రుద్రమదేవి పెద్దకూతురయిన ముమ్మడమ్మను మహాదేవుని కిచ్చి వివాహం చేసింది. మహాదేవుని పుట్టుపూర్వోత్తరాలు తెలియవని మల్లంపల్లి సోమశేఖరశర్మగారూ, నేలటూరి వేంకట రమణయ్యగారూ అన్నారు. కాని పి.వి. పరబ్రహ్మశాస్త్రిగారు మహాదేవుడు కాకతీయ యువరాజని చెప్పారు. వారే రుద్రమదేవి 'రెండవ కుమార్తె పేరు రుద్రమయనియు ఆమెను యాదవవంశజుడైన ఎల్లణదేవుడు వివాహము జేసుకొనినట్లు ఇటీవల వెలువడిన ఆలపాడు తామ్రపట్టికల ద్వారా తెలియుచున్నది" అని క్రొత్తగా చెప్పారు. అప్పుడు రుయ్యమ రుద్రమదేవి మూడవకూతురవుతుంది. ఆమె ఇందులూరి అన్నయమంత్రిని వివాహమాడింది. అన్నయ రుద్రమదేవి మహాప్రధానుడు. సేనాధిపతి, ప్రస్తుతం రుద్రమదేవి సంతానాన్ని గూర్చి ఎవరయినా చెప్పగలిగిందింతే.

"ఈ యుద్ధములలో రుద్రమదేవి ఓడి దేవగిరి యాదవులకు బందీ అయినది" (పుట 14) అనీ, "గణపతి దేవుడు రుద్రమదేవి ఇరువురూ యాదవులకు బందీలై వారి ఔదార్యమున విముక్తిపొందినవారే" (పుట 20) అనీ రంగాగారన్నారు. సూక్ష్మంగా విచారింపదగిన అభిప్రాయాలివి.

మొదటి రుద్రదేవుడు స్వతంత్ర కాకతీయ రాజ్యస్థాపన చేసిన శౌర్యశాలి. ఇతని తమ్ముడు మహాదేవుడు. ఇతనికుమారుడు గణపతి దేవుడు. రుద్రదేవ మహాదేవుల కాలంలో యాదవరాజు జైత్రపాలుడు (జైతుగి) దేవగిరిని పాలిస్తున్నాడు. ఇతని కుమారుడు సింఘణుడు. ఏకారణంవల్లనయితేనేమి రుద్రదేవుడు జైతుగితో జరిగిన యుద్ధంలో

మరణించాడు. రుద్రదేవుని తర్వాత రాజయిన మహాదేవుడు కూడా దేవగిరిపై దండెత్తి జైతుగిచేతిలో చనిపోయాడు. ఈ యుద్ధంలో పాల్గొన్న గణపతిదేవుడు యాదవులకు చిక్కి బందీ అయ్యాడు. కాని జైతుగి గణపతిదేవునకు కారాగారవిముక్తి కలిగించి కాకతీయ సింహాసనస్థుడుగా చేశాడు. అందువల్లనే తండ్రికొడుకులయిన జైతుగి సింఘణులను యాదవరాజుల శాసనాలు "తెలుంగరాయ శిరఃకమలోత్పాటను"లనీ, "తెలుంగురాయ స్థాపనాచార్యు'లనీ వర్ణిస్తున్నాయి. కాబట్టి గణపతి దేవుడు యాదవులకు బందీయై విముక్తి పొందటం సత్యం.

కాని ఏయాదవరాజూ రుద్రమదేవిని బందీగా చేయనూలేదు. ఆమెను ఔదార్యంతో వదలిపెట్టనూలేదు. రుద్రమదేవికి సమకాలికుడయిన యాదవరాజు మహాదేవుడు. ఇతడు కాకతీయరాజ్యం మీద దండెత్తి జీవితంలో మరచిపోలేని పరాభవం పొందాడు. శక్తిస్వరూపిణి అయిన రుద్రమదేవి దేవగిరిదాకా మహాదేవుని తరిమికొట్టింది. బీదరును కూడా వశంచేసికొన్నది. యాదవరాజులు కొందరామెకు సామంతులయ్యారు. మహాదేవుడు గతిలేక సంధిచేసికొని ఆంధ్రమహారాజ్ఞికి కోట్లకొలది ధనం సమర్పించుకొన్నాడు.

వాస్తవ మిట్లుండగా మహాదేవుని మంత్రి, సంస్కృత విద్వాంసుడూ అయిన హేమాద్రి తాను రచించిన "చతుర్వర్గ చింతామణి"లో తన ప్రభువు రుద్రమదేవిని జయించి ఆమె గజసైన్యాన్నీ, పంచ మహావాద్యాలను అపహరించి, అబలకావటంచేత ఆమెను చంపకుండా దయదలచి వదలిపెట్టాడని పొగడ్తలు గుప్పించాడు. విజితుడయినరాజును విజేతగా వినుతించటం ఈ విద్వాంసునకే చెల్లింది. తమ సుల్తానులు యుద్ధాల్లో ఓడిపోతే వారేగెలిచినట్లుగా కొందరు మహమ్మదీయ చరిత్రకారులీపోకడే పోయారు. ఇంకా విడ్డూర మేమంటే హేమాద్రితోపాటు మహాదేవుని శాసనాలు కూడా ఆయనకు "తెలుంగరాయ శిరః కమలోత్పాటన" బిరుదమున్నట్లు చాటుతున్నాయి. ఇంతకూ మహాదేవుడు ఏ తెలుగురాజు శిరఃకమలాన్ని కోసివేశాడు అనగా సంహరించాడు? చంపాడనటం బూటకం, తమ పూర్వుల బిరుదులను తరువాతి రాజులు తగిలించుకొనటం సంప్రదాయంగా ఉన్నట్లు ప్రాచీనశాసనాలు నిరూపిస్తున్నాయి. మహాదేవుడు ఆ సంప్రదాయాన్నే పాటించాడు.

"ఇందిరాగాంధీని మూడవసారి ప్రధానిగా చూడగలగటం భారతీయుల ఉదారవిధానానికి కాకతీయ వారసత్వానికి ఒక ఉదాహరణగా మనం వివరించవచ్చు." (పుట 87) అని రంగాగారు తీర్పు చెప్పటం విచిత్రంగా ఉన్నది. వారు ప్రాచీన-నవీనరాజకీయ సాంఘిక పరిస్థితులకు పొత్తుకలుపుతూ చెప్పినమాటలు గ్రంథంలో చాలాచోట్ల ఉన్నవి. వాటిల్లో ఇవికూడా చేరుతాయి. రాజ్యాంగం ఆధారపీఠంగా ఉన్న భారతప్రజాస్వామ్య వ్యవస్థ పరిణమించిన విధానానికి గుర్తుగా ఇందిరాగాంధీ మూడవసారి

ప్రధానమంత్రిణిగా ఎన్నికయింది. ఈ ఎన్నిక కాకతీయ వారసత్వానికి గుర్తుగాదు. ఒకానొకమహిళ రుద్రమదేవి మాదిరిగా రాజ్యోన్నత పదవి నలంకరించటం కాకతీయ వాస్తవం అని ఎవరయినా నిర్వచనం చెప్పవచ్చు. ఆపక్షంలో ఇందిరాగాంధి ఎన్నిక కాశ్మీరసంస్కృతి (కాశ్మీరియత్) వారసత్వానికి గుర్తు అని చెప్పవలసుంటుంది. కల్హణుని "రాజతరంగిణి" మహిళలు కొందరు కాశ్మీరాన్ని పరిపాలించారని చెప్తున్నది. ఇందిరాగాంధీ కాశ్మీరానికి చెందిన పండితవంశంలోని కౌల్-నెహ్రూ కుటుంబంలో జన్మించింది. అందువల్ల ఆమె ఎన్నిక కాశ్మీరపు వారసత్వానికి గుర్తు అని చెప్పటం సహేతుకమవుతుంది.

ముసునూరి నాయకులూ, రేచర్ల వెలమలూ, పంటరెడ్లూ, హరిహర బుక్కరాయాదులూ, దక్షిణాంధ్రనాయకరాజులూ కాకతీయుల వారసత్వాన్ని ముమ్మూర్తులా పుణికిపుచ్చుకొన్నారు. కాకతీయరాజులు - ముఖ్యంగా ద్వితీయ ప్రతాపరుద్రుడు - వీరికి చిరస్మరణీయులయ్యారు. ప్రోలవరశాసనం కాపయనాయకుడు ప్రభావమున ప్రతాపరుద్రునితో సమానుడని ప్రశంసిస్తున్నది. ప్రతాపచరిత్రమూ, సిద్దేశ్వర చరిత్రమూ, సోమదేవరాజీయమూ తెలుగువారు కొన్ని వందల సంవత్సరాలపాటు కాకతీయులను మరచిపోలేదని నిరూపిస్తున్నవి. గ్రామకైఫీయతులు కూడా దీనికి సాక్ష్యాలు. అయితే వీటిల్లోని విషయాలను ఇతర సాక్ష్యాలతో పోల్చి మనం సత్యాన్ని గుర్తించాలి. కాకతీయవంశజులయిన రాజులపేర, రాణులపేర దేవతామూర్తు లవతరించాయి. గ్రామాలు రూపొందాయి. 1917 "బ్రాహ్మణేతరోద్యమము" ప్రారంభ మయిననాటి నుండి కాకతీయ వారసత్వం ఆంధ్రదేశంలో ఎలమీదకు వచ్చింది.

రంగాజీగ్రంథాన్ని అనువదించిన శ్రీసీతారామారావు "నామాట"లో "నే నీ గ్రంథమును మనసుపెట్టి, నాకున్న పరిమిత భాషాజ్ఞానముతో మాతృకను కుదింపక విస్తరింపక యథాతథముగా తెనుగుచేసితిని. నా స్వకపోలకల్పనలిందేమియు లేవు" అని ఒకమాటగా చెప్పికొన్నాడు. "కాకతీయనాయకులు" యథామూలానువాదమని పాఠకులు గ్రహించాలి. అనువాదం సరళంగా సాగింది. ఎక్కడా క్లిష్టత కనబడదు. స్పష్టత మొక్కవోలేదు. ఉదాహరణగా

"సైనికోద్యోగాలకు గట్టిపోటీ ఉండేది. కొల్లగొట్టిన సొమ్ములో సైన్యానికి వాటా ఉండేది. సాహసప్రదర్శనకు, సాంఘికౌన్నత్యానికి సైన్యంలో చేరటం రాచబాట. ధైర్యసాహసాలే కొలబద్ద. కులం గోత్రం కాదు. ఉన్నత వర్గాలవారీ అవకాశాలు ఎక్కువగా ఉపయోగించుకోగలిగారు..." అనే అనువాద భాగాన్ని చూపవచ్చు.

ముసునూరి విలస శాసనాన్నీ, అనితల్లి కలువచేరు శాసనాన్నీ, ముసునూరి కాపయ ప్రోలవరం శాసనాన్నీ మూలానువాదాలతో అనుబంధాలుగా చివరచేర్చటం గ్రంథ

ప్రామాణికత్వానికి నిదర్శనం. అదేవిధంగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "కాకతి" వ్యాసం కూడా గ్రంథాంతాన చేరింది. కాకతీయ, ముసునూరి రాజవంశవృక్షాలను చూపటం సముచితంగా వున్నది. అనుబంధాలన్నీ పాఠకుల విజ్ఞానాన్ని విస్తరింపచేసేవే.

శాసనాల యనువాదాలు యథామూలంగా, సుబోధకంగా సాగాయి. కాని విలసశాసనంలోని 63వ శ్లోకం అనువాదాన్ని సవరింపక తప్పదు. మాతృకలో "విప్రేభ్యో విధివత్ ధేనూః ప్రదత్వో భయతో ముఖీః" అనేది మొదటిపాదం. దీనికి "ప్రోలయ ఇహపరసాధకములైన (ఉభయతో ముఖీః) ధేనువులను బ్రాహ్మణులకు దానమొనర్చి" అని అనువాదం. ఈ తెలిగింపు నవీనమయినట్టిది.

ఉభయతోముఖి అంటే రెండు ప్రక్కల ముఖములు గలదని అర్థం. ఈ పదాన్ని ఈనుతున్న ఆవు కుపయోగించటం సంప్రదాయం. ఈనుతున్న ఆవుకు ముందూ వెనుకా రెండు ముఖాలుంటాయి. ముందు దాని ముఖం ఉంటుంది. వెనుక బయటికి కనబడే దూడముఖం ఉంటుంది. అందువల్ల ఈనుతున్న ఆవుకు ఉభయతోముఖి అనే సార్థక మయిననామధేయం ఏర్పడింది. ఇటువంటి ఆవులను దానం చేయటం మహాపుణ్యాకార్యమని పూర్వకాలంలో రాజులు భావించారు. ఈకారణంవల్ల ప్రోలయ "ఈనుచున్న ఆవులను శాస్త్రోక్తంగా బ్రాహ్మణులకు దానంచేసి" అని అర్థం చెప్పాలి. కీ.శే. తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తిగారు "ఉభయతోముఖగవాయుతదానఫల ధాత్రి సత్యోక్తి..." అని "ధర్మజ్యోతి"లో చెప్పారు. "ఉభయతోముఖ + గో+అయుత+ దానఫల+దాత్రి" అని పదచ్ఛేదం. నిజమయినమాట పదివేల యీనుచున్న గోవులను దానంచేసినంత ఫలాన్ని ఇస్తుందని అర్థం.

ఉభయతోముఖిపదానికి రూపాంతరం ఉభయముఖి. ఈపదం మల్యాలగుండయ బూదపూరు శాసనంలో కనబడుతున్నది. బూదపూరు శాసనకాలం క్రీ.శ. 1272 (చూడు హైదరాబాద్ ఆర్కియాలాజికల్ సీరీస్ 13-51) "కేశవఘటశాసులకు ఉభయ ముఖీదానమున్ను" అనే వాక్యభాగాన్ని ఈ శాసనంలో మనం చూడగలం.

"కాకతీయ నాయకులు" గ్రంథానికి ముందు మాటలు వ్రాయటానికి శ్రీసీతారామారావు నన్నెందుకు ఎన్నుకొన్నాడో నాకు తెలియదు. నాకుతెలిసిందెల్లా ఆయనకు నాయందుగల ప్రణయసౌహార్దం మాత్రమే. అదే నేనంగీకరించేటట్లు చేసింది. అంతేకానీ నా చరిత్ర పరిశోధన ప్రాగల్భ్యం కారణం కాదు. ఈపనివల్ల "అప్పుతీర్చినవాణ్ణయ్యా"నని భావిస్తూ శ్రీసీతారామారావు ఇతోధికంగా భాషాసేవ చేసి పేరుపొందాలని కోరుతున్నాను.



# నా మాట...

శ్రీ యన్.జి. రంగాగారి భక్తుడను నేను. ఈ అనువాదము చేయుటకు భక్తిభావమొక్కటే ప్రేరణకాదు. వారి "కాకతీయ నాయకులు" ఆంగ్ల గ్రంథ రచన "ప్రభు వెక్కిన పల్లకి కాదోయ్. అది మోసిన బోయీలెవ్వరు" అన్నవతుగా సాగినది. చారిత్రకాంశముల ప్రాధాన్యంతో పాటు సామాజిక స్పృహ పరిమళించినది. ప్రపంచ విముక్తి పోరాటములతో పూజ్య రంగాజీగారి అనుబంధము. అవగాహన, భాగస్వామ్యము ఈ గ్రంథమున ప్రతిఫలించినవి. ప్రతాపరుద్రుడు. ప్రోలయ, కాపయ, వినాయక దేవుల నాలంబనము చేసుకొని, పూజ్య రంగాజీ గ్రామస్వామ్యము, స్వపరిపాలన, చేతి వృత్తుల వారి స్వతంత్ర జీవనము, రైతాంగపు ప్రాథమిక హక్కులు, పంచాయితీవ్యవస్థ అధికారములను, వేయేల తన జీవిత ఆశయమగు "రైతుకూలీ శ్రేయోరాజ్యము" సాధనకై తాను పడిన తపనను పఠితల హృదయములలో సూటిగా నాటుకొనునట్లు రచించినారు.

పూజ్య రంగాజి ఆంగ్లము సరళము. సుబోధకము. వాక్య నిర్మాణము సుదీర్ఘము. వారీ గ్రంథమున కట్టలు త్రెంచుకొని ఉరుకు తమ భావావేశమును పలుచోట్ల నిబ్బరించుకొనినారు. ఆయాపట్టుల వారి శైలి శివజటాజూట వినిర్గత గాంగఝురీ సదృశముగా ఉన్నది. ఆంగ్ల భాషయందు తెనుగు నుడికారపు సొంపులను మిగుల హృద్యముగా పొందుపరచినారు. అది వీరి రచనా శిల్పపు విలక్షణత, విశిష్టత.

కాకతీయులు అచ్చమయిన తెనుగు రైతులు. "కాకితమ్మ" అను గ్రామదేవత నారాధించి ఆ తల్లి అనుగ్రహమునకు పాత్రులయిన 'కమ్మవారు'. నతవాటిసీమ, దివిసీమ, కొండ పడుమటి సీమ ధాన్యకటకప్పు కమ్మవారితో చేసుకొనిన వివాహ బాంధవ్యము లిందుకాధారములు. ముసునూరి ప్రోలయ, కాపయులు, భారత ధర్మము, ఆంధ్రత్వములకై విజయవంతమగు పోరాటములు నడిపి తెలుగుజాతికై యశోకాయులయిన మహాయోద్ధలు.

నేనీ గ్రంథమును మనసుపెట్టి, నాకున్న పరిమిత భాషా జ్ఞానముతో, మాతృకను కుదింపక, విస్తరింపక యథాతథముగా తెనుగు చేసితిని. నా స్వకపోలకల్పన లిందేమియు లేవు.

ఈ గ్రంథమున "సంస్కృత శాసనము"లను ఆంధ్రీకరించిన వారు బహుభాషా వేత్తలు, బహుగ్రంథకర్తలు, సహృదయులగు మాన్యమిత్రులు కీ. శే. శ్రీపులిచెర్ల సుబ్బారావు గారు. ముద్రణ పర్యవేక్షణ అంతయు వారి చేతిమీదుగనే జరిగినది. ముఖచిత్ర రచన చేసినవారు మిత్రులు శ్రీ పులిచెర్ల సాంబశివరావుగారు జె.కె.సి. కళాశాల ఆంధ్రోపన్యాసకులు.

ఈ అనువాదమున అడుగడుగునా ప్రోత్సహించి తగు సలహా సానుభూతులు. అందించిన సోదరులు "రసజ్ఞులు" (కీ. శే. శ్రీ గుంటుపల్లి నాగేశ్వరరావు, ఎం.ఏ., (ఆంగ్లభాషోపన్యాసకులు, జె.కె.సి. కళాశాల), ఆధునికాంధ్ర నాటకరంగ నిర్వహణాధురీణులు, కాకతీయ కళాపరిషత్ కార్యదర్శి నాకత్యంత ఆప్తుడైన చిరంజీవి కందిమళ్ళ సాంబశివరావు. ఎం.ఏ., పిహెచ్.డి. గార్లకు నా కృతజ్ఞతలు.

ఇది నా కానక కన్న కాన్పు.

పూజ్య రంగాజీ భక్తాంఘ్రిరేణువునగు నేను చేసిన ఈ సాహసమున ఏమయిన "ప్రమాదము"లున్న క్షంతవ్యుడను

**– అనువాదకుడు**

# మున్నుడి

భారతదేశ చరిత్రలో స్వాతంత్ర్య సాధనకు దేశదాస్య విముక్తికి వివిధ వర్గాల రైతన్నలు చిరస్మరణీయమయిన పోరాటాలు నడిపారు.

పంజాబు, సింధు, జాటు రైతాంగం సాగించిన గెరిల్లా పోరాటాలకు తట్టుకోలేక "విశ్వవిజేత అలగ్జాండర్" భారతదేశ భూభాగాలను వదలి ఇంటిదారిపట్టాడు. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ ముస్లింల దండయాత్రలను రాజపుత్రులు, గుజరాత్ రైతులు నిలువరించారు.

క్రీ.శ. 1194 లో ఢిల్లీ దురాక్రమణదారుల వశమయింది. మొగలాయీల సార్వభౌమాధికారం వచ్చింది. సాంఘిక, రాజకీయ స్వేచ్ఛలకయి రాజస్థాన్, మాల్వా, గుజరాతు వింధ్యప్రదేశ్ రాజపుత్రులు మొగలాయిలతో ఘర్షణ పడ్డారు. మహారాణి పద్మావతీదేవి, రాణాప్రతాప్, మీరాబాయి, కబీరు, సూరదాసుల నామస్మరణ జాతికి ఉత్తేజం కలిగించింది.

తరువాత కాలంలో ఉయదపూరు మహారాజు రాజా అమర్‌సింగ్, భరత్‌పూర్ కృష్ణ మహారాజు, గురుగోవిందసింగ్, ఛత్రపతి శివాజీలు, ఔరంగజేబు (క్రీ.శ. 1658-1707) భారతీయ సంస్కృతీ వినాశనమునకై జరిపిన దౌర్జన్యాలకు వ్యతిరేకంగా విప్లవశంఖాలు పూరించారు. ఈ విప్లవాలు మొగలు సామ్రాజ్యాన్ని బలహీనపరిచాయి. ఈ పోరాటాల్లో ముందు నిలిచిన రైతాంగం రాజకీయ ప్రాముఖ్యం సంతరించుకొన్నది. సర్వంసహా భారతచక్రంలో వీరిస్థానం సమున్నతమయినది. వీరి వీరోచిత పోరాటాలు, గాథలుగా కావ్యాలుగా రూపకాలుగా మిగిలినవి. వారి వారి వంశీయులకు విదేశీయులకు గర్వకారణములయి నేడు అత్యంతావశ్యకమయిన సాంఘిక రాజకీయ నాయకత్వమునకు దోహదమయినవి.

దక్షిణ భారతదేశంలో కాకతీయ నాయకులు నాడు ఢిల్లీ సుల్తానులతో జరిపిన పోరాటాలు, నేటి మనదేశ భక్తితత్పరతకు, ఉద్యమాలకూ స్ఫూర్తినిచ్చాయి. పల్లవులూ, రాష్ట్ర కూటులూ చాళుక్యులు చోళలూ కాకతీయ చక్రవర్తులూ తమ ధైర్య సాహసాలనూ, సైన్య సంపదనూ యుద్ధ కౌశలాన్ని ఇతర రాజవంశాలను నిర్వీర్యం చేయటానికి, తమతమ వంశ ప్రతిష్ఠలు పెంచుకోవటానికి వ్యయించగా - కాకతీయ నాయక వంశముల వారు

"ఆంధ్రత్వ - భారతీయ ధర్మము'ల కయి విప్లవ పోరాటాలు సాగించారు. దేశభక్తి, ధర్మానురక్తి వారి పోరాటాలతో మిన్నుముట్టినవి.

కాకతీయనాయకసమాఖ్య తన విప్లవ కేతనాన్ని దేశభక్తి, ఆంధ్ర సాహిత్యానురక్తి ఆంధ్రత్వ నినాదాల బాసటతో ఎగురవేసింది. నన్నయ, నన్నెచోడ, తిక్కన, పాలుకురికి సోమన మహాకవుల రచనలూ, వీరశైవ వీరవైష్ణవ మత ప్రచారకుల సాహిత్య సేవలూ జాతిని జాగృతం చేశాయి. క్షాత్ర ధర్మానురక్తులు మేధావులు అయిన తెలుగు రైతులు రామాయణ మహాభారత కథానాయకుల నుండి స్ఫూర్తి పొందారు. వీరశైవ వీరవైష్ణవ మతాచార్యులు స్పందించి ప్రాంతీయాభిమానమును, ధర్మ పరిరక్షణావశ్యకమును ప్రబోధించారు.

నాటి వరకు వంశ పారంపర్య చక్రవర్తుల నీడలలో రాచరిక బలగాలుగా ఉన్న కాకతీయ నాయకులు స్వతంత్రంగా రాజకీయ నాయకత్వం చేపట్టారు.

**ఎన్.జి. రంగా**

# పరిచయం

ఈ సిద్ధాంత గ్రంథం ఆరు శతాబ్దాలనాటి దక్షిణ భారతదేశపు రాజకీయ సాంఘిక విపత్కర పరిస్థితులకు, దక్షిణాపథ విమోచనోద్యమానికి కాకతీయ నాయకుల వారి అనుచరుల నిర్మాణాత్మక కృషికి, ప్రదర్శించిన దేశభక్తికి అద్దంపడుతున్నది. వారి త్యాగాలు ప్రశంసనీయము. భారతదేశంకొరకు భారతధర్మం కొరకు పాటుబడిన తరువాతి తరాలవారికి కాకతీయుల ప్రబోధాత్మక ఆదర్శాలు మార్గదర్శకాలయ్యాయి. ఈ ఆదర్శాలు అంకితభావం త్యాగనిరతి భారతదేశ స్వాతంత్ర్యసాధనకు ప్రజాస్వామ్య బద్ధమయిన రాజ్యాంగరచనకు, స్వతంత్ర న్యాయవ్యవస్థకల్పనకు తద్వారా రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కుల పరిరక్షణకు మార్గాన్ని సుగమం చేసినవి.

14వ శతాబ్దంలో కాకతీయ నాయకులు ఏ ఆదర్శంకొరకు పోరాడారో ఆలానే మన బిడ్డలు, ఆత్మగౌరవం గల మన యువతీ యువకులు రాజనీతివేత్తలు ఈ దేశ అభివృద్ధికి ఐక్యానికీ శాంతి సంపన్నతకు సాంఘిక న్యాయపరిరక్షణకు. దేశం ఎదుర్కొంటున్న రక్షణోపద్రవాలనుండి రక్షణకు నడుంబిగించి నిలవాలి.

ఇది ఒక విప్లవ మార్గం. శాశ్వతమయి నిత్యకాంతిమంతమయి మనసులు పులకింపచేసి, ఉత్తేజపరచి గుండెలు మండించే గాథాతోరణాల వెలుగులబాట. ఈ వెలుగుల బాటనే నడిచి ప్రోలయ, కాపయ, వినాయక దేవుడు, అనపోతారెడ్డి వీర భల్లాళుడు. రాయచక్రవర్తులు తమ జీవితాలను జాతి ధర్మానికీ విధి నిర్వహణకు అంకితం చేసి దేశమాత పాదాలచెంత అసువులు వదిలారు.

విదేశీయ దురాక్రమణల నుండి మనదేశాన్ని రక్షించుకోవటానికి మన సాంస్కృతిక విలువల గౌరవోన్నతి సాధనకు మానవతా సాంఘిక న్యాయాలవైపు పురోగమించటానికి నాటికన్నా నేడు మనకు ఎక్కువమంది ప్రోలయలు కాపయలు రాయసోదరులు వీరభల్లాళులు అన్నయలు విద్యారణ్యస్వాములు, తిక్కన భాస్కరులవంటి మంత్రులు కాకతీయ లెంకలు, నాయకులు, ప్రభవించవలసిన అవసరమున్నది.

ఈ తరంవారికి (గాంధీ నిర్యాణం తరువాత) కాకతీయవీరులు ఇచ్చే సందేశం వుందని నేను భావిస్తున్నాను. మన విద్యార్థులు యువకులు ప్రజాబాహుళ్యం మేధావులు సాంస్కృతిక నాయకులు స్థిరయిన నిర్ణయం తీసుకోవలసిన అవసరం వున్నది. మావోయిష్టులు, నక్సలైట్లు గాంధీ బోధనలపై (గాంధీయిజం) ఆదర్శాలపై జరుపుతున్న

విద్వేషపూరిత ప్రచారాన్ని దాడిని అంకితభావంతో ఐక్యంతో ప్రతిఘటించటమా లేక మొగలాయిలకు పూర్వం ఉత్తర భారతదేశంలో జరిగిన దాడులను ప్రతిఘటించనట్లు వదలివేయటమా తేల్చుకోవాలి. కాకతీయుల అడుగుజాడలలో నడిచి గాంధీ ఆదర్శాలను మన ప్రాథమిక హక్కులను భారతీయ ధర్మాన్ని సంస్కృతిని దేశైక్యమును రక్షించుకోవలసిన అవసరం మనముందున్నదని నేను భావిస్తున్నాను.

ఈ సిద్ధాంత వ్యాసం దేశీయుల మానసిక స్థైర్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని పెంచి ఉత్తేజపరచటానికి, మన యువత కాకతీయ నాయకుల లెంకల త్యాగమయ మార్గాల్లో పయనించి మానవతా, ప్రాథమిక హక్కుల పునాదులపై నిర్మించిన ప్రజాస్వామ్య పరిరక్షణకు ఒక నూతనోత్సాహాన్ని కలిగించే సందేశం ఇచ్చుటకు ఉద్దేశించబడింది.

ముస్లిం పాలకులు దురాక్రమణదారులు. యుద్ధ విజయాలకోసం మత విశ్వాసాన్ని ఆయుధంగా వాడుకొన్నప్పటికీ, వారి వారసులగు ముస్లింలు, వీరితోపాటు ముస్లిం మతం స్వీకరించిన కోట్లాది భారతీయ ముస్లిం సోదరులు, వలసపాలనలో తమ ఆధిక్య ప్రాధాన్యములను నిలుపుకొనటానికి భారతీయులుగానే ప్రకటించుకొంటున్నారు. ఆ భావనపై విశ్వాసముంచిన వీరందరూ భారతీయులే.

జాతీయైక్యం, సామాజిక విలీనం, ఆర్థిక సౌహార్ద్రత హిందువుల, మహ్మదీయుల ఇతర అల్ప సంఖ్యాక వర్గాల మధ్య మనం కోరుకొంటున్నాం.

ఉద్దేశ్యపూర్వకంగానే నేను చరిత్రలో రక్తాన్ని గడ్డకట్టించే సంఘటనలతో వికృతమయిన నాటి సుల్తానుల పాలనను చర్చించకుండా వదలివేశాను. వారు మధ్య ఆసియా నుండి అనాగరికము పశుప్రాయము అయిన వ్యవస్థ నుండి వచ్చినవారు. అక్బర్, తానీషా, టిప్పుసుల్తాన్ మానవతా దృక్పథాన్ని పెంపొందించుకొని సహనాన్ని భారత ధర్మాన్ని తమలో జీర్ణం చేసుకొన్నారు.

ఈ వ్యాసం ద్వారా విదేశీయ ప్రభువుల (ఢిల్లీ, గుల్బార్గా) పాలన నుండి దక్షిణ భారతదేశానికి విముక్తి ప్రసాదించిన కాకతీయ నాయకులకు విజయనగర చక్రవర్తులకు నా కృతజ్ఞతలందిస్తున్నాను.

దురదృష్టవశాత్తు కాకతీయుల కాలంనాటి ఆంధ్రకవులు, తదనంతరం వారు (కొద్దిమంది మినహా) సంస్కృత కావ్యాల అనువాదాలతో, వల్లెతో, పునఃపునః వివరాణాత్మక పరిశీలనలతో కాలంగడిపి రాజుల సామంతుల కీర్తి గానంతో సరిపెట్టుకొన్నారు. కాకతీయుల కథను మనతరానికి అందించలేకపోయారు.

శ్రీనాథుడు అసాధారణ ప్రతిభా వ్యుత్పత్తులు కల పండితకవి. పల్నాటి వీరగాధను సంభ్రమాశ్చర్యాలు కలిగే విధంగా రచించి నాటి వీరనాయక సంప్రదాయాలను మనకందించాడు. దురదృష్టవశాత్తు బహుధా సృజనాత్మక ఆలోచనా పరిపూర్ణుడయిన శ్రీనాథుడు కూడా తనకు రెండు శతాబ్దాలకు పూర్వం జరిగిన సంఘటనలు సమాచారం ఆ కాలపు ఆశయాలు, ఆశలు, కడగండ్లు, కష్టాలు, బాధలు, త్యాగాలు తన పద్యాలలో పాటలలో పొందుపరచలేదు.

ఆర్ష సంప్రదాయ సంస్కృతీ విశ్వాసబద్ధుడయిన పోతన మహాకవి తన భాగవతంలో కృష్ణలీలలు, ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షం. వామన చరిత్ర వర్ణనలతో దేశవిముక్తికై కలలుకని వుంటాడు. నరకాసురవధ నాటి సత్యభామలో రుద్రమదేవిని దర్శించివుంటాడు. పోతన మహాకవి కూడా కాకతీయుల విజయాలను తన సాహిత్యంలో స్మరించకపోవడం మన దురదృష్టం.

సృజనాత్మక నాటకీయ శైలిలో ప్రతాపరుద్రుని ధైర్యసాహసాలను రాజనీతిని దేశభక్తిని తన "ప్రతాపరుద్రీయం" నాటక రచనతో శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు నేటికి మనకందించారు. ఏబది సంవత్సరాలుగా ఈ నాటకం గొప్ప సాహిత్య గౌరవం ప్రజాదరణ పొందింది. ఆంధ్ర చారిత్రకులయిన శ్రీ చిలుకూరి వీరభద్రరావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీబి.హెచ్. కృష్ణారావు, శ్రీ మారేమండ రామారావులకు ఆదర్శమయినది. శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్య వంటి కవులు ఈ చరిత్రను స్వీకరించి కావ్యకల్పన చేశారు. చరిత్రకూ తమకు గౌరవము సంపాదించారు. కల్పనాశక్తి అత్యంత కవితావేశము తన సొత్తయిన శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్య సుకవి 1948లో రుద్రమ రాజ్యార్హతపై చెలరేగిన వివాదాన్ని మనోహరంగా రచించాడు. ఆ గ్రంథ పరిచయంలో నేను సుదీర్ఘంగా కాకతీయ యుగ ఔన్నత్యానికి స్పందించాను. కాకతీయ సంచికను ప్రకటించిన ఘనత (1914) రాజమండ్రి ఆంధ్ర చారిత్రక మండలి వారికి చెందుతుంది. కాకతీయ యుగపు కవుల చరిత్రను ఆరుద్ర ఈ మధ్య గ్రంథస్థం చేశాడు. శ్రీ నేలటూరి వెంకట రమణయ్య శ్రీ సోమశేఖర శర్మలు (YAZDANI - EARLY HISTORY OF DECCAN) ప్రాచీన దక్కను చరిత్ర కొన్ని కొత్త అధ్యాయాలు చేర్చారు. ఉస్మానియా యూనివర్శిటీ ప్రాచార్యులు శ్రీ బి. రామరాజు గారు తన విద్యార్థులను కాకతీయ యుగపు రాజకీయ సాంఘిక పరిశోధనలకు ప్రోత్సహించి వారి పరిశోధనలు ప్రకటించారు.

దశాబ్దాల పరిశోధనా ఫలితమయిన SEWEL - FORGOTTON EMPIRE, నుండి శ్రీ సోమశేఖర శర్మల FORGOTTEN CHAPTER OF ANDHRA

HISTORY నుండి ఈ వ్యాసానికి ఎక్కువ సమాచారం గ్రహించాను. సెవెల్ మరియు కృష్ణస్వామి అయ్యంగార్ పరిష్కరించి ప్రకటించిన "INDIAN INSCRIPTIONS AND HISTORICAL INSCRIPTIONS OF SOUTH INDIA గ్రిబెల్ HISTORY OF DECCAN ఆర్యుద్ర కాకతీయ యుగం. THORSTON - CASTES AND TRIBES, కొత్త భావయ్య చౌదరి కమ్మవారి చరిత్రలు ఈ వ్యాస రచనకు ఎక్కువగా ఉపకరించినవి. ఆంధ్రుల సాంఘిక రాజకీయ సమైక్యాలను ఈ గ్రంథాల ద్వారా అవగాహన చేసుకోగలిగాను.

వివిధ సాంఘిక శక్తుల ఏకీకరణ పునరేకీకరణ కాలప్రవాహంతో పరుగెత్తినా, ఈ మార్పులన్నీ భారతీయ ధర్మానికీ సంస్కృతికీ అంకితమయినవే. ఉదారవాదుల ఛాందసవాదుల ప్రాబల్యానికనువుగా తమ సామాజిక దృక్పథమును అర్హతను పెంచుకొన్నవి. అర్థశతాబ్దిపైగా కాకతీయ నాయకులు లెంకలు సాగించిన జాతీయ విప్లవ పోరాటం వారిని పౌరాణిక క్షత్రియుల సరసన నిల్పింది. వారు తమ దేశభక్తితో త్యాగపటిమతో శౌర్య సాహసాలతో దేశభక్తుల హృదయాలలో స్థానం సంపాదించుకొన్నారు.

పురోహిత బ్రాహ్మణులు లాభాపేక్షతో అవకాశం కలిగినపుడు కల్పిత గోత్ర ప్రదానం చేసి కొన్ని వంశాలను క్షత్రియులుగా కీర్తించారు. మహాభారతకాలం నాటి క్షత్రియులు దక్షిణాపథంలో లేనేలేరు. దక్షిణాపథంలో వేదాలువల్లెవేసే విప్రుల నుండి దళితుల వరకు ధర్మరక్షణార్థం క్షత్రియ ధర్మావలంబకులయినారు. యుద్ధములు చేసి తమ శాఖలకు, కుటుంబాలకు, వంశాలకు, మతాలకు గౌరవం సంపాదించారు.

వీరగంధం, సూరపునేని, రాయుడు (విజయనగరం అనెగొందినీడు నాయుడు రాయుశబ్దాలు) సూరిరెడ్డి, సురవరం, వాసిరెడ్డి వంటి గౌరవప్రదమయిన వంశ నామములను గౌరవించి అభినందించకుండా ఎవరుండగలరు?

# IN MEMORIAM

# FREEDOM FIGHTERS
# AND
# KISAN LEADERS
## of Kakatiya Vintage

**GORREPATI VENKATA SUBBAIAH**
President, Andhra Kisan Sammelan (1942-69)

**NIDAMANURU VENKATARAMA NAIDU**, (Ex-M.L.A.)
Secretary, All India Rural Peoples Federation
Executive of International Federation of Agricultural Federation,
Paris, London and Washington

and

**G. LAKSHMINARAYANA**, M.A., B.L.,
General Secretary, All India Kisan Sammelan,
Member, Asian Food Commission, U.N.O.

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | కాకతీయ నాయకులు | 11 |
| 2. | కాకతీయ సమాజము - వారసత్వం | 17 |
| 3. | కాకతీయ చక్రవర్తులు | 23 |
| 4. | కాకతీయులు - ఢిల్లీ | 29 |
| 5. | ప్రతాపరుద్రుని బలిదానం | 36 |
| 6. | పశ్చాత్తాపము | 38 |
| 7. | వరంగల్లు నగరము | 40 |
| 8. | విప్లవ జ్వాలలు | [illegible] |
| 9. | ప్రోలయ - కాపయ | 51 |
| 10. | విప్లవ విజయం | 62 |
| 11. | కర్ణాటక విముక్తి | 65 |
| 12. | నాయకయుగపు ఒడిదుడుకులు | 69 |
| 13. | కాకతీయ నాయకుల వారసత్వం | 83 |
| 14. | నాయకయుగ వైఫల్యాలు | 91 |
| 15. | అభివృద్ధి సూచికలు | 96 |
| 16. | సాంఘిక సంక్షేమం | 100 |
| 17. | నాయకశబ్దము - వ్యుత్పత్తి | 103 |
| 18. | మరోమాట | 105 |
| 19. | వినాయక దేవుడు | [illegible] |
| 20. | వివరణలు | [illegible] |
| 21. | అనుబంధము - 1 | 128 |
| 22. | అనుబంధము - 2 | 142 |
| 23. | అనుబంధము - 3 | 145 |
| 24. | అనుబంధము - 4 | 150 |
| 25. | ఆచార్య రంగాజీ | 154 |
| 26. | ప్రముఖుల అభిప్రాయాలు | 161 |

# 1. కాకతీయ నాయకులు

కాకతీయ ప్రతాపరుద్రుడనే భానుడు నర్మదానదిలో అంతర్హితుడయినాడు. చక్రవర్తి మరణంతో కాకతీయ సామ్రాజ్యం కాకతీయులపాలన దక్షిణ భారతదేశంలో ముగిసింది. ఈ నేపథ్యంలో మహాంధ్ర దేశాన్ని, దక్షిణ భారతదేశాన్ని తురకల కబంధ హస్తాల నుండి విముక్తి నొందించటానికి తీవ్రయత్నాలు సాగించిన వీరుల చరిత్రే కాకతీయ నాయకుల చరిత్ర.

దేశ చరిత్రలో కాకతీయ నాయకుల ప్రాదుర్భావం ఒక విశిష్ట సంఘటన. దక్షిణాపథ రాజకీయ సంస్కృతి స్వాతంత్ర్యములపై అల్లాయుద్దీన్ మొదలుగా ఢిల్లీ పాలకులు మాటి మాటికీ దాడులు జరిపారు. ఈ విపద్దశలో వివిధ వ్యవసాయ కుటుంబాల నుండి బయల్పడి, ప్రతిఘటనోద్యమాలు నిర్మించి విముక్తి పోరాటాలు సాగించినవారు కాకతీయనాయకులు. ముస్లిందాడులను ప్రతిఘటించి, [illegible]లువరించి రాజకీయశక్తిగా వీరు రూపొందారు.

పల్లవ (క్రీ.శ. 5-7 శతాబ్దాలు) రాష్ట్రకూట (క్రీ.శ. 8-10) చాళుక్య (క్రీ.శ. 6-12 శతాబ్దాలు) చోళ (క్రీ.శ. 9-13 శతాబ్దాలు) యాదవ, హోయసల (క్రీ.శ. 12, 13 శతాబ్దాలు) రాజులకాలపు వీరులీ నాయకులకు పూర్వులు. దక్షిణ భారత రాజకీయ స్వాతంత్ర్య రక్షణకు ఆత్మత్యాగ భరితమయిన నాయకత్వం ప్రదర్శించి తమ పూర్వుల గౌరవ ప్రతిష్ఠల నినుమడింపజేశారు.

వీరి పూర్వులు తమరాజులు చక్రవర్తులు సాధించిన విజయాలు, చెక్కించిన శాసనాలు, నెలకొల్పిన జయస్తంభాలు చరిత్రపై మిగిల్చిన ముద్రలతో తృప్తిచెందారు. కాకతీయ నాయకులు ప్రత్యేక సాంఘిక రాజకీయ మన్ననలంది, స్వతంత్రంగా దర్బారులు నిర్వహించి, మంత్రులను నియమించుకొని శాసనాలు ప్రకటించి, బిరుదులు రాజలాంఛనాలు ధరించారు. ఢిల్లీ సుల్తానులతో తరచుగా చేసిన యుద్ధాలతో తమ ఐక్య బలాన్ని, నాయకత్వశక్తిని గుర్తెరిగి శత్రువులను ప్రతిఘటించి ఓడించి పారదోలారు. స్వాతంత్ర్యం సంపాదించారు. పాండ్యుల హోయసలుల తదితరుల సహకారంతో కాకతీయ నాయకులు శతాబ్దాలపైగా దక్షిణ భారతదేశ మత వైజ్ఞానిక, సాంస్కృతిక, సాంఘిక వారసత్వ పరిరక్షకులయినారు. దేవగిరి, వరంగల్లు సామ్రాజ్యాలు పతనమయినవి. తదాదిగా రెండు శతాబ్దాలు భారతధర్మ రక్షణాభారం కాకతీయనాయకుల, వీరు

నగర రాజుల భుజస్కంధాలపై పడింది. కాని క్రీ.శ. 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధం నాశహేతువయింది.

నాటి నుండి భారతదేశం విదేశీయ దండయాత్రలకు లోనయి విదేశీయ పాలనలో మగ్గి మరలా ఈ 20వ శతాబ్దంలో తన రాజకీయ ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాలను సంపాదించుకోగలిగింది. నేటి భారత స్వాతంత్ర్యయోధుల హృదయాలలో స్వతంత్ర జ్యోతులు వెలిగించి కాకతీయనాయకు లీతరాలవారికి మార్గదర్శకులయినారు.

కాకతీయ నాయకులు గుల్బర్గా నవాబులపై తిరుగుబాట్లు చేశారు. కాపయ్య నాయకుడు రేచర్ల నాయకుల చేతులలో యుద్ధరంగంలో మరణించిన తరువాత కూడా ఈ తిరుగుబాట్లు సాగుతూనే వున్నాయి. గోల్కొండపై ఆంధ్ర నాయకుల తిరుగుబాట్లు, కీ.శ. 1757లో బొబ్బిలి వారు విజయనగరం విజయరామరాజుతో చేసిన యుద్ధాలు బుస్సీ దొరపై చేసిన యుద్ధాలిటువంటివే.

ఈ దీక్షా సంప్రదాయాలే రెండున్నర శతాబ్దాలు విజయనగర మధుర తంజావూరు నాయకులను దక్షిణభారత ప్రజలకు నాయకత్వం వహింపచేసి స్వతంత్ర పోరాటాలకు పురికొల్పినవి.

బ్రిటీషువారు భారతదేశంలో సంపూర్ణ రాజకీయాధికారం చేజిక్కించుకొన్నా కాకతీయనాయకుల ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్య సంప్రదాయాల వలననే ఆంధ్రమైసూరు మహారాష్ట్ర తమిళనాడు గ్రామీణ పాళెగాండ్రతో బ్రిటీషు వారు ఒక శతాబ్దం పోరాటాలు జరుపవలసి వచ్చింది.

కాకతీయ నాయకవీరుల సైదోడులు, లెంకలు బంధువులునగు వేలాది రైతులు తమ అనువంశికమగు వీరఖడ్గ వీరపూజ సంప్రదాయానుసారం ప్రతిజ్ఞాబద్ధులయి, బ్రిటీషు ప్రభుత్వంకు వ్యతిరేకంగా సత్యాగ్రహాలు చేసి స్వతంత్రసాధనకు తమవంతు సహకారం అందించారు.

ముసునూరి ప్రోలయ, కాపయనాయకుల, విజయనగర రాజుల వారసత్వంతో స్వధర్మానుచరణము దేశభక్తి పేరిట తమిళనాడులో కట్ట బ్రహ్మనాయకుడు, కర్ణాటకలో రాణి చెన్నమ, బ్రిటీషువారిని ధిక్కరించారు.

ఈ వారసత్వమే మహారాజ్ ప్రవీణచంద్ర భంజదేవ్‌చే (నేటి బస్తరు) ఈ స్వతంత్రభారతంలో క్రీ.శ. 1966లో విప్లవం జరిపించింది. కాంగ్రెస్ నిరంకుశ

భయానకపాలన అతనిని బలితీసుకొన్నది. మహారాజు ప్రవీణచంద్ర భంజదేవ్ కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి సోదరుడగు మహారాజు అమ్మయదేవుని వంశీయుడు.

క్రీ.శ. 8-13 శతాబ్దాలలో చోళుల చాళుక్యుల కాలంలో పరిపాలన రాజ ప్రతినిధుల, మండలేశ్వరుల మహామండలేశ్వరుల అధీనంలో సాగింది. వీరికి న్యాయ, శాసనాధికారాలు, రక్షణ భద్రత భూమిశిస్తు వాణిజ్యం రహదారులపై ఫ్యూడల్ అధికారాలుండేవి. సైన్యపోషణకుగాను వీరు రైతుల నుండి చేతివృత్తుల వారినుండి వ్యాపారస్థుల నుండి పన్నులు వసూలు చేసేవారు. ఈ సైన్యాలు అవసర సమయాల్లో రాజాధీనం చేయబడేవి.

రెడ్డి, నాయడు (గౌడ్), కరణం గ్రామాధికార్లు. గ్రామ సమూహాలు మండలాలుగా, నాడులుగా పిలువబడేవి. పరిపాలనాధికారులుగా వివిధ హోదాలుగల ఉద్యోగులుండేవారు. ఈ ఉద్యోగులు సాధారణంగా మండలేశ్వరుల మహామండలేశ్వరుల ఆశ్రితులు, బంధువులు, నాయడులేక నాయణి లేక నాయక అనేవి వీరి హోదాలు. ఈ నాయకులే తమ శక్తియుక్తులతో మండలేశ్వరులుగా మహా మండలేశ్వరులుగా ఎదిగి రాజకీయాధికారానికి వచ్చారు. రాజు వీరినుండే మంత్రులను సైన్యాధికారులను ఎంపిక చేసుకొనేవాడు. వీరిలో అర్హులయిన వారికి బంగరు గండపెండేరములు ప్రదానం చేయబడేవి. బ్రిటీషువారి గార్టర్ ప్రదాన సంప్రదాయమిటువంటిదే. చక్రవర్తి స్వయంగా ఈ ఆభరణాలు ధరింపచేసేవాడు.

తమిళ చోళుల రాజధాని కంచి. వీరిలో ప్రముఖుడగు రాజరాజు (క్రీ.శ. 985-1011) తీరాంధ్రాన్ని, కళింగ, ఒరిస్సా దేశాలను, బెంగాలులో కొన్ని ప్రాంతాలను జయించాడు. తమిళనాడుకు దూరమగుటచే అతని తరువాత వారు పరిపాలనా సౌలభ్యంకొరకు వెలనాడుకు చందోలును. ఉత్తర ఆంధ్ర, కళింగ ఒరిస్సాలకు రాజమహేంద్రవరాన్ని రాజధానులుగా చేసుకొని రాజప్రతినిధులను నియమించారు.

పులకేశి సాధించిన విజయాలతో (చోళులకు పూర్వం) ఆంధ్రదేశం. మహారాష్ట్ర కర్ణాటక చాళుక్యుల ఏలుబడిక్రిందకు వచ్చింది. వీరి ఆంధ్ర ప్రతినిధులను తరువాత కాలంలో చోళులు జయించారు. చోళులు చాళుక్యులు వివాహ బాంధవ్యాల ద్వారా ఒక శక్తిగా రూపొందారు. ఈ కలయికల వలననే కుళోత్తుంగ చోళుడు నలువది సంవత్సరాలు పాలన చేయగలిగాడు.

ఈ సాంఘిక పరిణామక్రమంలో ఎన్నోకలయికలు, విభజనలు మార్పులు చోటుచేసుకొన్నవి. అవుడప్పుడే సాంఘికంగా బలపడుతున్న రాజమిత్రులు ఔన్నత్యకాముకులు నయిన నాయకులు, బలహీనపడుతున్న రాష్ట్రకూట. చోళచాళుక్య పల్లవ వంశాలరాచవారితో వివాహసంబంధాలు చేసుకొన్నారు. ఈ సంబంధాలు నాటినామమాత్రపు రాజరికపాలనాధికారాన్ని నిలబెట్టుటకు, కుటుంబ ఐక్యమునకు రక్షణకు ఎంతో ఉపకరించాయి.

రాష్ట్రకూట చోళచాళుక్య రాజవంశాల బాంధవ్యాలతో ఆంధ్ర నాయకులు అధికారము, బిరుదులు, రాజరికహోదాలు పొంది సాంఘిక ఔన్నత్యాన్ని శక్తిని చాటుకొన్నారు. ఆ విధంగా కమ్మరాష్ట్రపు కమ్మనాయకులు యుద్ధవిజయాలతో రాజవంశీయుల బాంధవ్యాలతో మండలేశ్వరులుగా మహా మండలేశ్వరులుగా ఎదిగారు.

అండదండలకయి నూతన రాజకుటుంబాలవారు తమ రాజ్యాధికారాన్నంగీకరించిన నాయక కుటుంబములవారికి తమ కుమార్తెలనిచ్చి వివాహాలు చేశారు.

తెలుగు కమ్మనాయకుడయిన మొదటిగొంక మండలేశ్వరుడు. ఈతనితల్లి అక్కమ్మ మహాదేవి చోళయువరాణి. ఈ బాంధవ్యంతో ఈతడు రాజప్రతినిధి కాగలిగాడు. పండానాయకుడు వెలనాటి రెండవగొంకరాజుకు మామ. రెండవ గొంకరాజు (క్రీ.శ. 1077) భార్య సుబ్బమాంబ. ఈమె తెలుగు నాయకుల ఆడపడుచు. గొంకరాజు తల్లి శివాంబిక. వీరికుమార్తె ప్రోలాంబిక తెలుగు ఆడబడుచులు. వీరు తమ చోళరాజుల సంబంధాలతో రాజరికస్థాయినందుకొన్నారు. రెండవ గొంకరాజు మొదట మండలేశ్వరుడు. తరువాత కంచిచోళరాజుకు రాజప్రతినిధి. కంచి సామ్రాజ్యానంతరం స్వతంత్రరాజుగ ప్రకటించుకొన్నాడు.

రెండవ గొంకరాజు కుమారుడు కులోత్తుంగ గొంక. తన తల్లి కమ్మనాటి సుబ్బమాంబ అని గర్వంగా చెప్పుకొనేవాడు. ఈతడు మహామండలేశ్వరుడు. ఆంధ్ర దేశంపై కంచిచోళుల అధికారము సన్నగిల్లింది. కమ్మనాటి భూస్వాములు చోళుల బిరుదులు, పేర్లు ధరించి సమాజంలో పై మెట్లకెగబ్రాకే ప్రయత్నాలు చేశారు.

చోళవారసత్వాన్ని విడిచి వెలనాటి కులోత్తుంగ చోడుడు తాను దుర్జయ వంశస్థుడనని చెప్పుకొన్నాడు. వెలనాడు, రాజమహేంద్ర వరాలలోని తమిళ చోళ రాజప్రతినిధులు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. వీరి పాళెగాండ్రయిన కమ్మ

నాయకులు. వీరి అనుయాయులు "పల్నాటి యుద్ధము"న ఇరువైపుల చేరి పోరాడారు. ఈ దాయాదుల యుద్ధంలో వెలనాటి పలనాటి కొలను చోళవంశస్థులు, సాహసవంతులయిన యువకులను సైన్యాధిపతులను ఎందరినో కోల్పోయారు. కమ్మ, రెడ్డి, వెలమ, పంచమ వీరనాయకులు ఖ్యాతి గడించగా చోళ చాళుక్య వంశస్థులు సాంఘికౌన్నత్యంలో వెనుకబడ్డారు. బ్రహ్మనాయని కుమారుడు బాలచంద్రుడు. కమ్మవారగు గండు (దండు) వారింటి ఆడపడుచు "మగువ మాంచాల" ఇతని భార్య. నలగామరాజు మంత్రిణి "నాయకురాలు నాగమ్మ" ఈమె కమ్మవారి ఆడపడుచు. రెడ్డిని వివాహమాడినది. ఇటువంటి కులాంతర వివాహాలతో (రెడ్డి-వెలమ-కమ్మ) కమ్మనాటి వివిధ తెగల నాయకులు తమ ఆధిపత్యాన్ని బలపరచుకొన్నారు.

శ్రమజీవులయిన కమ్మరైతు వంశపు కాకతి బేతన (మొదటి బేతన) వృష్ణి లేక విష్ఠిసామంతుడు. చాళుక్య సామ్రాజ్యంలో బలపడి రాజుగా తన అధికారం స్థిరపరచుకొన్నాడు. వృష్ణి వంశస్థులగు రాష్ట్ర కూటులకు సామంతుడగుటచే వృష్ణి లేక విష్టి సామంతుడని కీర్తించబడ్డాడు. మొదటి ప్రోలయ మహామండలేశ్వరుడు. తన విజయ పరంపరకు కారణమయిన ప్రోలయకు చాళుక్య సోమేశ్వరుడు "హనుమకొండ" బహూకరించాడు. ఈతని కుమారుడు రెండవ బేతరాజు, మనుమడు ప్రోలరాజు చాళుక్యల పాలనలో రాజ్యాధికారం చేపట్టారు. రెండవ ప్రోలయ - ప్రోలరాజు కాలక్రమేణా స్వతంత్రరాజుగా ప్రకటించుకొన్నాడు.

మొదటి ప్రోలరాజు మునిమనుమడు (రెండవ ప్రోలరాజు కుమారుడు) రుద్రదేవుడు క్రీ.శ. 1158లో సింహాసనమధిష్టించి వెలనాటి చోళులను జయించి తన సామ్రాజ్యాన్ని కర్నూలు వరకు విస్తరించాడు. పరాజితులయిన చోళ నాయకులకు తన సామ్రాజ్యంలోనే పునరావాసం కల్పించాడు. చోళుల పరాజయాలు, అవిచ్ఛిన్నమగు సాంఘిక పరిణామక్రమం, చోళచాళుక్య రాజ వంశములతో కమ్మనాటి కమ్మనాయకులు చేసుకున్న పెండ్లిండ్ల వలన మొదటి రుద్రదేవుడు తాను కరికాలచోళుని వంశీయునిగా పేర్కొన్నాడు. వెలనాటి కులోత్తుంగ చోడుడు, చాళుక్య విక్రమాదిత్యుడు ఇరువురూ రాజేంద్రచోళుని మనుమలే. కాంచీ సామ్రాజ్యం కోసం వీరిరువురూ పెనుగులాడారు. కాకతీయ నాయకులు చోళ చాళుక్య వంశాలతో బాంధవ్యము కలవారు. అందువలననే వీరు తాము కరికాల చోళుని వంశస్థులమనే చెప్పుకొన్నారు. చోళులను చాళుక్యులను ఓడించి స్వతంత్రులయిన పిదప తాము దుర్జయ వంశస్థులుగా ప్రకటించుకొన్నారు. వెలనాటి చోళులు కూడా

దుర్జయ వంశస్థులే. ఈ దుర్జయుడు చారిత్రక పురుషుడు. అందువలననే కాకతీయ నాయకులు, సామ్రాజ్యాధికారం వెలనాటి చోళుల రాజచిహ్నాలు సాధించిన తరువాత తాము దుర్జయ వంశస్థులమనే తమ చిరకాల వాంఛితాన్ని బాహాటంగా చాటుకొన్నారు.

కాకతి మహాదేవరాజు (క్రీ.శ. 1195-99) మొదటి రుద్రదేవుని వారసుడు. గణపతిదేవ చక్రవర్తి ఇతని కుమారుడు. ఈతడు తన వరంగల్లు శాసనంలో "రాజ ధర్మమును ఉపదేశికుడయిన "దురుదేశవర" వద్ద తెలుసుకొన్నానని శాసనబద్ధం చేయించాడు.

మండలేశ్వరులు, మహామండలేశ్వరులు - రాజవంశముల పయి తాము సాధించిన విజయాలతో, నెరపిన బంధుత్వములతో 'దేవ-రాజ-మహారాజ' బిరుదులు ధరించసాగారు. చక్రవర్తి, మహారాజుల అధికారపరిధి స్వల్పంగా ఉండేది. అందువలన సామాన్య భూస్వాములు, పాళెగాండ్రు కూడా రాజబిరుదులు, చిహ్నాలు ధరించేవారు.

# 2. కాకతీయ సమాజము - వారసత్వం

## రాజకీయ, సామాజిక వాతావరణం :

"నావిష్ణుః పృథివీపతిః", రాజు విష్ణ్వంశ సంభూతుడు అని హైందవ చక్రవర్తుల విశ్వాసం.

"రాజు దైవాంశ సంభూతుడనే నమ్మిక పాశ్చాత్య ప్రభువులకు కూడా ఉంది. ముస్లింలు కూడా ప్రభువులను ఇదేవిధంగా ఆరాధించేవారు"

"రాజు అత్యంత శక్తిమంతుడు. అతడు పాలకుడు. న్యాయాధిపతి. సైన్యాధిపతి. సందర్భమును బట్టి అతడే ప్రవక్త. అతడు ప్రజలకు ఆరాధ్యుడు. "భూమిమీద భగవంతుని నీడ రాజు. (ముజాహిత్ 1375-78).

హైందవ సమాజాన్ని ప్రభావితం చేయగల శక్తియుక్తులున్న బ్రాహ్మణులు సమాజశ్రేయస్సు కొరకు గద్దెనెక్కిన వారికి క్షత్రియత్వం ప్రసాదించేవారు.

రాజు వర్గ వర్ణ వివక్షతలకు తావీయక ప్రజల నుండి మంత్రులను ఎంపిక చేసుకొనేవాడు. ఈ మంత్రులు నాయక సంప్రదాయమునకు చెందినవారు. వీరు రాజుకు వ్యక్తిగతంగా విశ్వాసపాత్రులు. వీరు అన్ని రాచరిక అధికారాలు అనుభవించేవారు.

ఈ శతాబ్దపు ఫ్యూడల్ ప్రభువుల శాసనాధికారాలు కొన్ని సందర్భాలలో నిరంకుశంగానూ, విశృంఖలంగానూ వుండేవి. ఈ ఫ్యూడల్ ప్రభువులు స్వతంత్ర గ్రామీణ ప్రజాస్వామ్యాన్ని, వివిధ వర్తక వాణిజ్య సంఘముల, చేతివృత్తుల, పంచాణముల (విశ్వకర్మలు) వారి హక్కులను గౌరవించేవారు. తమకు తమ విధులకూ రక్షణ కల్పిస్తున్న కోట వారికి ఏటేటా కప్పములు కట్టేవారు.

రాజబంధువులయిన రాచవారికి, నాయక సంప్రదాయమునకు చెందిన వారికి విశేష గౌరవ ప్రాధాన్యతలుండేవి. వీరు గద్దెనెక్కుటకు, కొలువు తీర్చుటకు, రాజచిహ్నములయిన ఛత్రచామరములు. ధరించుటకూ, ప్రత్యేక శంఖతాళ వాద్యములతో హెచ్చరికలు చేయించుకొనుటకు, విభిన్న రీతిలో వస్త్రధారణకు అలంకృతాశ్వములపై, ఏనుగులపై ఊరేగుటకు అధికారములు కలిగియుండేవారు.

మండలములోని ఫ్యూడల్ ప్రభువులు మండలేశ్వరుల ఆధిపత్యము నంగీకరించేవారు. ఈ అధికార సోపానాలు రాజువరకు సాగేవి. రాజు యువకుడు.

ఉత్సాహవంతుడు, బలవంతుడు అయినచో మండలేశ్వరులు మహామండలేశ్వరులు అతనికి విధేయులుగా వుండేవారు. గణపతి దేవుని, రుద్రమదేవి, ప్రతాపరుద్రుల కాలమెక్కువగా ఈ విధంగానే గడిచింది.

మండలేశ్వరులు, మహామండలేశ్వరులు ఈర్ష్యాపరులు. ఎవరు ఎవరిపై ఎప్పుడు ఎందుకు దండయాత్ర చేస్తారో తెలియదు. గెలిచినవారు ఓడినవారి సంపదను, బిరుదులను గ్రహించేవారు. ఆ కాలంలో ఎల్లప్పుడూ "సాయుధసంధి - అనిశ్చితశాంతి' ' నెలకొని వుండేది. సామాన్య ప్రజలు నిత్యం యుద్ధభయంతో గడపవలసి వచ్చేది.

రాజు వృద్ధుడు లేక పరాజితుడు లేక బలహీనుడయిన సమయాల్లో సామంతుల **తిరుగు**బాట్లు సర్వసాధారణం. కాకతీయ చక్రవర్తులకూ ఈ తిరుగుబాట్లు తప్పలేదు.

అధికారంలో వున్నవారి పుట్టు పూర్వోత్తరాలు, తెగలు, వర్ణాలతో నిమిత్తం లేకుండా వారి సాంఘికౌన్నత్యమునకై ప్రభువులకు రాజరిక వారసత్వ కల్పనచేసి **కీర్తించేవారు.** కొందరు సైన్యాధిపతులు బలవంతులను పౌరాణిక నాయకులను తమ **పూర్వులుగా** చెప్పుకొని క్షత్రియులుగా ప్రకటించుకొనేవారు. రాష్ట్రకూట, **చోళ, చాళుక్య** కాకతీయరాజులు పురాణపురుషులగు రాముడు కృష్ణుడు భారతవీరులగు **పాండవులతో** తమ వంశాలను ముడిపెట్టి పురాణ ప్రసిద్ధమైన వంశీయులుగా సింహాసనాలు ఎక్కారు. తిక్కన సోమయాజి, విద్యారణ్య స్వామివంటి వారీ మార్పులు సాధ్యం చేసారు. సామాన్య ప్రజలు ఆమోదించారు. రాజుకు దైవత్వ మీవిధంగా అంటగట్టబడింది.

**రాజు** భగవదవతారంగా ఆమోదించినది మొదలు నాయకులు, **ప్రాంతీయ** ప్రభు**వులు. కాపులు,** రెడ్లు, కరణాలు, అయ్యంగారు వీరందరు రాజు**కు లెంకలుగా** పుత్రసమా**నులుగా వుంటూ వారిని** సేవించేవారు.

మంత్రు**లూ మహామంత్రులు నాయకులు** సేనాపతులు మొదలు రెడ్లు **కాపులు** సామాన్యప్రజ **వరకు సైహోదాలకు ఎగ్రాకి** పాలనావర్గంగా పరిగణింపబడేవారు. సామాన్యజనం ద**ళితులతో సహా తమవారు సైహోదాలలో వున్నట్లయితే** వారికులం వర్గం బంధువులందరూ **సాంఘికౌన్నత్యం సాధించినట్లు భావించేవారు. తదనుగుణంగా** ప్రవర్తించేవారు.

నేటి సమాజంలోను ద**ళితులీప్రయత్నాలలోనే వున్నారు. ప్రాధాన్యం** కోల్పోయిన రాజవంశాలు నూతన రాజకుటుంబాల **బాంధవ్యాలతో మరల త**మ పలుకుబడి పెంచుకోగలిగాయి. పల్లవ రాష్ట్రకూట యాదవ చాళుక్య వెలనాటిచోళ. రాయ, దేవ

వంశీయులు నూతనరాజవంశీయులతో కలసిపోయి పల్లెల పల్లెకార కోటరెడ్డి చాలువ లేక సాలువ వెలమ, చోడి రాయ, రాయిడి దేవర దేవతలుగా మార్పుచెందారు.

చాలామంది నాయకులు రెడ్లు నియోగులు లెంకలు - దేవాలయాలు తటాకాలు గ్రామాలు నిర్మించి తమ రాజులకు అంకితము చేసి శాసనములు వేయించి రాజుతో తమకుగల చుట్టరికాన్ని చరిత్రలో భద్రపరచుకొన్నారు.

ప్రతాపరుద్రుని నాయకులు లెంకలు, వారి అనుయాయులగు రెడ్లు నాయడులు సేనాపతులు శ్రేష్ఠులు ఈ సంప్రదాయాన్ని పాటించారు. తమ రాజుతో గల ఆత్మీయతాభావము జాతీయ రక్షణా ప్రబోధం కాకతీయ నాయక సమాఖ్యకు చెందిన డెబ్బది నలుగురు నాయకులను, శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వారి అనుచరులను, కాకతీయులకు విధేయులుగా చేసినవి. గ్రామ సభల ప్రాధాన్యం హెచ్చుగా వున్న నాటి సమాజంలో నాయక సమాఖ్యపట్ల సానుభూతి వ్రేళ్ళూనినది. తత్ఫలితంగా కమ్మవారి సహాయ సహకారాలు నాయక సమాఖ్య పొందగలిగింది.

## లెంకలు

ప్రభువులకు ఎందరో అంగరక్షకులుండేవారు. వీరు ప్రభువుకు అతని కుటుంబ రక్షణకు ప్రాణాలర్పిస్తామని ప్రమాణాలు చేసేవారు. ప్రాణాలర్పించి ప్రభువుకు భద్రత కల్పించేవారు. వీరిని లెంకలు అని పిలిచేవారు. ఈ సంప్రదాయం రెండవ ప్రతాపరుద్రుని కాలాన చాలా ఉచ్ఛస్థితిలో వుంది. లెంకలు రక్షణ విభాగంలో ప్రాధాన్యత కలిగి బలవంతులయిన ప్రభువుల ఆదరణకు పాత్రులయ్యేవారు. తన రక్షణకు తన కుటుంబ రక్షణకు రాజు వీరిపై ఆధారపడేవాడు.

రెండవ ప్రతాపరుద్రుడు హరిజనులను గిరిజనులను కూడా లెంకలుగా ప్రోత్సహించాడు. వీరిలో చాలామంది నాయకస్థాయి కెదిగారు. నేడు వివిధ కులాల్లో కన్పించే సేనాపతులు శ్రేష్ఠులు దొరలు ఈ లెంకలనుండి వచ్చినవారే. గడిచిన మూడు శతాబ్దాలుగా వీరు ఆర్థికంగా చితికిపోయారు.

తాము పుత్రసములుగా ప్రకటించుకొని, రాజు సహపంక్తిన భుజించి, అతని సరసన యుద్ధాలు చేసి లెంకలు ప్రభువుకు దాసులుగా భావించుకొన్నారు. ప్రభుసేవకు ప్రతిజ్ఞాబద్ధులు. ప్రభువే తమ గురువు, దైవము. ఇహము, పరముగా తలచి తమ ధన,

మాన, ప్రాణాలు ప్రభు పరంచేసి ప్రభువునంటి పెట్టుకొనియుండి, వానికై పోరి, ప్రభువుతో వీరమరణమందేవారు. యుద్ధంలో రాజు మరణించినచో తామూ ప్రాణత్యాగం చేసేవారు.

రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి వీరిని ప్రత్యేక బలగాలుగా తీర్చిదిద్దాడు.

ప్రతాపరుద్రుడు ఆకస్మికముగా బందీ అయినపుడు వీరు వెంటలేరు. తరువాత కాలంలో ప్రోలయనాయకునకు ఆంధ్ర రక్షణోద్యమమున అండ దండలుగా నిలిచారు.

కాకతీయుల కాలంలో కమ్మవారు, రెడ్లు, నాయడులు సమాజక్రమంలో సాంఘిక మతమర్యాదలందు బ్రాహ్మణుల తరువాత స్థానం ఆక్రమించారు.

సైనికోద్యోగాలకు గట్టి పోటీ ఉండేది. కొల్లగొట్టిన సొమ్ములో సైన్యానికి వాటా ఉండేది. సాహస ప్రదర్శనకు సాంఘికౌన్నత్యానికి సైన్యంలో చేరటం రాచబాట. ధైర్యసాహసాలే కొలబద్ద. కులంగోత్రం కాదు. ఉన్నత వర్గాలవారీ అవకాశాలు ఎక్కువగా ఉపయోగించుకోగలిగారు. సైన్యంలో కీర్తి ప్రతిష్ఠలార్జించిన వారి కుటుంబాలు పూజ్యభావంతో చూడబడేవి. ప్రభువులు రాజులు వీరిని బిరుదులతో సత్కరించేవారు. క్రతువులు శాంతులు సమారాధనలతో పురోహితులు వీరిని క్షత్రియులుగా ముద్రవేసేవారు. సాహసికులగు పెక్కు యువకులీ మన్ననలాసించి సైన్యములో చేరి లెంకలు నాయకులు సామంతులుగా ఆధిపత్యం గడించారు.

అసహనము అంతఃకలహాలు వేధింపులు కుట్రలు హత్యలు నాటి మత రాజకీయ రంగాల్లో సామాన్యం. బౌద్ధ, జైన, శైవ మత విద్వేషాలను తమ యుద్ధావసరాలకు దేవగిరి రాజులు కాకతీయ రాజులు రెచ్చగొట్టారు. హిందూమత ప్రచారానికై నెల్లూరు చోడమనుమసిద్ధి మంత్రి, మహాకవి అయిన తిక్కనను. గణపతి దేవచక్రవర్తి ఓరుగల్లునకు పిలిపించాడు. చక్రవర్తికోట వదలివచ్చి స్వయముగా తిక్కనకు స్వాగతమిచ్చి అపూర్వ సత్కారం చేశాడు. తన సరసన కూర్చుండబెట్టుకొని శీతలపానీయాలు చందన చర్చలు చీనిచీనాంబరాలు సమర్పించి ఒక ఋషిర్షికి, దైవాంశ సంభూతునికి యోగ్యమయిన పూజలు చేశాడు.

తిక్కన బౌద్ధులు జైనులతో వాదించాడు. తార్కిక మీమాంసలతో శైవమత ప్రాశస్త్యాన్ని శివార్చకుల గొప్పతనాన్ని ప్రకటించి హైందవ మత తాత్వికౌన్నత్యాన్ని తిక్కన పునఃప్రతిష్ఠించాడు. బౌద్ధ జైన మత నిరసన, నిరాదరణ వారిని హింసించటం శాస్త్రసమ్మతమని తన వాదనాపటిమతో తేల్చి చెప్పాడు.

గణపతి దేవుడు శైవం స్వీకరించాడు. అంతవరకు నివురుగప్పిన నిప్పులా వున్న మత విద్వేషాలు రాజకీయ ద్వేషాలు భగ్గుమన్నాయి. కాకతీయులు యాదవులు ఈ సాకుతో ఒకరిపై ఒకరు కత్తులు దూసుకొన్నారు.

ఎన్ని విచ్ఛిన్నకర ధోరణులు ప్రబలినప్పటికీ ఈ హైందవ సామ్రాజ్యకాలంలో మతవిశ్వాసం ప్రజలను సమైక్యపరచింది. భారతధర్మముపట్ల ప్రజలకు గల అంకితభావం ఐక్య ధోరణులకు, మతవిశ్వాసం కేంద్రబిందువయింది.

## గ్రామ ప్రజాస్వామ్యము

గ్రామీణులు అనగా రైతులు చేతివృత్తులవారు. వ్యాపారస్తులు పన్నులు కానుకలు ప్రభువులకు చెల్లించేవారు. నాయకుల రాజుల అంతఃకలహాలు గ్రామీణ జీవితానికి పెద్దగా ఇబ్బంది కలిగించలేదు. రాజకీయంగా వీరాందోళనపడలేదు. గ్రామీణులకీ కలహాలలో ఆసక్తిలేదు. ఎవరు రాజైన ఎవరు మండలేశ్వరుడయినా వారికి పట్టింపులేదు.

గ్రామీణ ప్రజాస్వామ్యం వీరి రక్షణకవచం, ఈ ప్రజాస్వామ్యం గ్రామాలకు, మండలాలకు శివారు గ్రామాలకు విస్తరించి వుండేది. ప్రతి గ్రామం ఒక పంచాయితి. పంచాయితీల ఎన్నికలు నేటి లాటరీపద్ధతిలో జరిగేవి. అర్హతగలవారిని కుల పెద్దలు ఎంపికచేసేవారు. వయోవృద్ధులు పంచాయితీ సమావేశాలకు అధ్యక్షులుగా వుండేవారు.

మత సామాజిక కార్యక్రమాలకు పన్నులు సెస్సులు విధించుట, వసూలు చేయుట మండలేశ్వరునికి చెల్లించుట పంచాయితీ అధికారాలయి వుండేవి.

నాయకులు రాజులు అడవులు నరికించుటకు, గ్రామములు నిర్మించుటకు చెరువులు త్రవ్వించుటకు కరకట్టలు పోయించుటకు సాగునీరు, తాగునీరు వసతులు కల్పించుటకై నిధులను పంచాయితీలకు సమకూర్చేవారు.

నూతనముగా సాగులోనికి వచ్చిన బీళ్ళకు కొన్ని సంవత్సరాలు ఏ పన్నులూ వుండవు. తరువాత సాగుభూమికి పన్ను నిర్ణయింపబడేది. ఒక ఎకరానికి ఒక “చిన్నం' పన్ను. గ్రామ కంఠం నిర్ణయింపబడిన తరువాత ఆయకట్టు నిర్ధారింపబడేది. గ్రామోద్యోగులు పన్నెండుమంది వరకు వుండేవారు.

ఆక్రమణలో లేని అడవులు, భూమి, గ్రామకంఠం, పంచాయితీ హక్కు భక్తుములై యుండేవి. రైతుల భూములు, తోటలు, దొడ్లు, ఇళ్ళు ఇతర ఆస్తులకు పంచాయితీ

రక్షణ నిచ్చేది. తల్లిదండ్రుల పురోహితుల రాజుల ప్రోద్బలంతో మండలేశ్వరులు భాగ్యవంతులు తటాకాలు, సత్రాలు నిర్మించేవారు. ఆస్తుల అమ్మకాలు తాకట్లు లావాదేవీలను పంచాయితీ ధ్రువపరిచేది. రైతుల కూలీల, చేతి వృత్తులవారి పనికట్టుబాట్లు రుసుములు పంచాయితీ పరిధిలోనివి. వీరి పరస్పర సేవా సహకారాలను పంచాయితీ క్రమబద్ధీకరించేది. భూముల అమ్మకాలు కొనుగోళ్ళు వంశపారంపర్య హక్కులు శిస్తుల తప్పిళ్ళు గ్రంథస్థం (రిజిష్టరు) చేయబడేవి. ఈ గ్రంథం ఆధారంతో పంచాయితీ, వివాదాలను పరిష్కరించేది. వీటిపై పునఃపరిశీలన మండలేశ్వరుని పరిధిలో వుంటుంది. పంచాయితీ పెద్దలు పురోహితుల సహకారంతో మండలేశ్వరులు విచారణ చేసేవారు.

పంచాయితీలకు దేవాదాయములు ధర్మాదాయములపై అధికారం వుంది. రాజుల పెత్తనం కోటలపైనే గాని గ్రామాలపై కాదు. రైతుల ఆస్తులు, భూములు రాజు కొనుగోలు చేయవలసివస్తే పంచాయితీ ఆమోదం తెలియచేయాలి. పంచాయితీల ద్వారా అమ్మకపు సొమ్ము రైతులకు చెల్లించబడుతుంది. హిందూ శాస్త్రానుసారం శ్రేణుల పంచాయితీల హక్కుల ఆచార వ్యవహారాలు రక్షింపబడేవి. సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామ్యం గ్రామాల్లో వేళ్ళూనికొని వుంది.

యుద్ధ సమయాల్లో సైతం పంచాయితీల అనుమతి లేనిదే సైన్యం గ్రామాల్లో కాలుబెట్టరాదు. ప్రజలు ఏపక్షమునైనా చేరి యుద్ధాల్లో పాల్గొవచ్చు. పంచాయితీ ఏపక్షం వహింపదు. యుద్ధమువలన కలుగు పంట పైరునష్టములను పంచాయితీ రాజుల నుండి. మహామండలేశ్వరుల నుండి రాబట్టుకొనేది.

గత్యంతరములేని పరిస్థితులలో గ్రామ పంచాయితీలు ఏదయినా ఒక పక్షము వహించినా ఈ స్థానిక యుద్ధముల వలన గ్రామీణ ఆర్థిక సామాజిక జీవితములకు భంగము కలుగలేదు.

ముస్లింల దాడులు, దోపిడీలు ఈ వ్యవస్థలో మార్పులు తెచ్చినవి. తమ హక్కులకు, ప్రజాస్వామ్యానికి, గౌరవానికి భంగం కలిగించే వారిపట్ల గ్రామ పంచాయితీలు ఉదాసీనంగా వుండలేకపోయినవి. రైతులు తమ ఆర్థిక సంపత్తిని (ధాన్యపు నిల్వలు - ఆలయపు నిల్వలు) సాహసవంతులయిన తమ బిడ్డలను దేశరక్షణకై అర్పణ చేసేవారు.

# 3. కాకతీయ చక్రవర్తులు

మండలేశ్వరుల మహామండలేశ్వరుల అంతఃకలహాల నివారణ రాజుకు, చక్రవర్తికి ప్రధాన బాధ్యత అయింది. అధికారం, కీర్తి, ప్రతిష్ఠల కొరకు నిరంతరం కలహించి ఉద్యమించే ఈర్ష్యాళువులు ఆశబోతులు అయిన వీరి మధ్య శాంతి సామరస్యసాధన గణపతిదేవచక్రవర్తి అంతటివానికి సహితం తలనొప్పి కలిగించింది. యాదవులను కఠినంగా అణచివేసి నెల్లూరు ప్రభువుకు యాదవ రాజులకు శాంతి చేకూర్చాడు.

గణపతిదేవుడు (క్రీ.శ. 1213-1258) కంచివరకు దండయాత్రలు చేసి కంచి చోడమహారాజును ఓడించాడు. ఈ యుద్ధాల కారణంగా దేశం దారిద్ర్యాన్ని అనుభవించింది. ఎంతోమంది నాయకులను కోల్పోయింది. సైన్యం బలహీనపడింది.

కంచి విజయానంతరం గణపతిదేవ చక్రవర్తి దక్షిణాపథ సార్వభౌమాధికారం చేపట్టి అంతర్జాతీయ వర్తక వాణిజ్యాల ఆధిపత్యము పొందాడు. ఎక్కువగా వున్న ఎగుమతి దిగుమతి పన్నులను సుంకములను రద్దుచేసి వర్తక వాణిజ్యాలను ప్రోత్సహించాడు. నిర్దిష్టమగు సుంకవిధానం ఏర్పరిచాడు. మునిగిపోయిన ఓడల సరుకులకు పన్నులు రద్దుచేశాడు. వాయవ్య, పశ్చిమ భారతంలోని చక్రవర్తులవలెనే (నాడు ఒకరికంటే ఎక్కువమంది చక్రవర్తులుండేవారు) గణపతిదేవుడు కూడా ఉత్తర భారతదేశపు రాజకీయ పరిస్థితులకు తగినంత ప్రాధాన్యత నీయలేదు. పృథ్వీరాజ్ చౌహాన్ ఢిల్లీ సింహాసనము కోల్పోయాడు. కుతబుద్దీన్ ఐబక్ క్రీ.శ. 1206 ఢిల్లీ సుల్తానైనాడు. కంచినేలిన మూడవ రాజరాజుకు (క్రీ.శ. 1216-1242) రాజేంద్ర చోళునకు ఇతడు సమకాలికుడు.

గణపతిదేవ చక్రవర్తి చాలా దూరదృష్టి కలవాడు. జాయప నాయకుని ఇరువురు సోదరీమణులను వివాహమాడి, అయ్యవంశస్థులతో వియ్యము ద్వారా వేగినాట, చందోలు చేబ్రోలులలో తన ఆధిపత్యము నిలబెట్టుకొన్నాడు. తన కుమార్తె గణపాంబను అమరావతీ ప్రభువగు బేతరాజుకిచ్చి పెండ్లి చేశాడు. ఈ బేతరాజు కేతరాజుకు మనుమడు. రుద్రరాజు కుమారుడు. వీరు కమ్మనాటి అమరావతి ప్రభువులు. ఈ బంధుత్వము వలన కృష్ణానది కిరువైపుల గల కమ్మనాయకుల మద్దతు సంపాదించుకొన్నాడు. తన సోదరి మాలాంబిక లేక మేళాంబికాదేవిని "నతవాటిసీమ" మహారాజు బుద్ధరాజు కుమారుడు "ఒక్కడి మల్లిరుద్రునకిచ్చి వివాహం చేశాడు. నతవాటిసీమ అనగా నేటి పశ్చిమ గోదావరి. కృష్ణాజిల్లాలు. బుద్ధరాజు పేరును బట్టి నాటి బౌద్ధమత ప్రాబల్య మూహింపవచ్చును. రుద్రదేవుడు కుమార్తె బయ్యాంబికను అమరావతినేలు కోటవారింటికి యిచ్చాడు.

రాయలసీమ నేలుచున్న మహామండలేశ్వరుడు గంగయసాహిణిని గండపెండేరముతో సత్కరించాడు. నెల్లూరు మనుమసిద్ధి మంత్రియగు తిక్కన మహాకవిని రావించి గౌరవించాడు. తిక్కన మహాకవి తత్త్వవేత్త, మహావీరుడు. విరాటపర్వమాదిగా వ్యాస భారతాన్ని కడముట్ట తెనుగుజేసి ఆంధ్ర సారస్వతమును సుసంపన్నమొనర్చి హిందూమత పునరుజ్జీవము గావించిన మహామనిషి. రాజోచిత సత్కారములతో తిక్కన మహాకవికి స్వాగతము పలికి నాటి బ్రాహ్మణ సమాజపు ఆదరణకు పాత్రుడయినాడు. రేచర్లనాయకుని, సోమనాయకుని, జాయపనాయకుని, గంగయసాహిణిని, ఇందులూరి గణపయ్యకుమారుడు గన్నయను, త్రిపురారి దేవుని, పెంకల మల్లయ్య మొదలగు మహామండలేశ్వరులను తన ఆంతరంగిక మంత్రి మండలిలో జేర్చుకొని, ఐక్యతాభావము పెంచి తన సామ్రాజ్యాధికారము పదిలపరచుకొన్నాడు. మహాభారత కథానాయకులగు శ్రీకృష్ణుడు ధర్మరాజు ఆదర్శంగా తిరుగులేని రాజనీతిని ప్రదర్శించి రాజ్యతంత్రమున విజయం సాధించాడు. గణపతిదేవుని ఆదర్శంగా చేసుకొని నాటి ప్రభువులు, రుద్రమదేవి, ప్రతాపరుద్రులు కవి పండితపోషకులయ్యారు. ప్రతాపరుద్ర చక్రవర్తి స్వయముగా పండితుడు. నాటి మండలేశ్వరులు బ్రాహ్మణులను మంత్రులుగా నియమించుకొనగా గణపతిదేవుడు కిసాన్ వీరులను ప్రధానమంత్రులుగా చేసుకొని పాలన చేశాడు.

## గంగయ సాహిణి :

ఈ క్లిష్ట చారిత్రాత్మక సామాజిక విప్లవదశలో చాలామంది నాయకులు బలహీనుల నోడించి నాయంకరములు స్వాధీనము చేసుకొని నామమాత్రపు కప్పములు రాజుకు చెల్లించి సామంతులు కాగలిగారు. కడపజిల్లాలో కాకతీయుల పురపాలకుడు కాయస్థ వంశస్థుడునగు గంగయసాహిణి గండపెండేరాది బహుమానములందుటేకాక గణపతిదేవ చక్రవర్తికి ప్రధాన అంతరంగిక సచివుడయి నల్గొండ నుండి కోలారు జిల్లాలోని 'కైవార' వరకు కడప, కర్నూలు, అనంతపురం, నెల్లూరు, గుంటూరు సీమలకు మహా మండలేశ్వరుడయినాడు.

గంగయసాహిణి భార్య "కావత్సాయి" కాకతీయుల ఆడపడుచు, కాకతి సామ్రాజ్యస్థాపకుడగు మొదటి ప్రోలయ కాలమున గంగయ గ్రామపెత్తందారు. మొదటి ప్రతాపరుద్రునికి అండగా నిలిచాడు. గణపతి దేవునకు రుద్రమదేవికి అత్యంత విశ్వాసపాత్రుడు. త్రిపురారిదేవుడు అంబదేవ మహారాజు ఈతని వారసులు. వీరు రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తికి పెట్టని కోటలు. గణపతి దేవుని చిరకాల వాంఛితము నామోదించి

యువరాణి రుద్రమదేవిని కాకతీయసామ్రాజ్ఞిగా క్రీ. శ. 1257లో నిలిపాడు. చక్రవర్తికితడాప్తుడు. రుద్రమదేవికి నమ్మికగల రాజనీతివేత్త.

స్త్రీయగు రుద్రమను సామ్రాజ్ఞిగా మహామండలేశ్వరులందరూ ఆమోదించినారనుకొనుట అస్వాభావికము. (క్రీ.శ. 1184న నాయకురాలు నాగమ్మ నలగామరాజుకు మంత్రిణి కాగల్గినది) గంగయసాహిణి సహకారమీవిషయమున గణపతిదేవునికి ఎంతయినా ఆవశ్యకమయినది. గంగయ సాహిణి జాయపసేనాని భువనగిరి రేచర్ల నాయకుల హృదయపూర్వక సహకారముతో యువరాణి రుద్రమదేవి గద్దెనెక్కగలిగింది.

రుద్రమదేవి సామ్రాజ్ఞియగుట ఆమెభర్త అయిన చాళుక్య వీరభద్రునితో సహా పెక్కుమంది మహామండలేశ్వరులకు సమ్మతికాదు. పెరుమల దేవచోడుని కుమారుడు సిద్దయ దేవచోడుడు, దావలదేవుడు వ్యతిరేకులు. వీరికి దేవగిరి యాదవరాజుల సహకారమున్నది. దేవగిరి యాదవులు కాకతీయులను ఓడించి జైనమతాన్ని పునరుద్ధరించాలనే ఆలోచనతో వున్నారు.

ఈ యుద్ధములలో రుద్రమదేవి ఓడి దేవగిరి యాదవులకు బందీ అయినది. గంగయసాహిణి. జాయపసేనానుల విజయములతో బంధ విముక్తురాలయింది. రుద్రమదేవి తిరుగుబాట్ల నణచివేసింది. తన యావత్‌శక్తిని దేశపటిష్ఠతకు. అభివృద్ధికి ప్రజల సుఖసంతోషాలకు వెచ్చించి దశాబ్దాల పర్యంతం పాలించి విశిష్ట నారీరత్నంగా చరిత్రలో యశస్సు గడించింది.

క్రీ.శ. 1236-40లలో ఢిల్లీని పరిపాలించిన 'రజియా' ఇంత అదృష్టవంతురాలు కాదు.

అమరావతి ప్రభువుల ఆదరము, గంగయసాహిణి, జన్నిగదేవుడు, త్రిపురారి దేవుడు. అంబదేవ, రేచర్ల ప్రసాదిత్య, గణపతిదేవ మహారాజుల, నిశ్శంక మల్లికార్జున నాయకుడు కొలను రాజాధిరాజు. కవి తిక్కన, మారనల సహకారము విశ్వాసములు పొంది ప్రజా శ్రేయస్సుకై అహరహం శ్రమించింది. కాకతీయుల ఆడపడుచు అమరావతి రాణి అగు గణపాంబ రుద్రమదేవికి ఎంతో సహకరించింది. మార్కోపోలో క్రీ.శ. 1293న రామనాడు తంజావూరు జిల్లాలు పర్యటించి కాకతీయుల ఓడరేవు 'మోటుపల్లి'కి వచ్చు సందర్భములో రాణీ రుద్రమ గణపాంబల పేరు ప్రతిష్ఠలను విన్నాడు. నాటి ప్రజల సంపన్నత రాజ్య సుస్థిరతను రుద్రమదేవి రాజనీతిని మార్కోపోలో వేనోళ్ళపొగిడాడు.

రుద్రమదేవికి మగ సంతానం లేదు. నలుగురు ఆడుబిడ్డలు. ఒక కుమార్తెను అమరావతి మహామండలేశ్వరునకు, మమ్మడమ్మ అను కుమార్తెను కాకతి మహాదేవరాజుతోను వివాహము జరిపి మమ్మడమ్మ కుమారుడగు ప్రతాపరుద్రుని దత్తత తీసుకొని తనకు తన తండ్రికి విశ్వాస పాత్రులగు మహామండలేశ్వరుల సహకారంతో కాకతీయ సామ్రాజ్యానికి పట్టాభిషిక్తునిగావించింది.[4]

త్రిపురారి దేవుడు విశేష ప్రజ్ఞావంతుడు. ఈతడు గంగయసాహిణి వంశీయుడు. మండలేశ్వరుడయినా మహారాజువలె వెలిగినవాడు. వల్లూరు పట్టణము కొంతకాలమీతని రాజధాని. తమిళ యోధుడు కొప్పెరుం జింగని ఓడించి నెల్లూరు మనుమగండ గోపాలునికి రాజ్యమిప్పించాడు. ఈతడు తురగసాహిణి, శిష్టజన రక్షణవ్రతుడయి, "బ్రహ్మరక్షకుడు" అని బిరుదు పొందాడు. ఈతడు ప్రతాప రుద్రుని సమకాలికుడు.

నాయకుల తిరుగుబాట్లవలన గణపతిదేవుని రాజ్యమాతని చివరిదశలో తెలంగాణాకు పరిమితమయినది. రుద్రమదేవి హోయసలపయి ఆధిపత్యము వదలుకొనవలసి వచ్చినది. రెండవ ప్రతాపరుద్రుడు ఈ తిరుగుబాట్లనణచి వేశాడు. అంబదేవ మహారాజునోడించాడు. హోయసల చోళ పాండ్య నాయకులతో పెక్కు నిరర్థకములగు యుద్ధాలు చేశాడు. మొదట కంచివరకు తర్వాత తిరుచినాపల్లి వరకు తన సామ్రాజ్యాన్ని విస్తరించాడు.

ప్రతాపరుద్రుని పరిపాలనలో దేశము సౌభాగ్యవంతముగా వుంది. ఈతడు కళలను ఆదరించాడు. కవులకు, పండితులకు ఆశ్రయమిచ్చి పోషించాడు. సంస్కృతమున ఈతడు గొప్ప పండితుడు. "ప్రతాపరుద్ర యశోభూషణ" కర్తయగు విద్యానాథుడీతని ఆస్థాన భూషణము.

సైన్యముల కదలికలు యుద్ధాలు తరుచుగా వున్నప్పటికీ 'ధర్మమే పునాదిరాళ్ళు' గా గల నాటి సాంఘిక వ్యవస్థ వర్తక వాణిజ్యములకు రైతులకు చేతివృత్తుల వారికి రక్షణ కలిగించింది.[5] పట్టణములలో నాయకులు వర్తకులు మూడేసి అంతస్థుల భవనాలలో నివసించేవారు. గ్రామీణ జీవితం గౌరవప్రదం. వాణిజ్య వస్తువుల రవాణా ఎద్దులబండ్లపై జరిగేది. ఈ బిడారులకు దారిదోపిడీ గాండ్ల నుండి వర్తకమండలులు రక్షణ కల్పించేవి. మార్కోపోలో రుద్రమపాలన నాటి సాంఘిక ఆర్థికాభివృద్ధిని మతసామరస్యాన్ని జాతీయ అంతర్జాతీయ వాణిజ్యములను గొప్పగా ప్రశంసించాడు.

వస్త్రాలు, అద్దకం, చిత్రకళ, లోహపరిశ్రమ, రాళ్ళు ఇటుకల పరిశ్రమలు. కాగితపు పరిశ్రమ, పప్పులు, చెప్పులు, ఆయుధాలు, సుగంధ ద్రవ్యాలు, స్పిరిట్, మత్తుపానీయాలు, గనుల త్రవ్వకాలు వివిధ వృత్తుల వారికి జీవనోపాధి కల్పించేవి. నల్లమందు, నీలిమందుల ఎగుమతులు జరిగేవి. గుర్రాలు, కంచరగాడిదలు, ధనవంతుల కొరకు విలాసవస్తువులు దిగుమతి చేయబడేవి. (ఆర్.సి. మజుందార్ - పేజి 397) ప్రజల జీవన ప్రమాణాలలో భాగ్యవంతులకు రైతులకు నింగి నేలలకున్నంత అంతరం వుండేది. పాలకులు అధికారులు విలాసాల్లో మునిగి తేలుతుంటే, పొర్లాడుతుంటే, పొలందున్ని బ్రతికే సామాన్యులకు పూట గడవటం కష్టమయ్యేది. కరువు కాటకాలలో ప్రభుత్వ సహాయమందనప్పుడు వారి స్థితి మరీ దయనీయంగా వుండేది.

అమీర్ ఖుస్రో-సుల్తాను సమకాలీనుడు ఈవిధంగా వ్రాసాడు. "నిరుపేద కంటి నుండి రాలి ఘనీభవించిన ఒక్కొక్క నెత్తుటి బొట్టు ఒక్కొక్క ముత్యంగా రాజమకుటంలో చోటుచేసుకున్నది."

బానిసత్వం వ్యవస్థగా గుర్తింపు బొందింది. ఒక్క ఫిరోజ్‌షా వద్దే రెండు లక్షల మంది బానిసలుండేవారు. యుద్ధ ఖైదీలను బానిసలుగా అమ్మటమే కాక ఆఫ్రికాదేశాల నుండి బానిసలను దిగుమతి కూడా చేసుకొనేవారు. (ఆర్.సి. మజుందార్ - పేజి 399).

## వర్తక వాణిజ్యాలు :

కాకతీయుల కాలంలోనూ ఆ తర్వాత ఒక శతాబ్దం వరకు వైశ్యులేకాక వివిధ కులాల తెగలవారు వర్తక వాణిజ్యాలు నిర్వహించేవారు. కమ్మ, తెలగ లేక బలిజ తెగలవారు భారీగా వ్యాపారాలు చేశారు. ముద్దనశెట్టి, గంగమల్లిశెట్టి, గౌరమల్లిశెట్టి, లింగబలిజ, గాజుల బలిజ, కుంకమశెట్టి వీరందరూ వ్యవసాయదారులే కాక వర్తకులు కూడా.

శ్రీనాథుడు కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానకవి. కొండవీటి రెడ్డిరాజులు ఓరుగల్లు చక్రవర్తుల ఆదర్శంతో జావా, సుమిత్రా, శ్రీలంక, ఇతర హిందూ సముద్రపు ద్వీపాలతో వర్తక వాణిజ్యాలను ప్రోత్సహించారు. రాణివాస స్త్రీల సుగంధ ద్రవ్యాల, విలాస వస్తువుల వ్యాపారంలో ప్రఖ్యాతి గడించిన కళాప్రియుడు, మహాభాగ్యవంతుడు నగు అవచి తిప్పయశెట్టి వదాన్యతను శ్రీనాథకవి గొప్పగా ప్రశంసించాడు. తిప్పయశెట్టి అసంఖ్యాకంగా వ్యాపార నౌకలు కల్గియుండేవాడు. అతని సోదరులు నాదశెట్టి, చానుశెట్టి (లేకచామిశెట్టి) కాశ్మీరము, పంజాబుల నుండి రాజుల కొరకు విలాస వస్తువులను దిగుమతి

చేసుకొనేవారు. తిరుమలనాధశెట్టి అను మరియొకడు వ్యాపారంలో వున్నట్లు తెలుస్తుంది. అరుదైన, విలువైన, సుగంధ ద్రవ్యాలు, కస్తూరి, కుంకుమ పువ్వు, కర్పూరము, చందనము, అతి నాజూకగు డక్కామస్లిన్ వస్త్రాలు, ముత్యాలు, రత్నాలు, వెండి బంగారాలు చైనా, జావా, సుమిత్రా, మలయా, ఇరాన్, శ్రీలంక, గోవా, పంజాబు, కాశ్మీర్, ఢాకా, భూటాన్‌ల నుండి వ్యాపారులు దిగుమతి చేసేవారు. కాకతీయ చక్రవర్తుల హయాంలో ఆంధ్ర కోస్తా పర్యటించిన "మార్కోపోలో" కూడా ఈ విషయాలు ధ్రువీకరించాడు. వందలకొలది కోటీశ్వరు లీ వ్యాపారం చేసేవారని, 150, 200, 300 మంది జనాన్ని తీసుకొని వెళ్ళగలిగి అయిదారువేల మిరియపు గంపలను రవాణా చేయగలిగిన నౌకలాకాలంలో ఉన్నట్లు మార్కోపోలో వ్రాసాడు.

నాడు వర్తక సంఘాలుండేవి. వాటి పెద్దను 'శెట్టి' అని పిలిచేవారు. కోమటి, బేరికోమటి వారుగాక ఈ వ్యాపారాల్లో వున్న ఇతర కులాల వారిని కూడా ఇదేవిధంగా గౌరవించేవారు. ఒంటెద్దు జోడెద్దుల బండ్లతో కాపులు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల సంతలలో సరుకులు అమ్ముకొని, జీవనోపాధి సంపాదించుకొనేవారు.

"మహామండలేశ్వరుడగు అద్దంకి అనపోతారెడ్డి "మోటుపల్లి" రేవునభివృద్ధిపరచి, వ్యాపారస్థులకు రక్షణ కల్పించాడు. కాపయమరణం తర్వాత పాలకులు పెంచిన సుంకాలను తగ్గించి, నిబంధనలను సడలించి, రాయితీలనిచ్చి వర్తక వాణిజ్యాలకు పెద్దపీట వేశాడు. (కె.ఎల్. నారాయణ ఆర్యవైశ్య చరిత్ర).

"మోటుపల్లి రేవు వద్ద, తన హామీలను శాసనబద్ధం చేసి, శిలా స్తంభాన్నెత్తించాడు. గణపతిదేవ చక్రవర్తి, రుద్రమదేవి, ప్రతాపరుద్ర చక్రవర్తుల కాలంలో వర్తకులనుభవించిన గౌరవాదరాలను మరల వారికి కల్పించాడు. రేవుల అభివృద్ధి నిమిత్తం "ప్రగడ (ప్రగ్గడ)' ' అనే రాజోద్యోగిని నియమించాడు. బహుశా నేటి "సాలెవారి"లో ప్రగడ ఇంటిపేరు కలవారు 14వ శతాబ్దపు ప్రగడల వారసులేమో? (కె.ఎల్. నారాయణ రెడ్డి రాజుల కాలం).

# 4. కాకతీయులు - ఢిల్లీ

## ప్రతాపరుద్రుడు - ఓరుగల్లు పతనము :

ఢిల్లీ పాలకులందరూ యావద్భారత చక్రవర్తులు కాగోరినవారే. అల్లాయుద్దీన్ ఖిల్జీ దక్షిణ భారతదేశంపై దండయాత్ర చేసే వరకు ఢిల్లీ సుల్తానులీ ప్రయత్నాలు చేయకపోవటం ఆశ్చర్యకరం.

క్రీ.శ. 1294-95న దేవగిరి రామచంద్రునితో జరిగిన యుద్ధములో ఢిల్లీ సుల్తాను ఓడిపోయాడు. క్రీ.శ. 1306లో రామచంద్ర దేవుడు ఓడిపోయాడు. క్రీ.శ. 1315లో ఢిల్లీ సుల్తాను సైన్యాధిపతియగు మాలికాఫర్ పురాతన హిందూ నగరమగు దేవగిరిపై ముస్లిం పతాకమెగురవేశాడు. ఈ యుద్ధములలో కాకతీయులు యాదవులకు సహకరించలేదు. యాదవ రాజుల ఆధిపత్యం నుండి బయటపడుటకు స్వతంత్ర యత్నాలు సాగించారు.

క్రీ.శ. 11, 12, 13 శతాబ్దములలో రాజకీయ ప్రాముఖ్యతను రాజ్యాధికారాన్ని సంతరించుకొన్న ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర నాయకులు ముస్లింలవలె సంఘటితముగా కాక కులమత ద్వేషాలతో ఒకరితో ఒకరు యుద్ధాలలో మునిగి అనైక్యంగా వున్నారు.

కాకతి గణపతిదేవుడు దేవగిరి యాదవులతో స్నేహావశ్యకత గుర్తించలేదు. తాను బందీయైనపుడు రామచంద్రుడు చూపిన ఔదార్యాన్ని మరచాడు. ముస్లింల దాడులకు మొదటి అడ్డుగోడ యగు దేవగిరి ప్రాముఖ్యతను గుర్తించలేక. దేవగిరిలో మత వైషమ్యాలు రెచ్చగొట్టించాడు.

ప్రతాపరుద్రుడు కూడా యాదవరాజులు తనపై అసూయ-ద్వేషాలతో వుండటం గమనించలేదు. మాలికాఫర్ దేవగిరిపై దండెత్తినపుడు యాదవరాజుకు సహాయపడుటలోని ఔచిత్యాన్ని రాజనీతిని ఈతడు విస్మరించాడు. హిందూ రాజులు పరస్పర దౌత్య సంబంధాలు లేక, చేసుకొన్న శాంతి సహకార ఒప్పందాలను గౌరవించక కేవలం వివాహ సంబంధాలతో మాత్రమే సన్నిహితత్వం పెంచుకొనే వారు. కాకతీయులకు యాదవులకు ఈ సంబంధ బాంధవ్యాలు కూడా లేవు.

దేవగిరిని గెలిచిన తర్వాత ముస్లింల చూపు ఓరుగల్లునందలి సంపద, నిధి, నిక్షేపాలు, రత్నమాణిక్యాలు ముత్యాలపై పడింది. ఢిల్లీ సుల్తానులు ఈ నిధులు కొల్లగొట్టు ఆశతో దండయాత్రకు పూనుకొన్నారు.

ప్రతాపరుద్రు డీవిషయం గ్రహించి తన రాజకీయ బాధ్యత గుర్తించాడు. నాయకవీరులను సమావేశపరచి వారి సహకారమర్థించాడు. తమ సంప్రదాయ ప్రతిజ్ఞాబద్ధులై నాయకవీరులు దండయాత్ర నెదుర్కొనుటకు సన్నద్ధులయినారు.

ప్రతాపరుద్రుని సభ : ప్రతాపరుద్రుడు ఉదయాననే కొలువుతీరేవాడు. శాకవల్లి మల్లికార్జునభట్టు, భాస్కరకవి, గుండాభట్టు ప్రతాపభట్టు, నాయకులు, రాజ సోదరుడు అమ్మయదేవుడు, లెంకలు ముఖ్య రాజోద్యోగులు నిశ్శంక వల్లభుడు. సాహిణి మారయ, కొలిపాక సిద్దయ్య, రాయబారులతో కొలువు నిండి యుండేది, శివదేవయ్య, శరభాంకుడు, మల్లికార్జునుడు, పాలకుర్తి సూరప్ప వంటి అమాత్యులు వివిధ విషయ నిర్ణయాలలో చక్రవర్తికి సహకరించేవారు. మధ్యాహ్న భోజనకాలము వరకు కొలువు సాగేది.

ప్రతాపరుద్రుడు నూతన సభా మర్యాదలను ప్రవేశపెట్టాడు. నాయకులను లెంకలను మంత్రులను సహపంక్తి భోజనముల కాహ్వానించి, వారి సరసన చేరి స్నేహితులవలె వారిని సంభావించేవాడు. ఈ సన్నిహితత్వం లెంకలకు నాయకులకు రాజుపట్ల వినయ విధేయతలు కలుగునట్లు చేసింది. కోటిపల్లి విశ్వనాధుడను కోటీశ్వరుడు తన సర్వస్వాన్ని రాజునకర్పించాడు. ఈ సాన్నిహిత్యము ప్వ్యాడలు నాయకులకు నచ్చలేదు. వీరిలో భోజిరెడ్డి యొకడు. తర్వాత కాలమున ఈతడు గన్నమ నాయకునితో కలసి రాజద్రోహానికి పాల్పడ్డాడు.

రాజు పెత్తందారీ ధోరణులను వదలి ప్రజాస్వామ్య పద్ధతులను అవలంభించుటవలన సమానత్వము ఐక్యభావము నాయకులలో పెంపొంది నాయక సమాఖ్య రూపొందుటకు కారణమయినది.

ప్రతాపరుద్రుడు తన లెంకలను కాకతీయ పాలనపట్ల ప్రభువుపట్ల సామ్రాజ్యము పట్ల భారతీయ ధర్మము ప్రజాసంక్షేమాల పట్ల అత్యంత భక్తి విశ్వాసములు కలిగి వుండునట్లు ప్రబోధించగలిగాడు. అన్ని వర్గముల ప్రజలు లెంకలుగా చేరి ప్రభువును సామ్రాజ్యమును సేవించుటకు అవకాశములు కల్పించాడు. సైన్యపోరాట పటిమను పెంచాడు.

మహామండలేశ్వరులు మండలేశ్వరులతో సాన్నిహిత్యము ఐక్యత పెరిగింది. నాయకులందరూ పలనాటి బ్రహ్మాన్న ఆదర్శముతో తన సహపంక్తిన భుజింపచేశాడు. కొలువులో తరతమబేధములు చూపక సమదృష్టితో అందరిని ఆదరించాడు. నెల్లూరు కంచి కొలను చోళులతో చుట్టరికములు కలుపుకొని వెలమాటి నాయకులను తన

కొలువులోనికి తీసుకొన్నాడు. నాయకవర్గములో వీరు వెలమ-వెలమాటి-వెలుగోటివారుగా ప్రసిద్ధులయ్యారు.

కంపిలి రాయవంశీయులతో బాంధవ్యములు కలుపుకొన్నాడు. భూస్వామ్య పెత్తందార్లుగా వున్న "బోయ"లకు పదోన్నతి కలిగించాడు.

ఏది ఏమైనప్పటికీ అది "వర్ణాధిక్యత - వివక్షత" చట్రములో బిగిసిన సమాజమని చెప్పక తప్పదు. ఈ నేపధ్యమున ఢిల్లీ సుల్తాను సైన్యములు మాలికాఫర్ నాయకత్వమున తెలంగాణాపై దాడిచేసి ఓరుగల్లును ముట్టడించినవి. నెలల పర్యంతము ముట్టడిసాగింది. భయంకరమగు యుద్ధము జరిగింది. మాలికాఫర్ సంధి చేసుకొని యుద్ధనష్టముకై కొంత సొమ్ము, కప్పముగ తీసుకొని వెనుదిరిగాడు.

ఢిల్లీ సుల్తాను తన ఓటమికి ప్రతీకారము చేయుటకు మరల దండెత్తి వచ్చునవకాశము కలదు. దేవగిరి యాదవ రాజ్యమంతరించింది. దేవగిరి సుల్తాను పాలనలో వుంది. యాదవ నాయకులీ ముస్లిం పాలనపై మండిపడుతున్నారు. గణపతిదేవుడు రుద్రమదేవి ఇరువురూ యాదవులకు బందీలై వారి ఔదార్యమున విముక్తిపొందినవారే. అయినను యాదవ రాజులయెడ స్నేహము ఔదార్యములు ప్రదర్శించవలసినదిగా ప్రతాపరుద్రుడు బోధింపబడలేదు.

"భూస్వామ్య వ్యవస్థ ప్రతీకారేచ్ఛనే గాని ఔదార్యాన్నీ పరస్పరావగాహనను పెంచదు."

ప్రతాపరుద్రుని అతని మంత్రుల బ్రాహ్మణారాధన శైవ జైన మతస్థులకు కంటగింపైనది. శైవజైన మతగురువులు ప్రజలను భయంకర వీరాచారములతో ఆకట్టుకొని వారిని రాజుకు దూరం చేశారు.

ప్రతాపరుద్రుడు రెండవమారు దిగ్విజయయాత్ర చేశాడు. కంచిని గెలిచి మార్గమధ్యములో నున్న చిన్న పెద్ద ప్రభువులను తన పాదాక్రాంతము చేసుకొన్నాడు. అంబదేవ మహారాజు నోడించాడు. హోయసలపై కూడా సైన్యాల నడిపించాడు. అన్ని సంప్రదాయక విజయయాత్రవలెనే ఇది కూడా నిరర్థకము. ఆత్మహత్యా సదృశము. భండారము వట్టిబోయింది. వీరు లెందరో అసువులు వీడారు.

ఢిల్లీ సైన్యములు కొన్నిసార్లు ఉత్తరమున దేవగిరినుండి, మరికొన్నిసార్లు ఒరిస్సా, కోస్తా ఆంధ్ర ప్రాంతముల ద్వారా ఆంధ్రదేశముపై దాడిచేసేవి. అందువలన కాకతీయ

నాయకులు అన్నిదిశల జాగరూకులై రక్షణవిధి నిర్వహించవలసివచ్చేది. ముస్లింల దండయాత్రలను గోదావరీ తీరమున ఒరిస్సా సరిహద్దున ఉత్తరాంధ్రమున కాకతీయ సైన్యములు కనీసం మూడుసార్లు తిప్పికొట్టినవి. ఈ యుద్ధములతో కాకతీయ నాయకుల కీర్తి ప్రతిష్టలు పెరిగినవి. గుఱ్ఱములు, ఏనుగులు ఇతర సంపదను ముస్లింల నుండి వీరు దోచుకున్నారు.[3]

ముస్లిం చరిత్రకారుడగు బర్నీ ఈ యుద్ధములను ఇలా వర్ణించాడు. "సర్దారులెందరో పారిపోయిరి. భటులు మడిసిరి. గుఱ్ఱములు, ఏనుగులు హిందువులకు చిక్కెను. ఉలుగుఖాన్ ప్రాణములతో దేవగిరి చేరెను. "మాలిక్ తామర్" కొలది సైన్యముతో హిందూ రాజ్యమున చిక్కుపడి తిరుగుచూ అచటనే మట్టుబెట్టబడెను. 'మాలిక్ తిజన్ (MALIK TIGIN)"ను అచటి ప్రజలు చంపిరి."

వరంగల్లు పట్టణమును తమ రాజకీయ స్వాతంత్ర్యమును కాపాడుకొనుటకు ఆంధ్ర సైన్యము ప్రదర్శించిన వీరత్వము చేసిన త్యాగము సాటి లేనిది. ఢిల్లీ సైన్యము కట్టుదిట్టమగు వ్యూహ నిర్మాణముతో దీటైన యుద్ధపటిమతో పోరాడి కోట తర్వాత కోట నాక్రమించుకొన్నది. నాయకులను తరువాత చక్రవర్తిని ఓడించి, శాంతి ఒప్పందములు చేసుకొని, కప్పములు స్వీకరించి యుద్ధ నష్టమును కూడా వసూలు చేసుకొని వెనుతిరిగినవి. పదిహేను సంవత్సరములపాటు జరిగిన ఈ యుద్ధాలతో ప్రతాపరుద్రునికి ధన, సైన్య, ఆయుధ నష్టము విపరీతముగా జరిగింది.

ఈ సమయముననే తమిళపాండ్యునితో, మలబారువారితో వీరభల్లాణునితో తీరాంధ్ర నాయకులతో ప్రత్యేకించి అంబదేవ మహారాజుతో ప్రతాపరుద్రుడు పెక్కు యుద్ధాలు చేశాడు.

ఖజానా నింపటానికి, యుద్ధ నిధులకు విధించబడిన పన్నులతోనూ, సుంకములతోనూ, ఇరుపక్షాల దహనకాండలతోనూ సామాన్య ప్రజల స్థితి మిక్కిలి దయనీయంగా వుండేది. దుర్భరమయిన వినాశనకాలమది.

త్రిపురారి మహాదేవుడు, గుండయ నాయకుడు, మనవాడి గోపీ నాయకుడు రుద్రనాయకుడు మాచయనాయిణి, పోచినాయణి, లెంకల, యువనాయకుల సైన్యాధిపత్యమున ప్రతాపరుద్రుడు ఢిల్లీవారిని నిలువరించాడు. నెలల పర్యంతమీ యుద్ధములు జరిగాయి. ముస్లింలు విసిగి వేసారి ఎట్టకేలకు శాంతి పరస్పర సహనపు ఒప్పందములు చేసుకొని విలువయిన బహుమతులతో వెనుదిరిగారు.

ఉత్తర హిందూదేశపు రాజులు మొదట మహమ్మద్ గజినీని, నూట నలువది మూడు సంవత్సరముల తర్వాత మహమ్మద్ గోరీని సంఘటితంగా ప్రతిఘటించలేకపోయారు. దేవగిరి రామచంద్రదేవుడు ఓడిన తర్వాత ఆంధ్రవీరులు అల్లాయుద్దీన్‌ను ప్రతాపరుద్రుని నాయకత్వమున ఐక్యంగా పోరాడి నిలువరించారు.

ఈ భయానక యుద్ధానుభవముతో సంపూర్ణ అవగాహన కలిగి ప్రతాపరుద్రుడు తన సైన్యమును కట్టుదిట్టం చేశాడు. అతని యుద్ధ విభాగముల ఏర్పాటు: లెంకల విధానము ఎంతో మెచ్చదగినది.

వరంగల్లు నగరము తన బంగారపు వజ్రపు నిధులతో నాడు (7 శతాబ్దాల క్రితం) ఎంత దేదీప్యమానముగా వున్నదో మనమూ ఊహింప వచ్చును. అత్యంత పటిష్టము దుర్భేద్యమునగు కోటలతో ఆరు మహానగరములలో నొకటిగా వరంగల్లు ప్రసిద్ధిచెందింది. ఇటువంటి మహా నగరమును రక్షించుకొనుట జాతి గౌరవముగా నాయకులు లెంకలు భావించుటలో ఆశ్చర్యము లేదు.

కాకతీయులు వరాహలాంఛనము చేబట్టి కమ్మ, తెలగ, రెడ్డి, వెలమ, బలిజ, ముదిరాజ, బోయ, తెలికనాయకులు, బ్రాహ్మణ వీరులు, బిడారు రక్షణదళాల లెంకలు ప్రతాపరుద్రుని పక్షాననిలిచి, గోదావరి వైపు నుండి వరంగల్లుకు వచ్చు ముస్లిం సైన్యములతో వారాల పర్యంత యుద్ధం చేశారు. వెలుపలి మట్టికోట, లోతట్టురాతి ఇటుక ప్రాకారముల మధ్య ఏడు ప్రాకారములు వున్నాయి. ఒకటివెంట ఒకటి ఈ ప్రాకారములు కూల్చి వేయబడినవి.

దశాబ్దాలుగా కొందరు విద్రోహులు దేవగిరి రాజులతోను అచటి పురోహితులతోను చేతులు కలిపి కుట్రలు పన్నుతున్నారు. ప్రతాపరుద్రుడు, లెంకలపట్ల ముఖ్యముగా వెలనాటి నాయకులపట్ల చూపే అభిమానాన్ని చూసి మరికొందరు ఈర్ష్యపడుతున్నారు. నాయకుల మాటలు పెడచెవినబెట్టి ప్రతాపరుద్రుడు గన్నమనాయకుని వరంగల్లుకు ప్రధానకొత్వాలుగా నియమించాడు. ఈ గన్నమనాయకుడు ముస్లింలకు అమ్ముడు పోయాడు. రాజ ప్రతినిధి పదవినాశించి రాజును ఘోరంగా వంచించాడు. ముస్లిం సైన్యాలకు కోటలోనికి అనూహ్యంగా ప్రవేశం కలిగించి రాజాంతఃపురమును సహితము వారివశం చేశాడు. పెద్ద సైన్య విభాగమునకు అధిపతి అయిన "తెరల భోజిరెడ్డి" గన్నమ నాయకునితో చేయిగలిపాడు.

ఈ నాయకుల ద్రోహంతో ఎట్టకేలకు క్రీ.శ. 1323న వరంగల్లు కోట ముస్లిం సైన్యములకు పట్టుబడింది. కాకతీయ మహాసామ్రాజ్యం పతనమయింది.[5] ఫ్యూడల్ పాలనలో ప్రభువులపై ద్వేషం పెంచుకొనేవారు ఎప్పుడూ కొందరుంటారు. ఒకరిపై ఒకరికి అనుమానాలు హెచ్చు. రాజు తమను నిర్లక్ష్యం చేశాడని, అవమానించాడని నిరాధారపు ఊహలతో పరరాజులతో చేతులు కలిపేవారు కొందరు. పరరాజులవద్ద పదవులకాశించి మరి కొందరు, హేయమయిన రాజద్రోహానికి పాల్పడతారు.

"అనైక్యం పరస్పర ద్వేషము నిరంతర సందేహాస్పద వాతావరణం భూస్వామ్య వ్యవస్థ సామాన్య లక్షణాలు."

తమ పొరుగుప్రాంతాలపై ఆధిపత్యానికి నాయకులు ప్రాకులాడేవారు. రాజదండనకు అణచివేతకు భయపడి మిన్నకుండేవారు. రాజు బలవంతుడయితే విధేయులుగా వుండేవారు. కొల్లగొట్టుటకు అవకాశములిచ్చు రాజులకు కొందరు విధేయులు. నిరంతరం మారే విధేయతలు, సందిగ్ధత, అస్థిరత, ఆటవిక న్యాయముల వలన యాదవ కాకతీయ హోయసల సామ్రాజ్యాలు తమ అధికారాన్ని స్థిరపరచుకొనలేక పోయినవి. ఢిల్లీ సామ్రాజ్యవాదులు పై చేయికాగలిగారు.

భారతదేశ ధర్మానుసారం యుద్ధాలలో నష్టపడిన గ్రామీణ రైతాంగానికి పట్టణ వ్యాపారులకు ప్రతాపరుద్రుడు నష్టపరిహారాన్ని ఇచ్చేవాడు. తాను వరంగల్లు నుండి కంచివరకు చేసిన దండయాత్రలలో ప్రతాపరుద్రుడు నష్ట పరిహారాలు చెల్లించాడు. యుద్ధాలవలన ఢిల్లీకి కట్టిన కప్పములవలన యుద్ధనష్టాల వలన తగినంతగా పరిహారము తరువాత కాలంలో ఇచ్చి వుండడు. దీనివలన కొందరు ప్రజలు అతనికి వ్యతిరేకులయి వుండవచ్చును.

ఢిల్లీనుండి దేవగిరి వరకు కొన్నితరాలు పరిపాలించి తెలంగాణాపై ఎన్నో దండయాత్రలు చేసిన ముస్లింలకు, కాకతీయులకు ప్రతికూలురగు నాయకులతోను, వ్యాపారస్థులతోను పౌరులతోను సంబంధాలుండే అవకాశం వుంది. వారి సైన్యాలకు చక్కని నాయకత్వం, క్రమశిక్షణ మెరుగయిన ఆయుధాలు వున్నాయి. దక్షిణ భారతంపై దండయాత్రలు జరిపి కన్యాకుమారి వరకు ఎంతోకొంత తాత్కాలిక రాజ్యాధికారం కలిగి వుండటంతో దేశవ్యాప్తంగా నాయకులతో సంబంధాలుండే అవకాశం కూడా వుంది.

**భారత రామాయణ యుద్ధనీతులు హిందూరాజులు పాటించారు. ముస్లింలకీ రణధర్మంతో పనిలేదు. ఆంధ్రుల ఓటమికి ఇది ఒక కారణము.**

దురాక్రమణదారులకు ఈ మర్యాదలు, మానవతా దృష్టిలేదు. ఇస్లాం మతవ్యాప్తి ఆదర్శంగా, విగ్రహారాధకులను చంపుట లేక ఇస్లాంలో చేర్చుకొనుటే ధ్యేయంగా బలీయ విజయవాంఛా క్రూరత్వాలతో వారు వ్యవహరించారు.

ప్రతాపరుద్రుడు యుద్ధఖైదీగా బంగరుపంజరములో ఉంచబడి, త్రోవ పొడుగునా ప్రదర్శింపబడుతూ, ఢిల్లీకి బహుమానంగా కొనిపోబడ్డాడు. గన్నమ నాయకుడు హరిహర, బుక్కనాయకులు కూడా ఢిల్లీకి బందీలుగా తరలించబడ్డారు.

ముస్లిం చరిత్రకారులు వారి గాయకులు ఆంధ్రుల సంపద కొల్లగొట్టబడిన వైనాన్ని చరిత్రలో పొందుపరచారు. వజ్రకరూర్ నుండి వజ్రములు, బంగారము, తమిళదేశం నుండి ముత్యాలు, మైసూరునుండి ఏనుగుదంతాలు, ఏనుగులపై, ఒంటెలపై ఢిల్లీకి మోసుకొని పోయారు.

ప్రతాపరుద్రచక్రవర్తి నర్మదానదిలో స్నానముచేసే మిషతో ఆత్మహత్య చేసుకొన్నాడు.

కొందరు నాయకులు ముస్లింలతో సఖ్యతపడ్డారు. జగన్నాధపండితుడను మంత్రి ఇస్లాం స్వీకరించి వరుసగా ఇద్దరు సుల్తానులవద్ద మంత్రిగా పనిచేశాడు. దేవగిరి నుండి ఢిల్లీకి తీసుకొని రాబడిన మరికొందరను ఢిల్లీ వీధులలో ప్రదర్శించారు. వీరికి ఇస్లాం మతమిచ్చారు. ఇదంతా గుండెకోతకాగా మిగిలినవారు ముస్లింలకు బుద్ధిచెప్పే అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు.

# 5. ప్రతాపరుద్రుని బలిదానం

అనూహ్యంగా, సజీవంగా ప్రతాపరుద్రుడు బందీకావటం ఢిల్లీ ముస్లింలకు అరుదయిన, అతి విలువయిన, అద్భుతమయిన యుద్ధ బహూకృతి, జ్ఞాపిక. ఇందరు నాయకులతో సహా ప్రతాపరుద్రుడు సజీవంగా చిక్కటం ఆశ్చర్యకరం. యుద్ధభూమిలో ఇలా జరుగుటకవకాశం లేదు యుద్ధభూమికి దూరంగా నాయకులతో సమాలోచనలో నున్నప్పుడు అంతర్గత శత్రువుల గూఢవిద్రోహ చర్య కారణమయివుంటుంది. ఈ ద్రోహులెవరై వుంటారు? వీరీ నయవంచనకు ఎందుకు పాల్పడ్డారు? దేవగిరి వారి ప్రమేయము తప్పనిసరిగా వుండి వుంటుంది. వారి ప్రతినిధులే ఈ విద్రోహులకు సహకరించి వుంటారు. రుద్రమదేవి, ప్రతాపరుద్రుల దండనకు గురైన కొలను నాయకుల పాత్రకూడా వుండవచ్చు. గన్నమనాయకుడు చేసిన ద్రోహము తెలిసినదే. గన్నమనాయకుని మతంమార్చి ఇస్లాం ఇచ్చి "మహమ్మద్ మక్బూల్"గా పేరుపెట్టి రాజప్రతినిధిగా వరంగల్లుకు పంపారు. జగన్నాథ పండితుడు ఇస్లాం స్వీకరించి ఢిల్లీ కొలువులో మంత్రిగా స్థిరపడ్డాడు.

బందీ అయిన ప్రతాపరుద్రుడు నర్మదానదిలో మునిగి ఆత్మహత్య చేసుకొన్నాడని చెప్పుకొన్నాం. చావుకు చిత్రహింసలకు భయపడి ప్రతాపరుద్రుడీ ఆత్మ హత్యచేసుకొని వుండడు. అతని ఆత్మహత్య అతడు ముందుగా ఊహించినదికాదు. నీటిలో మునిగి చనిపోవుట శాస్త్రవిహితమే, గతములో చక్రవర్తులు, రాజులు, వయస్సుగడిచిన తర్వాత ఇదే విధముగా ప్రాణాలు విడిచారు.

ప్రతాపరుద్రుని ఆత్మహత్యకు కారణం మనము ఊహింపవచ్చును. శతాబ్దములపాటు దక్షిణాపథానికి నాయకత్వం వహించి రాష్ట్రాలకు సుస్థిరపాలన అందించిన కాకతీయ వంశంలో జన్మించాడు. కరికాళచోళుడు, దుర్జయుడు వీరి మూల పురుషులు. వీరి పూర్వీకులు కమ్మనాటి కమ్మనాయకులుగా వుంటూ సామ్రాజ్యాధికారం రాజ్యవైభవాలు పొందారు. రాష్ట్రకూట చోళచాళుక్య యాదవ వీరనాయకుల త్యాగస్ఫూర్తితో ప్రభావితులయి రక్త సంబంధంతో అభిమానంతో వీరపూజకు ఆరాధనకు అంకితమయిన లెంకలు ప్రతాపరుద్రునికి అత్యంత ఆత్మీయులు. భారత ధర్మరక్షణకు కాకతీయుల జాతీయ నాయకత్వ స్థాపనకు ప్రాణాలు వీడిన వేలాది నాయకులు, తాను ముస్లింల ఎదుట తలవంచి నిలుచుట హర్షింతురా? గణపతి దేవ చక్రవర్తి రుద్రమదేవి రుద్రదేవుడు వలన ఇనుమడించిన కాకతీయుల వంశప్రతిష్ట ఢిల్లీసభలో ముస్లింబందీగా ప్రదర్శింపబడి

ప్రాణాలమీద ఆశతో దేవగిరి రామచంద్రునివలె మరల ఆంధ్రదేశమునకు తిరిగి వచ్చినచో మట్టిగలియదా? తాను నమ్మిన మంత్రులు ఉద్యోగులు చేసిన నయవంచన అతని మనసును అహరహము సంక్షుభితపరచింది. అతి స్వల్పభూస్వామ్య పెత్తందారీ తనాలకు ఆసపడి లజ్జా విహీనులయి వారిద్రోహం చేశారు. తాను ముస్లింల ప్రతినిధిగా వరంగల్లుకు తిరిగివచ్చుట ఈ అధమాధముల స్థాయికి దిగజారుటకాదా? కలనయిన ఇటువంటి అల్పమగు ఆలోచన ప్రతాపరుద్రునికి కలుగదు. అతడు కేవలము సంస్కృత పండితుడు, పండిత సభాధ్యక్షుడు మాత్రమేకాదు. అనేక యుద్ధముల ఆరితేరినవాడు. అతని నాయకత్వమున ఆంధ్ర నాయకులు పలుమార్లు ఢిల్లీవారినోడించారు. ఢిల్లీ చక్రవర్తులకాతడు సింహస్వప్నము. యుద్ధరంగమున వీరమరణము పొందిన భాగ్యశాలురగు తన నాయకులను తలచి వారితోపాటు వీరమరణము నోచుకొనని తన దౌర్భాగ్యమునకై అతడు చింతించాడు. అందువల్లనే పవిత్ర నర్మదానదీ జలాల్లో మృత్యువును కౌగలించుకున్నాడు. ప్రతాపరుద్రుని ఆత్మత్యాగము ఢిల్లీ సుల్తాను విజయాన్ని నిష్ఫలం చేసింది. నీతి బాహ్యులు దురాశాపాతకులయిన నమ్మక ద్రోహులకు నిరసన తన మరణముతో తెల్పాడు. ఈ త్యాగము ప్రాణములతో మిగిలిన తన అనుచరులకు "బానిసత్వముకన్నా మరణమే మేలు" అని ప్రబోధించింది. ఈ ఐచ్ఛిక మరణము భారత ధర్మ పునఃస్థాపనకునై ఆంధ్ర నాయకులు రాజకీయ రంగమున రణరంగమున నిలిచిపోరుటకు ఉత్తేజము నిచ్చినది. ఈ ఉదాత్త త్యాగముచే ప్రతాపరుద్రుడు నాయకవర్గాలకు రైతులకు, భావితరాలకు ఆరాధ్య దైవమయినాడు. అతడు చిరంజీవి.

ప్రతాపరుద్ర చక్రవర్తి ఢిల్లీ చెరనుండి తప్పించుకొని మరల ఆంధ్ర దేశమునకు వచ్చినట్లు ఇతిహాసముంది. ప్రముఖ సంస్కృతాంధ్ర పండితుడు, కవి శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రి "ప్రతాపరుద్రీయ" నాటకమును వ్రాసాడు. క్రీ.శ. 1326కు చెందిన గుంటూరు జిల్లా శాసన మొకటి ఈ కథకు సాక్ష్యముగా వుంది.

ప్రోలయ కాపయలు ప్రజలను సంఘటిత పరచుటకు ఈకథ ప్రచారము చేసియుందురు. మహారాజు చనిపోలేదని, రహస్యముగా విప్లవమునకు నాయకత్వము వహించినాడని చేసిన ప్రచారము యుద్ధములు చేయుటకు నాయకసమాఖ్య రూపొందించుటకు ఉపయోగపడియుండును.

# 6. పశ్చాత్తాపము

యుద్ధ ఖైదీలను ఢిల్లీలో ప్రదర్శించారు. ఇస్లాంమతం ఇచ్చారు. కొందరిని ప్రతాపరుద్రుని ఆత్మహత్యకు సహకరించారని గొలుసులతో కట్టివేసి జైళ్ళలో నిర్బంధించారు. మతం మార్చుకొనిన కొందరకు ఢిల్లీలోనే ఉద్యోగాలు ఇచ్చారు. ఇస్లాం మతం తీసుకొనకపోయినను, ఢిల్లీ సుల్తానును సేవించుటకు అంగీకరించిన వారికి నాయంకరములు పదవులు ఇచ్చి తిరిగి ఆంధ్రదేశమునకు పంపారు. ఉన్నత పదవులలోనున్న హిందువులు ముస్లింలచే మిత్రులుగా గౌరవింపబడినారు.

ఢిల్లీకొలువులోని విపరీత ధోరణులు, పాశవికత బందీలయిన నాయకులకు జుగుప్స కలిగించినవి. ప్రతాపరుద్రునకు తాము చేసిన ద్రోహమునకు వారు పరితపించి యుందురు. ఆంధ్రదేశమున జరుగుతున్న విముక్తి పోరాటాలు ఢిల్లీలో వున్న ఆంధ్రులకు ఐదు సంవత్సరాలుగా తెలియుచున్నవి. ఢిల్లీ కొలువులో వలస ముస్లింలకు తమకు మధ్యగల అంతరాలు, తమ హీనత్వము వారికి గుండెకోత అయింది. అనాదిగా వారి జీవితములతో పెనవేసుకొన్న హైందవ ధర్మ నిరతి వారిని ప్రోలయ, ముమ్మడి దేవుడు. అన్నయ మంత్రులు ప్రయాణించుచున్న విప్లవ మార్గమునకు మళ్ళించెను.

తెలంగాణా, కర్ణాటక రాజ్యములలో పాలన సుల్తానుకు కష్టమయినది. పదవుల పంపిణీతో సుల్తాను చాలామందికి అసంతృప్తి కలిగించియుండును. ఇస్లాం మతం తీసుకొన్న నాయకులను ఎందరను ఎంతవరకు నమ్మవచ్చునో అతనికి తెలియదు. హరిహరరాయలు, బుక్కరాయలు ఈ పరిస్థితులలో తమ దైన్యమునకు కుందుచున్న నాయకులు సుల్తానుకు వ్యతిరేకులయి అవకాశముల కొరకు ఎదురుచూచుచుండిరి. ముస్లిం సైన్యములు వరంగల్లులో నిలుచుట కష్టమయినది.

కోట తరువాత కోటను ఆక్రమించుతూ, సామ్రాజ్యపు నలుమూలలా ఆంధ్ర నాయకులు సాగించే విప్లవము, శాంతి భద్రతల నిర్వహణకే కాక అతని అధికారమునకే సవాలయింది.

మతం మార్చుకొనక ఢిల్లీ వరంగల్లులలో బందీలుగానుండి తన ఆధిపత్యమును అంగీకరించిన ఆంధ్రనాయకులకు సుల్తాను తెలంగాణ, కర్ణాటకలలో వివిధ పదవులిచ్చాడు. దీనివలన చాలామంది నాయకులు తెలంగాణ కర్ణాటక రాజ్యములకు తిరిగివచ్చారు.

ప్రోలయ కాపయలకు బంధువులగు హరిహరరాయలు, బుక్కరాయలు ఇస్లాం స్వీకరించి "కంపిలి" రాజప్రతినిధులుగా కర్ణాటకకు వచ్చారు. ప్రజలు తిరగబడ్డారు. విద్యారణ్య స్వామిచే ప్రభావితులయి మరల హిందువులుగా మారిన తరువాత ప్రజలు వారి నాయకత్వమంగీకరించారు.

ఈ పరిణామములు ఢిల్లీ చేరినవి. ఢిల్లీ కొలువులో వున్న పెక్కుమంది ఆంధ్ర నాయకులు హరిహరరాయల, బుక్కరాయల మార్గమనుసరించి ప్రోలయ కాపయల నాయకత్వ మంగీకరించుటకు నిర్ణయించుకొన్నారు. గన్నమనాయకుని పిరికితనమును నయవంచనను అసహ్యించుకొన్నారు.

వీరిలో ఎందరు ఢిల్లీ సుల్తాను కబంధ హస్తముల నుండి తప్పించుకొన్నారో, ఎందరు హరిహరరాయలు, బుక్కరాయలు చేసిన తిరుగుబాటుకు ముందు వెనకలుగా ఆంధ్రదేశమునకు వచ్చి విప్లవంలో చేరారో తెలియదు.

ఢిల్లీ చెరలలో వున్నవారు, ముస్లింలుగా మారినవారు, ఢిల్లీ ప్రతినిధులుగా వరంగల్లులో ఉన్నవారు అధిక సంఖ్యలో బాహాటంగా తిరుగబడి ప్రోలయ నాయకత్వమంగీకరించారు. జాతీయ విప్లవములో భాగస్వాములయ్యారు.

# 7. వరంగల్లు నగరము

వరంగల్లు అతి భాగ్యవంతమయిన నగరం. విలువయిన రత్నాలు ఆభరణాలు విదేశీ వ్యాపారం చేసే భాగ్యవంతులయిన వ్యాపారస్థులకు నిలయం. పెక్కు అంతస్థులున్న భవనాలలో నాయకులు వ్యాపారులు భాగ్యవంతులు నివసించేవారు. గుఱ్ఱాలు గుఱ్ఱపు బండ్లనెక్కి తిరిగేవారు. కళాప్రియులకు కొదువలేదు. విలాసవంతమగు జీవితముగడపు అందగత్తెలు ప్రత్యేకమయిన వీథులలో నివసించేవారు. దేవగిరి వరంగల్లు నగరముల పతనము తర్వాత నిర్మించబడిన బీజపూరు రాజప్రాసాదములు ముఖ మంటపములు చెట్ల వరుసలు పుష్పోద్యానవనాలు జలయంత్రాలు చూచి నాటి కాకతీయుల రాజధాని ఎంత శోభాయమానంగా వుండేదో, అలనాటి అభివృద్ధి వైభవము లింకెంత సమ్మోహనకరమో ఊహించవచ్చు.

సాక్షికంగా నేటికీ నిలచియున్న సమున్నతమగు బీజాపూర్ దర్బారు హాలు, అందలి పటిష్ఠమగు నిడుపాటి నల్లరాతి స్తంభములు, వరంగల్లు, దేవగిరి నగరములలోని అత్యంత కళాత్మకము గంభీరమునగు కొలువు కూటములను వాటిపై పరచుకొన్న విశాలమయిన పైకప్పులను లోకప్పులను చిత్రశాలలను స్ఫురణకు తెచ్చును.

బీదవారు పూరిపాకలలో నివసించేవారు. అడుసుమట్టి, మట్టి ఇసుకలతో గోడలు కట్టబడేవి. మట్టి కుండలను పాత్రలుగా వాడేవారు. వెదురు మంచములపై నిద్రించేవారు. వారి శ్రమకు ప్రతిఫలంగా ధాన్యము ఆహార వస్తువులు ఇవ్వబడేవి. నేటి సామాన్యుల బతుకు నాటి వారికంటే ఏమాత్రం మెరుగ్గా లేదు.

క్రీ.శ. 1321లో ఉలుగుఖాన్ వెలుపలి మట్టికోటపై నిలిచి నగరములోనున్న జల యంత్రములు, చంపక, మొగిలి, సన్నజాజి పూలతోటలను చూచి ఆశ్చర్యభరితుడయినాడు. నగరము పేటలుగా విభజింపబడినది. వేరు వేరు వృత్తులవారు వేరు వేరు పేటలలో నివసించేవారు. వాటిలో వెలిపాలెం కూడా వుంది. పూటకూటిండ్లు సత్రములు దేవాలయములు విపణివీధులున్నవి.

సామాన్యజనం బీదరికంలో మగ్గేవారు. అగ్రవర్ణులగు బ్రాహ్మణులు కూడా బీదరికమనుభవించినట్లు తెలుస్తున్నది. శ్రీనాథుడు పల్నాడు, రాయలసీమలో గృహస్థులు సన్నన్నము, పెరుగు రుచికరములగు వంటకములు వడ్డించలేదని సంకటి, మజ్జిగ, ఆకుకూరలు వడ్డించారని వాపోయాడు. వేశ్యలు లాలిత్యహీనలై రుచిలేని తిండితింటూ

ముదుగు బట్టలతో మొరటుగా వున్నారని హేళన చేశాడు. కానీ వినుకొండ వల్లభామాత్యుని (శ్రీనాథుని) కృతమగు క్రీడాభిరామంలో వరంగల్లు నగరము భాగ్యవంతమగునదిగను ప్రజలు జీవితమెంతో సౌఖ్యవంతముగను వున్నట్లు వ్రాయబడింది. [1]

నాడు నిర్బంధ శ్రమ అమలులో వుంది. కూలీలకు కూరలు, పచ్చళ్ళు, సంకటులు పెట్టేవారు. ఈ నిర్బంధశ్రమను రహదారులు ధర్మశాలలు, చెరువులు, చలివేంద్రాలు, విద్యాలయాల నిర్మాణమునకై మాత్రమే విధించేవారు. స్త్రీలు శ్రమజీవులు. కదురాడించి కాపురం గడిపేవారు. నీటికై స్త్రీలు బహుదూరంలో వున్న దిగుడు బావులకు వెళ్ళవలసి వచ్చేది.

పండుగ రోజులలో, జాతరలు, తిరునాళ్ళు జరిగేవి. వీటిలో ప్రజలందరూ ఆనందంగా పాల్గొనేవారు. కవి పండితుల గోష్ఠులు, వాదాలు సర్వసాధారణం. నాటి సాంఘిక జీవితంలోని అన్ని ఉత్సాహ ప్రదర్శనలలో వరంగల్లు ప్రజలదే అగ్రతాంబూలం.

కాకతి ప్రోలయ కుమారుడగు మొదటి ప్రతాపరుద్రుడు వరంగల్లు (ఓరుగల్లు) కోటను నిర్మించాడు. బంకమట్టి, ఆవుపేడ, బెల్లము, బెల్లపు ఊట, ఉసిరికనీళ్ళతో అడుసు తొక్కించి మట్టికోట నిర్మించబడింది. గునపములతో పొడిచినా ఈ మట్టికోట పెచ్చులు కూడా రాలవు. ముస్లింలు యంత్ర సహాయమున విసిరిన ఇనుపగుండ్లు కోటపై చిన్న నొక్కును కూడా కలిగించలేకపోయినవి. గణపతిదేవుడు రాజధానిని హనుమకొండనుండి వరంగల్లుకు క్రీ.శ. 1252-54 మధ్యలో తరలించాడు.

క్రీడాభిరామమను వీధినాటకము 14వ శతాబ్దపు పూర్వార్థమున ఓరుగల్లును వర్ణించినది. (మారేమండ రామారావుగారి వరంగల్లు వర్ణన) "ఈ వీధి నాటకమున బ్రాహ్మణ వైశ్య మిత్రులిద్దరు సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు చేసిన నగర సంచారం విపులముగా వర్ణించబడింది. ప్రథమముగా వీరు "వెలిపాలెం" అటనుండి మేదరివాడకు వెళ్ళిరి. వెలిపాలెం మధ్యనున్న మైలసంత చూచి "హాలికవాటి" ప్రవేశించిరి. ఇచట వారు తక్కువ జాతివారిని, జూదగాళ్ళను చూచి, అచ్చటనుండి "మోహరవాడ" (సైనికుల వీధులు[2]) తూర్పుకు నడచి నీటితో నిండిన లోతైన కందకమును చూచిరి. సంకులముగా వుండు ప్రధాన రాజవీధిని వదలి "వంకద్రోవ" నగరి ప్రవేశించిరి. వారు వీరుల గుడిని, "ఏకవీరా" దేవి గుడిని దర్శించిరి.

సూర్య కాంతిలో మెరయుచున్న స్వయం భూదేవాలయమును దర్శించి భైరవాలయము గడిచిరి. మధ్యాహ్నమయినదను గుర్తుగా "ఆంధ్రోర్వీశు మొగసాల"

పదునారు మార్లు గంట మోగినది. బ్రాహ్మణవాడలో పూటకూటింట కుత్తుక వరకు మెక్కి అందుకొంతసేపు విశ్రమించిరి. "వేశ్యవాటి ప్రవేశించి "మాచలదేవియను" వారాంగనతో సంభాషించిరి. ఈమె ప్రతాపరుద్రుని కొలువుకత్తె. కొన్ని వేశ్యాగృహముల సందర్శనానంతరము పాములాట, పొట్టేళ్ళ యుద్ధము, కోడిపోరు చూచిరి. తదుపరి వారి ప్రియురాండ్రను కలిసిరి."

"క్రీఢాభిరామమున వర్ణించిన ప్రదేశములను కొన్నింటిని నేడును వరంగల్లు కోటలో గుర్తించవచ్చు. విశాలమగు మట్టిగోడ నాలుగు దిక్కుల ప్రవేశములతో కన్పించును. పటిష్టమగు పశ్చిమ ద్వారము, అటునుండి లోపలకు వంకదోవకలదు. రెండు ఫర్లాంగులలోపల బలమగు రాతిగోడ వున్నది. దీని లోతట్టున పైకెక్కుటకు మెట్లు, రాతిగోడలతో నాలుగువైపుల ప్రవేశ ద్వారములు, వాటినుండి వంకదోవలు కలవు. వీటికి నైరుతి దిశలో "వీరులగుడి" "మేదరాయనగుడి" వున్నవి. ఈ బాటకుత్తరంగా వీరభద్రాలయము మరియొక చిన్నగుడి. బాటచివరగల ప్రదేశమునకు ఉత్తరంగా ఇటుకగోడ. ఈ గోడలోపల కంచుకోట కలదు. (కంచుకోట - నిజానికి కంచుతో నిర్మించినది కాదు. సప్త ప్రాకారములు లెక్కచెప్పుటకు ఈ గోడనిట్లు పిలిచెదరు) దీనిలోపల రాజప్రాసాదములున్నవి. ముందుకు నడచిన ఈ బాట దక్షిణముగ మళ్ళును. ఈ మలుపు దక్షిణమున, తర్వాతకాలపు కట్టడం ఖుషీమహల్ కలదు. దీనికి తూర్పువైపున నాలుగు వైపుల అందముగా చెక్కిన తోరణాలతో విశాలమగు మైదానం వుంది.

ఈ మిత్రులిద్దరూ మట్టిగోడలోనున్న పశ్చిమ ద్వారంగుండా కోటలోనికి ప్రవేశించి, మట్టికోట రాతికోటల మధ్యనున్న బాహ్యకటకమును చేరారు. మైలసంత... హోలికవాడలు, మోహిరీవాడ వెలిపాలెము లిందేవుండవచ్చును. రెండవ ప్రాకారములోపల వీరులగుడి లేక ఎర్లాల్ గుడి కలదు.

దక్షిణమున నేలశంభు దేవాలయ (స్వయంభూదేవాలయము) ప్రాంతమున బ్రాహ్మణవాడ వేశ్యవాటియుండవచ్చును."

సంతలలో కొబ్బరికాయలు, మామిడిపండ్లు, గంధము, కస్తూరి ఇతర సుగంధ ద్రవ్యములు, ఏనుగు దంతములు, పట్టు, వస్త్రములు, ముత్యములు, పసుపు, పంచదార, బెల్లము, ఉప్పు, నేయి, తైలములు, మిరియాలు, తగరము, సీసము, బియ్యము, పిండి, గోధుమలు, అపరాలు, నూనెగింజలు, చింతపండు, ఉల్లి, అల్లము, కూరగాయలు, తమలపాకులు మోటుపల్లి మచిలీపట్నం రేవుల నుండి దిగుమతి చేసుకొన్న, విదేశ

వస్తువులు ప్రదర్శించబడేవి. బొమ్మలు, నిలువుటద్దములు, సౌందర్య లేపనములు, రత్నాలు పొదిగిన వెండి, బంగారు నగలకు ఎక్కువ గిరాకీ వుండేది.

వల్లభరాయుడు (వినుకొండ వల్లభామాత్యుడు) తన క్రీడాభిరామంలో 'మాచలదేవి' యను వేశ్యను ఆమె గృహ ప్రాంగణమును వర్ణించాడు. మాచలదేవి "సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణా సనామ్నాయవిద్యోపాధ్యాయి, ప్రతాపరుద్ర ధరణోశోపాత్తగోష్ఠీపారీణ' ఈమె ముంగిట -

*"చందనంబున కలయంపి జల్లినారు*
*ముగ్గులిడినారు కాశ్మీరమున ముదమున*
*వ్రాసినారిందు రజమున రంగవల్లి*
*కంజముల దోరణంబులు కట్టినారు"*

ఈమె చిత్రశాల గోడలపై గోపీకృష్ణుల, శివ పార్వతుల, రతీ-మన్మథుల, మేనక-విశ్వామిత్రుల, తారా-చంద్రుల చిత్రములు రచింపబడినవి. నాటి ప్రజల కళాభినివేశమట్టిది.

పదిహేను వందలమంది కళాకారులీ నగరమున నుండిరి. యువదంపతులు రాజోద్యోగులు తమ నిలువెత్తు చిత్రముల వ్రాయించుకొనెడివారు. లెంకలు తమ ఆదర్శనాయకుల చిత్రపటములు లిఖింపించుకొని ఉత్సవ సమయముల ప్రదర్శించేవారు. అమ్మకమునకై అతిసన్నని నాజూకు వస్త్రములు విపణులలో ప్రదర్శింపబడేవి. ఈ బట్టల నాజూకుతనము, అంచుల అల్లికల నైపుణ్యము, నాణ్యతలను మార్కోపోలో ఎంతగానో ప్రశంసించాడు. ఈ వస్త్రములు విదేశములకు ఎగుమతి చేయబడి విదేశీయుల మెప్పు పొందినవి.

తివాచీ నేత నొక ప్రత్యేక కళగా యిచటి పనివారు తీర్చిదిద్దారు. ముస్లింలీకళ నభిమానించి, ఈ కళాకారులను బలవంతంగా ముస్లింలుగా మార్చారు. నేటికీ తివాచీనేతలో ముస్లింలదే అగ్రతాంబూలము. ఆయుధాలు కత్తులతయారీ "నిర్మల్" లో వృద్ధిచెంది, గిరాకీ కలిగి "డమాస్కస్" నగరమునకు ఎగుమతి చేయబడేవి. నిర్మల్ కళలు అలంకరణకు ప్రసిద్ధి. వడ్రంగులు మేదరవారు చేతివృత్తులవారు కలప చెక్కపనులలో నిపుణులు. వందలకొలది భోజన విశ్రాంతి గృహములు రాత్రింబవళ్ళు తెరచివుండేవి.

నగరములో స్థిరపడిన వివిధ వృత్తులవారి జనాభా లెక్కలు వ్రాయబడి వున్నవి. ఏకామ్రనాథుడు ప్రతాపరుద్రుని తరువాత రెండు శతాబ్దాములకు ప్రతాపరుద్ర చరిత్ర వ్రాశాడు. అందు బ్రాహ్మణ కుటుంబములు 1300లు లక్షాధికారులు 420 మంది, కాకతీయులు 2000 మంది, వ్యాపారస్థులు 3,000, యాదవులు, పశువుల కాపరులు 4000, భోజనశాలలు 400గా వ్రాశాడు.

కుమ్మరి, కమ్మరి, చేనేత, కల్లు, గీత, మేదర, దర్జీ మొదలగు చేతివృత్తుల వారెందరో ఉన్నారు. రక్షణకొరకు వేలాది సైనికులు కోట వెలుపల, లోపల నివసించేవారు. ఆహార ధాన్యములు ఆయుధసామాగ్రి మందుగుండు సామాగ్రి సరఫరా చేయుటకు దగ్గరనున్న జిల్లాలలో విపణులు వ్యాపార కేంద్రాలలో భృతికల్పించేవారు.

"గ్రిబెల్" దేవగిరి వర్ణన ఈ విధంగా సాగింది. "రామచంద్ర దేవుని పాలనలో దక్కనెంతో అభివృద్ధి చెందెను. దేవగిరి ప్రధాన వీధులు బంగారు పనివారి కర్మాగారములు, ముత్యాల అంగళ్ళు విలువగు మస్లిన్ బట్టల దుకాణముల వరసలతో నిండియున్నవి. భాగ్యవంతులు విలువగు ఆభరణముల కెగబడుటవలన ఈ కార్మికులకు మంచి గిరాకీ కలదు." బంగారం, విలువయిన ఆభరణాలు నేలమాళిగలలో భద్రపరచబడేవి. మూడేసి అంతస్థులు కలిగి విశాల ద్వారములు, గవాక్షములు అందమగు చిత్రపటములతో విశాలమగు నీ గృహముల ప్రధాన ద్వారములవద్ద ద్వారపాలకులుండేవారు. వంటవారు, గొడుగులు పట్టేవారు, తాంబూలాలందించేవారు ఇతర సేవకులుండేవారు. భాగ్యవంతులు పల్లకీలలో ఊరేగేవారు. గుఱ్ఱపు బగ్గీలు వాడిన జాడలేదు.

దేవగిరి కంటె భాగ్యవంతమగు వరంగల్లు నగర సౌభాగ్యమట్లేయుండవచ్చును.

ఆకర్షణీయమగు వరంగల్ నగరకీర్తి, ఆంధ్రదేశమున పాదుకొనిన ఈ నగరపు సాంఘిక రాజకీయ కుదుళ్ళు తదనంతరపు కాకతీయనాయకులను, కళింగులను దీనినాక్రమింపచేసి ఈ నగర పురావైభవ పునః ప్రతిష్ఠకు వారిని ప్రేరేపించినవి. పురుషోత్తమ గజపతి సైన్యాధిపతిగా వీరభద్ర రఘుదేవ నరేంద్రుడు వరంగల్లును స్వాధీనము చేసుకొనెను. ఈ దండయాత్రలో రాకుమారుడు లచ్చిదేవకుమార మహాపాత్రుడు ప్రధానపాత్ర నిర్వహించెను. ఈ యాత్రలో భాగముగనే "గండికోట"ను కూడా కుమారమహాపాత్రుడు జయించెను.

క్రీ.శ. 1503లో భోగి (బోయ) వంశస్థుడు, నాగమనాయకుని పౌత్రుడు యాదయనాయకుని కుమారుడు అగు "సీతాపతిరాజు" (ఆలియాస్ చిత్తాబుఖాన్) ఈ

నగరము స్వాధీనము చేసుకొనెను. ముస్లింలచే ధ్వంసము చేయబడిన "పాంచాల రాయకృష్ణుని, కాకతీదేవి ఆలయములను మరల ఈతడు ప్రతిష్ఠ చేసినటుల ఈతని క్రీ.శ. **1504** నాటి శాసనము తెల్పుచున్నది. స్వయంభూదేవుని ఆరాధించినట్లును తెలియనగును. ఒరిస్సా గజపతులు, కపిలేశ్వర గజపతి కుమారుడగు "హంవీరు"ని సహాయమున నీనగరము సాధించినట్లు తెలియుచున్నది. క్రీ.శ. **1466** నుండి **1500** వరకు తెలంగాణమంతయు గజపతుల ఆధీనములోనున్నది. ఈ సౌభాగ్యవంతమగు కాలముననే ఏకామ్రనాధుడు తన ప్రతాపరుద్ర చరిత్రయను గ్రంథమును రచించెను.

ఈ చారిత్రాత్మక నగరపు సమ్మోహనశక్తి వలననే కాపయ మరణానంతరము నూట ఏబది సంవత్సరముల పర్యంతం ఆంధ్ర కళింగ నాయకులు ముస్లింలనోడించి సుల్తానులకు పదవీచ్యుతి కలిగించినారు. ఆంధ్రనుండి ముస్లింల పారద్రోలినారు.

ఈనగర ప్రాముఖ్యమును, సామాజిక సైనిక చరిత్రాత్మక ఆకర్షణను రూపుమాపే దురుద్దేశంతోనే ఒకరి తర్వాత ఒకరు ఢిల్లీ సుల్తానులు దండయాత్రలు జరిపి భవనాలను, ప్రాసాదాలను, సైనిక స్థావరాలను పూజా విగ్రహాలను నేలమట్టం చేశారు. ఈ నగరావశేషముల దీనావస్థను "గ్రిబెల్" ఇలా వర్ణించాడు. "వెలుపలి కోట మట్టితో కట్టబడి విశాలముగా నున్నది. ఇది చాలా ఎత్తైె రెండున్నర చదరపుమైళ్ళు నాక్రమించినది. లోపలికోట ఒక చదరపు మైలు ఆవరణచుట్టూ నిర్మించబడినది. నాలుగు అత్యంత సుందరములగు మంటపములు నాలుగు దిక్కుల నిలుపబడియున్నవి. ఇవి బహుశా రాజప్రాసాద ప్రవేశద్వారములు కావచ్చును. దగ్గరలో వున్న పెద్దహాలు భండారము అయి వుండును. ఈ నిర్మాణము చాళుక్యశిల్పమునకు మచ్చుతునక. వివిధాకృతులతో మలచబడిన ఎత్తైన నల్లరాతిస్తంభములు, చలువరాతి స్తంభములవలె కన్పించుచూ శిల్పుల నేర్పరితనమును ప్రతిఫలించుచున్నవి. దేవాలయాంతర్భాగములు నాజూకయిన రాతి తెరలచే ఆచ్ఛాదింపబడి వేరుసాటి లేదనిపించును."

# 8. విప్లవ జ్వాలలు

వరంగల్లు పతనానంతరము మహ్మద్‌బిన్ తుగ్లక్ ప్రభుత్వపు వాతబడిన దక్షిణ భారత ప్రజలు పన్నులబరువుతో నిర్భంధపు వసూళ్ళతో అణచివేయబడ్డారు. వీరు వేటాడబడి వేధింపులకు గురై దుర్భర దారిద్ర్యమనుభవించారు. ఆ పాలనను "జియావుద్దీన్ బర్నీ" అను చరిత్రకారుడు ఇలా వర్ణించాడు.

"సుల్తాను ఐదు నుండి పదిశాతము పన్నులు రాబట్టుట తన హక్కుగా భావించాడు. కొత్త కొత్త ఆవాబులు (సెస్సులు)తో పెరిగిన భూమి శిస్తుతో క్రూరమైన నిర్బంధపు వసూళ్ళతో రైతుల నడ్డి విరిచాడు. సమాజంలో హిందువులు చులకన చేయబడి. చావలేక, బ్రతకలేక, పారిపోక బ్రతికే విధంగా ఆజ్ఞలు జారీ చేయబడినవి."

హిందువుల సామూహిక హత్యలు, మతాంతరీకరణలు సర్వసాధారణం. ముస్లిం రాజోద్యోగులు, సైనికాధికారులకు హిందువులను బానిసలుగా బహూకరించే అనాగరికతకు ముస్లింలు దిగజారారు. యుద్ధ ఖైదీలు కొరత వేయబడి చంపబడ్డారు. అలగ్జాండర్ లీ (సూపరింటెండెంటు పురావస్తుశాఖ) ఈ విధంగా వ్రాశారు. "దేవాలయములు, అర్చకులు, భక్తులు, అవమానింపబడి, చంపబడ్డారు. దైవధనమపహృతమయినది. క్రీ.శ. 1324లో రాజమహేంద్రవరమున మసీదు నిర్మించబడినది. మహమ్మద్ తుగ్లక్‌షా ఇచ్చటి దేవాలయము ప్రవేశించి, బ్రాహ్మణ పూజారులను నరికివేసి, విధ్వంసము చేయబడ్డ యీ దేవాలయపు శిధిలాలపై మసీదు నిర్మించి, ముస్లిం పూజావిధి ప్రవేశపెట్టాడు. గర్భగుడి నేడు కోనేరుగా మిగిలింది. కోనేరు వెనుక నున్న పెద్ద మంటపము, నల్లరాతి స్తంభములు శిధిలములూ, కళాత్మకమగు హిందూ శిల్పమున కనుగుణముగా నున్నవి."

పాలమూరు సమీపమున నున్న బూదపూరు మసీదు కూడ ఒకప్పటి హిందూ దేవాలయమే. ఈ దేవాలయపు గోడలపై కాకతీయుల శాసనములు ఎన్నో వున్నవి. త్రిపురాంతకము, పెనుగొండలలోని గుడులకు కూడా ఇదే దుర్గతి పట్టింది. క్రీ.శ. 1327లో మహ్మదీయ సైన్యములు శ్రీ రంగము చేరిన వెంటనే అర్చకులచ్చటి దేవాలయములోని మూల విరాట్టును అడ్డదోవల ద్వారా పశ్చిమ కోస్తాకు అక్కడ నుండి మైసూరు నందలి 'మేలుకోటకు' అచటి నుండి పవిత్ర తిరుమలపైకి జేర్చారు. క్రీ.శ. 1371 వరకు తిరుమలలో భద్రపరచబడిన ఈ విగ్రహమును రెండవ కంపరాయలు తొండమండలపు చోళుల

జయించిన తర్వాత "గోపన" యను కంపరాయలసేనాని విజయోత్సాహముతో మరల శ్రీరంగము జేర్చాడు. ముసునూరి ప్రోలయ నాయకుడు లేక పోతానీని "విలస శాసనం" ఢిల్లీ సుల్తాను క్రూరపాలనను ఈ క్రింది విధంగా వర్ణించింది.

"ప్రతాపరుద్రుడను భానుడంతర్హితుడు కాగా దేశమున తురష్కాంధ కారము వ్యాపించినది. ప్రతాపరుద్రభూధవుని వలన నిరాకృతమయిన అధర్మము శత్రువులయిన యవనులను చేరియుండవచ్చును. అట్లు కానిచో అది తురుష్కులతోబాటు నిరాటంకముగా విజృంభించుట ఎట్లు పొసగును? దేశము యవనాక్రాంతమయిన పిదప ధనికులు అనేక పాపోపాయములచే ధనము కొరకు పీడింపబడిరి. పారసీకులను చూచీచూచుటతోనే కొందరు ప్రాణములు వదలినారు. ద్విజులు తమ **యజ్ఞకర్మలు** వదలు కొనవలసినవారయిరి. దేవప్రతిమలు సమస్తము భగ్నములయిపోయినవి. చిరకాలముగ మహాపండిత భుక్తములగు అగ్రహారములన్నియు (ముస్లింలచేత) అపహృతములైనవి. పాపులయిన యవనులు వ్యవసాయము చేసిన వారిపంట పర్యాయములను బలత్కారముగ లాగుకొనుటచేత - దరిద్రులు - ధనికులు అనుభేదము లేక రైతు కుటుంబములన్నియు నాశనమయిపోయినవి. ఆ మహా విపత్కాలమున విత్తము భార్య మొదలగు వేనియందును ప్రజలకు స్వాయత్తతా భావము (నాది అను నమ్మిక) పోయినది. కల్లు తాగవలెను. గోమాంసము తినవలెను. బ్రాహ్మణులను చంపవలెను. ఇది యవనాధముల వృత్తి. వారి వ్యాపారము లిట్లుండినపుడు యింక భూమి మీద ప్రాణిలోకము బ్రతుకుటెట్లు? ఈ విధముగా రాక్షసుల వంటి ఈ తురుష్కులవలన పీడింపబడిన త్రిలింగదేశమును రక్షించు వారెవరో తెలియరాక కార్చిచ్చు చుట్టుకొన్న అడవివలె సంతపించి పోయినది."

దురాక్రమణకు, కొల్లగొట్టుటకు, వ్యక్తి, వర్గమత, ఔద్ధత్యములను చాటుకొనుటకు, యుద్ధాలు చేసే సైన్యాలకు, సంస్కృతి, మానవతా విలువలు, ఆత్మ ప్రబోధములు చెవికెక్కవు.

క్రీ.శ. 11 నుండి 15వ శతాబ్దం వరకు హిందువులు తాము విశ్వసించిన యుద్ధనీతికై ఎంతో మూల్యం చెల్లించవలసి వచ్చింది. వారి దేవాలయములు ధ్వంసము చేశారు. గ్రంథాలయములు తగులబెట్టారు. మతాచార్యుల నాలుకలు కోశారు. వారి **ప్రాణాలు తీశారు.** స్త్రీలను అగౌరవపరిచారు. వారి బిడ్డలను కత్తులకెరచేశారు. **గోవులు** వధించబడినవి. ప్రజలు అగౌరవించబడి దోపిడీ చేయబడి మూకుమ్మడిగా **చంపబడ్డారు.**

సామాన్య పౌరులు రాజకీయ ప్రముఖులు ఈ దురాక్రమణలను ప్రతిఘటించి, విప్లవించి, ముస్లింలను పారద్రోలుటకు సంప్రదాయ ధర్మాచరణకు, మాతృభూమి విముక్తికి విద్యానాథ, విద్యారణ్య, అన్నయ్య, భాస్కరుడు మొదలగు హైందవ దేశికులచే ప్రబోధించబడ్డారు. వీరి పిలుపుకు స్పందించి మహోన్నతులగు ఆంధ్ర వీరనాయకులు ప్రోలయ్య కాపయ్యలు ఆంధ్రదేశంలో, హంపిలో, హరిహర రాయలు, బుక్కరాయలు, హోయసలలో వీర భల్లాళుడు, తమ విప్లవ కేతనాలు ఎగురవేశారు.

ఈవిధమయిన పాశవికత, రాక్షసత్వాలు, యూరపులో, ఆసియాలో దురాక్రమణ దారులందరూ ప్రదర్శించినవే. కోస్తా ప్రాంతము చేరిన పోర్చుగీసువారు మత ఆంక్షలను విమర్శనా చట్టములను క్రైస్తవేతరులపై రుద్దారు. ఈ ఆంక్షలతో అభిశంసించబడిన వారందరూ సజీవముగా తగులబెట్టబడినారని ప్రేయర్ యాత్రికుడు వ్రాశాడు. పురాణములు చదువు హిందువులకు జుల్మానాలు ప్రాయశ్చిత్తములు విధింపబడినవి. పోర్చుగీసువారు హిందూ దేవాలయములు. ముస్లింల మసీదులను నాశనముచేశారు. మత స్వాతంత్ర్యము కోల్పోయి. జైళ్ళలో మగ్గి హింసింపబడి చచ్చుట కంటె దేశము విడిచి వెళ్ళుట మేలని తలచి హిందువులు అధిక సంఖ్యలో గోవాను వదలి వెళ్ళారు" అని సువెల్ అను చరిత్రకారుడు వ్రాసాడు. స్వ-పర బేధములు లేని ఈ ఆటవికత్వము ఆయుగపు సామాన్య లక్షణమయినది. మహమ్మద్ బిన్ తుగ్లక్ తనపై మాళవలో తిరుగుబాటు చేసిన తన పినతండ్రి కొడుకును దక్కను వరకు తరిమి పట్టుకొని సజీవముగా చర్మము ఒలిపించాడు.

దేవగిరి యాదవులు కాకతీయుల మధ్య మతవైషమ్యాలు కొత్తగాకపోయినా, దక్షిణ భారతహిందువులపై ముస్లింలు ప్రదర్శించిన క్రూరత్వము కనీవినీ ఎరుగనిది. హద్దులు లేని రక్త పిపాసతో సామాన్య ప్రజపై ముస్లింలు జరిపిన విద్వేషపూరిత పైశాచిక మారణకాండ, హిందువుల నిస్తేజపరిచింది. ప్రజల ప్రార్థనావసరాలగు దేవాలయాలు మందిరాలు ఆరామాలపట్ల, తాత్త్విక వేదాంత చింతనలలో ఎక్కువగా వైమనస్యము లేని బౌద్ధ జైన హైందవ ధోరణులకు భిన్నంగా ముస్లింలు భారతీయుల తాత్త్విక చింతనను అపహాస్యం చేసి, మతపునాదులనే సవాలు చేశారు. వారి మారణహోమము దక్షిణాపథ రాజకీయ వాతావరణమును సమూలంగా మార్చి ప్రజలు జీవితమున కర్తవ్యమగు మార్పునకు కారణమైంది. భారతీయుల తాత్త్విక చింతనకు విరుద్ధమగు ఈ ముస్లింల దాడులు, దక్షిణాపథ నాయకులను సంఘటిత పరచినవి.

ఓడినవారిపట్ల హిందూ వీరుల ప్రవర్తన ఎంత ఉదాత్తంగా వుండేదో 11వ శతాబ్దంలో నాగులేటి ఒడ్డున జరిగిన పల్నాటి యుద్ధగాధలో శ్రీనాథ మహాకవి వర్ణించాడు.

"నలగామరాజ సోదరుడు యువరాజునగు నరసింగరాజును బ్రహ్మనాయకుని కుమారుడు బాలచంద్రుడు యుద్ధమున వధించి అతని శిరస్సును సభలోనున్న బ్రహ్మనాయనికి చూపుటకై తేగా, బ్రహ్మనాయుడు సేనాపతులు లేచి నిలువబడి అవనత శిరస్కులై అంజలి ఘటించి నివాళులర్పించారు. అది యొక తెగిన తలగాను అతడు తమ శత్రువుగాను భావించలేదు. తమ విజయమునకు గంతులు వేయలేదు. అతని అంత్యక్రియలలో పాల్గొనుటకై యుద్ధము చాలించారు."

ఈ యుద్ధ మర్యాదలకు విరుద్ధంగా కక్ష కార్పణ్యాలతో మహావీరుడగు మూడవ భల్లాళుని, యువరాజగు వినాయక దేవుని ముస్లింలు వధించిన తీరు, సర్వప్రజానీకమున విప్లవాగ్నిని రగిల్చింది. కాకతీయ నాయకులను వారి దేశికులను జాతీయ విప్లవ నాయకులుగా చరిత్రలో పుటలలో నిలుచునట్లు చేసింది.

ఒకరి తర్వాత నొకరు విదేశీ ముస్లింలు ఢిల్లీని ఆక్రమించుకొని తమ అధికారమును భారతదేశములో సుస్థిరం కావించుకొన్నారు. కాకతీయులు దేవగిరి యాదవులు ఒకరితో ఒకరు సఖ్యత లేక బలహీనపడ్డారు. గన్నమనాయకుని విద్రోహంతో ప్రతాపరుద్రుని కాకతీయ సామ్రాజ్యము పతనమయింది. గన్నమనాయకుడు మాలిక్ మక్బూల్ అనే పేరుతో వరంగల్లుకు ముస్లింల రాజప్రతినిధి అయ్యాడు. ఈ పరిణామాల తరువాత మాత్రమే కాకతీయ నాయకులు, వారి మత గురువులు తమ అనైక్య మత వైషమ్యములోని బలహీనతలను గుర్తించారు. తమ కుల మత వర్గ వర్ణ వివక్షతలు ముస్లింల ఐక్యం ముందు ఎంతో అల్పంగా వారికి కనుపించినవి.

భవిష్యత్తుపై సత్వర నిర్ణయాలు తీసుకొనవలసిన అగత్యమేర్పడింది. కొందరు ముస్లింలకు లొంగిపోయి వారితో సఖ్యత పాటించారు. జగన్నాథ పండితుడు ముస్లింగా మారి ఢిల్లీ కొలువులో మంత్రిగా బతుకీడ్చాడు. ఢిల్లీలో బందీలుగాఉన్న అధిక సంఖ్యాకులగు నాయకులు సుల్తానుకు బుద్ధి చెప్పే అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. వీరందరూ మండలాధిపతులుగా సుల్తానుకు అంతరంగికులవలె నటిస్తూ తమ తమ రాజకీయ సైనిక పదవులలో నిలదొక్కుకున్నారు. ఇటువంటివారు కంపిలి విద్యారణ్యస్వామి. కమ్మనాటి అన్నయమంత్రి, ద్వార సముద్రపు వీరభల్లాళుడు, ముసునూరి ప్రోలయ కాపయల పిలుపువిని ముస్లింలను విడిచి తమ బానిసత్వపు సంకెళ్ళు తెంచుకొన్నారు.

కొద్దిమంది సుల్తానుకు విశ్వాస పాత్రులుగానే వున్నారు. వీరిలో కొందరు ఢిల్లీ కొలువులో, మరి కొందరు దక్షిణ భారతదేశంలో సుబేదారులుగా నియమించబడ్డారు. పరధర్మాసక్తులైన ఈ ద్రోహులు దక్షిణ భారతదేశపు కుల వర్గ కుటుంబ సమస్యల

వైషమ్యముల లోతుపాతులు తెలిసినవారైనందున ముస్లింల పాలనకన్నా వీరిపాలన మిక్కిలి దుర్భరమయినది. వరాహలాంఛనము నీడ పోరాడు దేశభక్తులలో కాకతీయ కర్ణాటక నాయకుల అనుచరులలో వీరు అసంతృప్తిని పెంచి విప్లవాన్ని బలహీనపరచే యత్నాల్లో నిమగ్నమైనారు.

నాయంకరములు పదవులు పరధర్మ స్వీకరణకన్నా అరణ్యములలో అజ్ఞాతవాసమే మేలని దేశభక్తి ఆత్మ గౌరవములు ప్రధానమని నాయకులు భావించారు. ధనము అధికారము ఢిల్లీ కొలువు నిరాకరించారు. వీరి పాలిత ప్రాంతములు లాగుకొనబడినవి. వీరు కష్ట నష్టములకు ఓర్చి ధైర్యము వదలక కొండ కోనలలో నివాసముండి స్వాతంత్ర్యసాధనకు మార్గాలు అన్వేషింపసాగారు. ఎందరో నాయకులు రాజకీయ తంత్రములకు దూరంగా వున్నారు. మరెందరో బందీలయ్యారు. అజ్ఞాతంగా కొండలు కోనలు పట్టిన నాయకులను యుద్ధోన్ముఖులను చేయటం సులువుకాదు. యుద్ధకాంక్ష, స్వార్థములతో కరుడు గట్టిన వీరు విభేదాలు మరచి స్వార్థము విడచి ప్రోలయ నాయకత్వం అంగీకరించుటంత సులభంగా జరుగలేదు.

కాకతీయ ప్రభుత్వంనుండి బయల్పడి మరల వేరొక నాయకత్వ మంగీకరించుటకు వీరికెంతో ఓర్పు కావలసివచ్చినది. అనివార్యమగు తమ బాధ్యతలు గుర్తించుటచే ఇతర నాయకులతో చేతులు కలిపి ప్రోలయ నాయకత్వ మంగీకరించారు. తమ మత రాజకీయ సిద్ధాంతాలను, ఆశయాలను పునరాలోచించటానికి వీరికొక దశాబ్దకాలం పట్టింది.

పండితులు, ఋషులు, కవులు, దేశికులు, మాన్యులునగు అంబదేవ, త్రిపురారిదేవ, కొలను, కోట వంశస్థులు, ముమ్మడిబేతన ఏరువ భక్తిరాజు అద్దంకి ప్రోలయవేమారెడ్ల ప్రభావము, వీరికి స్ఫూర్తిదాయకమయినది. వ్యధాపూరితమగు ఈ ఆత్మశోధనలో జాతి వున్నప్పుడు యువశక్తి ముఖ్యంగా లెంకలు ముందడుగు వేశారు.

ఆ దశాబ్దపు పూర్వార్థంలో ప్రతిఘటనోద్యమ నిర్మాణంలో నాయకులెందరో మరణించారు. నాయకత్వ లోపమేర్పడింది. తమ బలహీనతలను శత్రువుల బలాన్ని నాయకులు తెలుసుకోగల్గారు. వృద్ధనాయకతరం మంతరించింది. యువ నాయకులు తమతమ కుటుంబాల తెగల కలహాల కతీతంగా సంఘటిత శక్తిగా రూపొందారు. ప్రతాపరుద్రుని సోదరుడగు అమ్మయదేవుని స్థానంలో యువకుడు, ధైర్యశాలి, యుద్ధ నైపుణ్యం కలవాడు, శక్తి యుక్తులతో ఢిల్లీ సైన్యములతో యుద్ధములలో రాటుదేలినవాడు అయిన "ముసునూరి ప్రోలయ" నాయకత్వమును అందరూ ఆహ్వానించారు. ప్రోలయ నాయకత్వమున సాగిన ఈ ఐక్య యత్నము రాజకీయ సాంఘిక పోరాటము భారతదేశ చరిత్రలో ప్రప్రథమ జాతీయ విప్లవమయింది.

# 9. ప్రోలయ - కాపయ

(భారత ధర్మరక్షకులు కిసాన్ వీరులు)

ప్రజల సాంఘిక జీవితం గుడుల పురోహితుల మతాచార్యుల చుట్టూ పరిభ్రమిస్తున్న కాలమది. జైనము క్షీణదశలో వుంది. వీరవైష్ణవం, బసవని వీరశైవం ఆదరణ పొందుతున్న రోజులు. ఈ సరికొత్త హైందవ సమాజంలోనికి దళితులాకర్షింపబడ్డారు. అయిదు దశాబ్దాలుగా సభలలో దేవాలయాల్లో అగ్రహారాల్లో పారాయణ చేయబడుతున్న తెలుగు భారతం, హిందూ రాజధర్మమును ప్రజలకు అవగతం చేసింది.

'దేవాలయాల్లోని ప్రజల సొమ్ము వెండి, బంగారము, ఆభరణాల దోపిడీలను చూచి ప్రజలు చేష్టలుడిగారు. ఉద్రిక్త ప్రజానీకం సాంప్రదాయక అధికార వారసత్వం, యుద్ధ నైపుణ్యం, పోరాట చరిత్ర, ఉత్సాహ ఆవేశాలు కల నాయకునికై ఎదురుచూస్తున్నారు.

చాళుక్యుల చోళుల కాకతీయుల గ్రామ పంచాయితీ వ్యవస్థ ఫ్యూడలిజం నుండి గ్రామీణ ప్రజలకు రక్షణనిచ్చింది. గ్రామ పంచాయితీ, ఫ్యూడల్ ప్రభువుల అధార్మిక సైనిక చర్యలకు అడ్డుగోడగా నిలిచింది. భూమిశిస్తు నికరాదాయంలో 1/6 వంతు మాత్రమే. దేవాదాయాలు, ధర్మాదాయాలు, ప్రజాఖజానాలు ఇతరులు ముట్టరాదు. బ్రాహ్మణుల హక్కులు, చేతి వృత్తుల వారి స్వతంత్ర జీవనము భంగపరచరాదు. ఇది భారత ధర్మానుగుణమైన పరిపాలనా వ్యవస్థ. అహంకారంతో ముస్లింలీ సంప్రదాయాలను అగౌరవించారు. దీనికి నిరసనగా పంచాయితీల పెద్దలు, ధర్మకర్తలు, పురోహిత వర్గాల నాయకత్వంలో తిరుగుబాటు చేశారు. తమ సంప్రదాయ గౌరవ మర్యాదలపై అమానుషంగా ముస్లింలు చేసిన మత విద్రోహ చర్యలకు జాతి భగ్గుమన్నది.

ఓదార్పులేని అణచరాని తన జాతి గుండెకోతను "ముసునూరి ప్రోలయ నాయకుడు" తన విలస శాసనంలో ఎంతో భావావేశంతో వ్రాయించాడు.

అల్లాయుద్దీన్ ముస్లిం మతశాసనాలను తృణీకరించి పాలకుల పాలితుల సత్సంబంధాలను కాలరాచాడు. అల్లాయుద్దీన్, అతని సైన్యాధిపతి మాలికాఫర్ హిందువులనూ, పంచాయితీ వ్యవస్థల స్వతంత్రతను, తరతరాల సంప్రదాయాలను ఏ విధంగా అవమానించిందీ ఊహించవచ్చు. మహమ్మద్ బీన్ తుగ్లక్ వీరికేమాత్రం తీసిపోడు. అతి కర్కశంగా ప్రజలను పీడించి వారిని దరిద్రులను చేశాడు. దోపిడీలు చేయుటం కొల్లగొట్టడం అతని సర్దారుల నిత్యకృత్యమయింది. రక్షణ కల్పించటానికి

పంచాయితీలను అధికారులు గొంతెమ్మ కోర్కెలు కోరేవారు. వీరు సామాన్య జనానికి రాక్షసులవలె కనిపించేవారు.

ఈ భయంకర పైశాచిక పాలన నుండి తమ్ము రక్షించు వారెవరో తెలియక భగవంతుని వేరొక అవతారమెత్తవలసినదిగా ప్రజలు ప్రార్థించి వుంటారు. "ఆ ప్రార్థనా ఫలితమే ప్రోలయ నాయకత్వం."

ఈ చరిత్రాత్మక విప్లవ నాయకుడు ప్రతాపరుద్రుని కుమారుడని కొందరు కాకతీయ యుగ నాయకాగ్రణిగా కొందరు భావించారు. ప్రోలయకు కాకతీయ రాజవంశంతో బంధుత్వము నిస్సందేహంగా వుండి వుంటుంది. ప్రతాపరుద్ర చక్రవర్తి కుటుంబముతో రక్తసంబంధం, వివాహ బాంధవ్యం పరిపాలనాధికారం గల ఆంతరంగిక రాజకుటుంబమునకు చెందినవాడు.

దుర్జయ వంశస్థుడగు "ముసునూరి ప్రోలయ"ను అద్దంకి ప్రోలారెడ్డిగా పొరపడరాదు.

ప్రోలయ ప్రజల పిలుపుకు స్పందించి, ఢిల్లీ సైతానుల కోరల నుండి దక్షిణాపథ విముక్తికై అతిమానుషమగు కార్యానికి పూనుకొన్నాడు. ఆంధ్ర నాయకులు వారి అనుచరులు సానుభూతి సహకారాలందించారు.

ప్రోలయ ధైర్యసాహసాలు, చొరవ, నిర్మాణ దక్షత యుద్ధ కుశలత కలవాడు. ముస్లిం దురాక్రమణదారులతో జరిగిన యుద్ధములలో ముందుండి పోరాడి నాయకుల మెప్పు పొందినవాడు. పోరాట పటిమకు, సాహస కృత్యాలకు ఉదాత్తసేవలకు ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రోలయను పలుమార్లు సత్కరించాడు. నాయకులను కూడగట్టటంలో, నాయకసమాఖ్య నిర్మాణంలో, ప్రోలయ ప్రదర్శించిన విజ్ఞత, రాజనీతిని గమనించిన అప్పటికతనికి నలువది సంవత్సరముల వయసు వుండవచ్చును. అతని పినతండ్రి కుమారుడు కాపయ ముప్పై సంవత్సరముల వయస్సువాడై ఉండును. రెండు దశాబ్దములు ప్రజలను నాయకులను నాయక సమాఖ్య సైన్యాలను ఏకతాటిపైన నడిపి ప్రోలయ వీరితో చేసికొనిన ఒప్పందాలను సఫలీకృతం చేశాడు.

ప్రోలయ జాతీయవాది. సామ్రాజ్యకాంక్షగల ఫ్యూడల్ ప్రభువు కాడు. మతమౌఢ్యము లేని మతానురక్తుడు. వివిధ మతస్థుల ఆదరణ సంపాదించగలిగాడు. ఉపనిషత్తులు వేదములు ప్రామాణికమైన వీరశైవ వీరవైష్ణవ భక్తకోటి అతనిపై విశ్వాసముంచి శాఖోపశాఖలగు హిందూ మతోద్ధరణకు సహకరించింది.

రెండు దశాబ్దాలు సాగిన కాకతీయ సామ్రాజ్యరక్షణకై జరిగిన యుద్ధాలలో తన ఉత్సాహ వీరత్వములకు వ్యూహ నిర్మాణ చాతుర్యానికి గుర్తింపు పొందాడు. వృద్ధనాయకుల ఈర్ష్యా ద్వేషము లితనిని అంటలేదు. కాకతీయ సామ్రాజ్యలక్ష్మిని దురదృష్టము వెంటాడినపుడు, కొందరు నాయకుల విచ్ఛిన్నకర రాజకీయములకు, నమ్మక ద్రోహమునకు, ప్రతాపరుద్ర చక్రవర్తి బలిఅయినపుడు, నాయకుల వేరు వేరు కుంపట్లతో దక్షిణావని మండుతున్నప్పుడు, బారతదేశపు సుస్థిరతా పునాదులే కదలినపుడు, సాటిలేని దేశభక్తి సాహసకృత్యములతో విజయాలు సాధించి ప్రోలయ అతని మిత్రులు ప్రజల ఆశీస్సులు పొందారు. గన్నమ నాయకుని విద్రోహము తెలిసిన ఆంధ్ర ప్రజలు తమ నాయకుని వంశ గౌరవములు, మత విశ్వాసములు వాని ధర్మావగాహనము పరీక్షించనిదే నమ్మి తమ భవిష్యత్తును ఎవరో ఒకరి చేతులలో పెట్టుటకు సిద్ధంగా లేరు. ప్రోలయ ప్రజల నమ్మకం సంపాదించాడు. ప్రజలాశించిన సుగుణాలు ప్రోలయలో మూర్తీభవించాయి.

ప్రజల మొరలాలించి దేవత లిచ్చిన వరము ప్రోలయ, ప్రోలయ తక్షణమే వలుకుబడి ప్రాబల్యం కల నాయకులను మతాచార్యులను కూడగట్టే ప్రయత్నాలారంభించాడు. గోదావరీ తీరపు కోటలను సాధించి వరులకు దుర్భేద్యమొనరించాడు. ప్రతాపరుద్రుని సోదరుడగు అమ్మయదేవుడు వయసు పైబడినవాడు. పంపాతీరము (బస్తరు) నెలవు చేసుకొన్నాడు. ప్రోలయకు అండగా నిలిచాడు. పరిస్థితులు అనువుగా లేనపుడు ఉద్యమము బస్తరు నుండి నడుపుటకు అవకాశముంది. కొలను వారి సహాయము అందుకొన్నాడు. కొలనువారు గణపతి దేవునకు, రుద్రమదేవికి విధేయులు. మీదు మిక్కిలి రాజబంధువులు. కొలను రుద్రదేవుని మహామంత్రి 'అన్నయ' మంత్రాంగ స్ఫూర్తి ఇందుకుపకరించింది. జాతి మత గౌరవ పునఃప్రతిష్ఠల కంకితమయిన ప్రోలయకు కోరుకొండ రాజమండ్రి ప్రభువులండగా నిలచారు. గోదావరీ తీరపు కోటలను దుర్భేద్య మొనరించిన ప్రోలయ వారికి గర్వకారణమయినాడు. ప్రోలయకు వీరితో బంధుత్వముంది. కాపయ, అద్దంకి కోమటి వేమారెడ్లు, అద్దంకిలో సాధించిన విజయాలతో గోదావరీ తీరమిరువైపులా, కొలను వరకు ప్రోలయకు తిరుగులేని నాయకత్వం లభించింది.

ఢిల్లీ బలాలు తెలంగాణాలో తమ ఆధిపత్యం నిలదొక్కుకునే ప్రయత్నాలలో వుండగా ప్రోలయ తీర ప్రాంతాన్ని తన వశం చేసుకొన్నాడు.

రేచర్ల సింగమనాయకుడు, అతని వంశస్థులు మొదట ప్రతాపరుద్రుని కాలము నుండి కాకతీయులకు విధేయులు. వారు దేవగిరి యాదవులతో కూడా సన్నిహితులుగా వుండేవారు. అందువలన బాహాటంగా వారు ప్రోలయకు సహకరింపలేకపోయారు. ప్రోలయ కాపయల నాయకత్వం వారికి మింగుడు పడలేదు. దేశభక్తి ప్రసరిత వాతావరణం ప్రోలయ కాపయలకు తోడ్పడినది. రేచర్ల నాయకులు ప్రతాపరుద్రుని పేరిట కాకతీయుల సుపరిపాలన పేర ప్రజల మద్దతుకు పిలుపిచ్చారు.

స్వాతంత్ర్య పిపాసులగు నాయకులు ముస్లిం సామ్రాజ్యవాదాన్నెదుర్కొనుటకు భారతీయ ధర్మము, మతస్వాతంత్ర్యము, ప్రార్థనా స్వాతంత్ర్యము, దేవాలయముల పవిత్రత, సంస్కృతి ప్రచారము, రైతుల గ్రామీణ ప్రజల, వ్యాపారుల పరిరక్షణ తమ విధానాలుగా ప్రకటించారు. ఈ విధానాలు వర్ణాశ్రమ ధర్మానురక్తుల, శైవుల వైష్ణవుల, జైనుల నాకర్షించినవి.

ఆధ్యాత్మికావేశమే కాక రాజకీయ పరిజ్ఞానం కల పురోహిత వర్గాలు ప్రోలయ సాహసాలను హృదయపూర్వకంగా ఆశీర్వదించినవి. పురోహితులు పల్లెలు, పట్టణాలు, అరణ్యావాసాలు నదీతీరాలు తమ నివాసాలుగాజేసుకొని, తెగించి నిరంతర జాగరూకులై, భారతీయ ధర్మ విజయముపై విశ్వాసముంచి ధర్మప్రచారం చేస్తూ విప్లవంలో ప్రధానపాత్ర పోషించారు.

కంపిలి కర్ణాటక నాయకులు, త్రిపురారి మహా దేవుడు, గంగయ సాహిణులు విద్యారణ్యస్వామి వలన ప్రభావితులయినారు. కొప్పుల ప్రోలయకు మంచికొండ గణపతికి అద్దంకి వేమారెడ్లకు అన్నయమంత్రి స్ఫూర్తిదాత. వీరందరూ పోచినాయని కుమారుడు దుర్జయవంశజుడూ కాకతీయ పోతినాయకుని మనుమడు అగు ముసునూరి ప్రోలయ నాయకత్వమంగీకరించారు. నాటి ఆంధ్ర, కర్ణాటక రాజకుటుంబములకు ప్రోలయ బంధువు.

తిక్కన ఆంధ్ర భారతమప్పటికే కవిపండిత సమాదరణకు పాత్రమయింది. ముస్లిందాడులు మిగిల్చిన భయంకర అనుభవాలకు మహాభారత పఠన పాఠన కాలక్షేపాలు ప్రజలకు ఓదార్పు కలిగించాయి. ఆవేశం రగిల్చినవి. తమ తల్లులకు భార్యలకు చెల్లెండ్రకు బిడ్డలకు ముస్లింలొనర్చిన అపకృతులు ముందు ద్రౌపది భంగపాటు దిగదుడుపు. ఈ పవిత్ర గ్రంథ పారాయణం ముస్లింలపై ఆంధ్రజాతికిగల ఆగ్రహాన్ని ఇనుమడింప చేసింది.

ప్రోలయ బ్రాహ్మణులను, వంది మాగధ వైతాళిక వర్గాలను తన ప్రచారానికి నేర్పుగా వాడుకొన్నాడు. తమ ప్రచారశక్తి ద్వారా వీరు ప్రజల నైతికబలం పెంచారు. వారి పురాణ గ్రంథ పరిచయం ఉద్యమ ప్రచారానికి ఎంతో ఉపయోగపడింది. ముస్లింలకు అంటరానిదగు వరాహకేతనానికి ప్రత్యేకత కలిగించాడు. స్వర్గానికి వీరమరణమే రాచబాటని, దుర్యోధనాదులు స్వర్గాన్ని పాండవులకన్నా ముందే పొందిన కథనాన్ని ప్రజలకు గుర్తుచేశాడు. ముస్లింలకు బందీలయి చిక్కి అవమానింపబడి చంపబడుట కంటే వారి చేతికి చిక్కక స్త్రీలు ఆత్మాహుతి చేసుకొనుట మేలని ప్రబోధించారు.

భారత యుద్ధంలో ద్రౌపది ప్రతీకారజ్వాల చల్లారినట్లే, భారత స్త్రీల ఆశయాలు ఈ పోరాటంతో నెరవేరతాయని నమ్మిక కల్గించారు.

బ్రాహ్మణ బోధ, శక్తి యుక్తులతో ప్రజలు ధర్మరక్షణకు నడుం బిగించారు.

కాపయకు తీరప్రాంత నాయకుల, తెలంగాణా, రాయలసీమ, తమిళనాడు, కర్ణాటక, హోయసల నాయకుల సహకారం సంపాదించే కష్టసాధ్యమయిన పనిని ప్రోలయ కేటాయించాడు. కార్యక్రమ సమన్వయం, ఏక నాయకత్వ సాధనలు కత్తిపై సామువంటివి. ఈ పనిలో కాపయ సఫలుడయినాడు.

వెలనాటి చోళుల వారసులయిన పాకనాడు, కొప్పుల, కనిగిరి, అమరావతి, కొరివిసీమల కమ్మనాయకులకు ధాన్యకటకం రాజకుటుంబములతో బాంధవ్యములున్నవి. ప్రతాపరుద్రుని మరణం తర్వాత వీరంతా స్వతంత్రులయ్యారు. వీరందరిని కాపయ కలిశాడు. వీరు పర్స్పర సహకారావశ్యకాన్ని గుర్తించారు. వీరితోపాటు కొప్పుల ప్రోలయ రుద్రదేవుడు వెలనాటి గణపతి నాయకుడు, అద్దంకి ప్రోలయ వేమారెడ్డి కాపయతో చేతులు కలిపారు.

ప్రతాపరుద్రుని కొరకై వల్లూరు, నెల్లూరు, కంచి తిరుగుబాటు దారులపై కాపయ సాధించిన విజయాలందరకూ తెలుసు. వీరిలో చాలా మంది కాపయ సహచరులు. కాపయ ప్రదర్శించిన శౌర్యం కళ్ళారా చూసినవారే. మహాభారత ప్రోక్తమయిన అతని ధర్మరక్షణా దీక్ష నభినందించినవారే. ప్రోలయ కాపయల పిలుపుతో స్వతంత్ర సాధనకు వీరందరూ ముందుకురికారు.

ప్రోలయను ధర్మరాజుగను అతని అడుగుజాడలలో నడచుకాపయను అర్జునునిగను కీర్తించారు.

ఈ పవిత్ర ప్రజాస్వామ్య ఉద్యమ వాతావరణంలో, బ్రాహ్మణాశీర్వాదబలంతో కాపయ అతని సహచరులు మిత్రులను పోరాట సహచరులను కూడ గట్టుకొనుటకు చురుకుగా ముందుకు సాగారు.

నాటి గ్రామములకు త్రోవ తెన్నులు లేవు. అరణ్యాలు క్రూర మృగాలతో నిండి వుండేవి. పత్రికల ద్వారా వార్తలందించు సౌకర్యమానాడు లేదు. ఎక్కువ మంది విద్యాగంధమబ్బనివారు. మరి ప్రచారము సాగేదెలా? ప్రోలయ కాపయవారి సహచరులు కలసి కొన్నిసార్లు విడివిడిగా మరికొన్ని సార్లు అరణ్యములలో కొండలలో లోయలలో నదీతీరాల్లో గుఱ్ఱాలపై జాగరూకులై ప్రయాణించేవారు.

గ్రామాలు వీరికి హృదయపూర్వక స్వాగతమిచ్చినవి. పంచాయితీ పెద్దలు వీరికి రాజోచిత మర్యాదలు చేసి వంది మాగధ కైవారములు బ్రాహ్మణ ఆశీస్సులు ఇప్పించి విందు వినోదములను ఏర్పాటుచేసి భారత కథా శ్రవణము పురాణ పఠనము పల్నాటి కథాగానములకు పరిసర గ్రామ ప్రజలను ఆహ్వానించి వారిని ఉత్తేజపరచియుందురు. గ్రామీణులు ప్రోలయ కాపయల ధ్యేయాన్ని బాగుగా ప్రచారం చేశారు.

విప్లవ నాయకుల కవసరమగు ఆహార పదార్థాలను ఎద్దులబండ్లపై, గుఱ్ఱాలపై, గాడిదలపై రవాణా చేసేవారు. స్థానిక ఉద్యమకారుడు తదుపరి మజిలీవరకు తోడుండేవారు. సమాచార సేకరణచేసి రహస్యంగా భద్రంగా శీఘ్రంగా నాయకులకు అందజేసేవారు. దురదృష్టవశాత్తు శత్రువులకు దొరికిన గుట్టు బయల్పడనీయక సంకేతములు వెల్లడిసేయక ప్రాణత్యాగాలు చేసేవారు. ప్రయాస భరితమగు ఈ విధి నిర్వహణలో ఎందరో ప్రాణాలు పోగొట్టుకున్నారు. చాలామంది లెంకలుగా బాధ్యతలు స్వీకరించారు.

ముస్లింల ముస్లిం తాబేదార్ల పాలనలోనున్న కోటలకు దూరంగా సంచరిస్తూ నమ్మకం గలచోట్ల మాత్రమే నాయకులు మజిలీలు చేసేవారు. అక్కడి ఉద్యమకారులతో అరణ్యాలలో, దేవాలయాలలో, ఆశ్రమములలో నుండి సంబంధము లేర్పరచుకొని సమాచారము గ్రహించేవారు. శత్రువుల కోటలలోని ఉద్యోగులు కొందరు నాయకులకు రహస్యంగా సమాచారం, ఆహారసామాగ్రి అందిస్తూ కదలికలను గోప్యంగా వుంచి ప్రయాణపు ఏర్పాట్లు కూడా చేసేవారు. నూతన కార్యకర్తల సమీకరణ చేసేవారు.

కాపయ అశ్వికులను ఆహారాన్ని సమీకరించుకొంటూ, ఒకచోటు నుండి వేరొక చోటికి అశ్వారూఢుడై ప్రయాణిస్తూ స్థానిక ప్రభువులతో సమాలోచనలు చేస్తూ సహకారాన్ని

అర్థిస్తూ వారి ద్వారా మరికొందరను ఉద్యమంలో కాకర్షిస్తూ అదనుచూసి వ్యతిరేకులపై మెరుపుదాడులు చేస్తూ బహిరంగంగా వారిని. లొంగతీసుకొని, ప్రాంతములవారీగా శత్రువుల ఆయుధాగారాలను స్వాధీనం చేసుకొని, శత్రువుల పారద్రోలి సీమలను విడిపించేవాడు. కాపయ అతని సహచరులు నూతన కార్యకర్తలను ఉద్యమ వ్యాప్తికై పలుచోట్లకు పంపేవారు. కాపయ ఒక సీమ నుండి వేరొకసీమకు ప్రయాణిస్తూ, పరాధీనములో నున్న కోటలను ముఖాముఖిన గెరిల్లా యుద్ధాల ద్వారా దాడిచేసి స్వాధీనపరచుకొని శత్రువుల చికాకుపరచేవాడు.

కాపయ తన గెరిల్లా పోరాటాలతో వీరహనుమాన్‌వలె ప్రజల గుండెలు మండిస్తూ గ్రామాలను జాగృతం చేస్తూ శత్రువుల ఆధీనంలోనున్న భారత సైన్యానికి గుండె ధైర్యం మనోనిబ్బరం కలిగిస్తూ ముస్లింల, వారి తొత్తుల గుండెలలో భయోత్పాతాలు పుట్టించాడు.

ఈ పనులన్నీ గోప్యంగా జరిగేవని చెప్పలేము. ఉద్యమ సమాచారం వరంగల్లులోని రాజప్రతినిధికి ఇతర ఉద్యోగులకు అందే వుంటుంది. శత్రువులు వారి వేగులు కాపయను అడుగడుగునా వెంటాడి, అతని మట్టుబెట్టుటకు అతని వార్తాహరులను చేజిక్కించుకొనుటకు ప్రయత్నాలెన్నో చేసివుంటారు. కాపయ చిక్కాడు, బందీ అయ్యాడు, హింసింపబడ్డాడు. మరణించాడు వంటి అసత్య ప్రచారాలెన్నో చేసివుంటారు. కాపయ శత్రువులను కనురెప్పపాటులో ఏమార్చిన ఘట్టాలెన్నో ఉంటాయి. ఎందరు సహచరులు బందీలైనారో, మరణించారో తెలియదు. వెంట్రుకవాసిలో తప్పించుకొన్న సంఘటనలు కోకొల్లలు.

రాజకీయ నైతిక బలాలు పుంజుకొని కాపయ అతని సహచరులు నెలలు. సంవత్సరాల పర్యంతం దేశవిముక్తి కొరకు జాతిని జాగృతం చేసారు. ఈ సుదీర్ఘ ప్రయాణాలలో నడుస్తూ, గుఱ్ఱాలపై ప్రయాణించుతూ, కాలువలు దాటుతూ, నదుల నీదుతూ అక్కడక్కడ విశ్రాంతి తీసుకుంటూ నాయకులతో సత్సంబంధాలకై నిరంతరం కృషి సాగించాడు. ఈ కృషివలననే డెబ్బయి నలుగురు నాయకులు వారి లెంకలు సైన్యములు ఒక్కటయి బలమయిన శక్తిగా రూపొందారు.

గత పోరాటానుభవముల వలన ప్రోలయ కాపయలకు ఢిల్లీ సైన్యాల సాహసము, మొండితనము, వారి యుద్ధ పద్ధతులు, రాజకీయపు టెత్తులపై పూర్తి అవగాహన వుంది. యుద్ధ సమయాల్లో, నిర్యుద్ధకాలంలో నాయకులతో ఈ విషయాలు చర్చించేవారు. కాకతీయ సైన్య పరాజయ కారణాలు, కోటల పతనము, పరాధీనత, వరంగల్ నగర

ప్రాకార బలహీనతలు, ప్రలోభాలు, నాయకుల ద్రోహచింత మొదలగునవి వారి చర్చనీయాంశాలు.

తమ సైన్యాల నైతిక బలంకొరకు ప్రోలయ కాపయలు పురోహితుల, కవుల, ఆచార్యుల ఆశీస్సులు, అనుగ్రహం ధర్మాచరణము మత విశ్వాసముల పేరిట అర్థించారు.

జాతి జీవనాడులను క్రుంగదీసే, సుదీర్ఘమూ ప్రమాదభరితమూ వ్యథామయమునగు ఆరువందల సంవత్సరాలనాటి పరిస్థితులను సింహావలోకనం చేస్తే యువకుడగు కాపయ వివేకశీలి యగు ప్రోలయల వారి లెంకల సహచరుల మతాచార్యుల ఆత్యత్యాగం నాయక సమాఖ్య త్యాగనిరతిని ముందుచూపును ప్రశంసించకుండా వుండలేము.

ప్రోలయ కాపయల సమకాలీన భౌతిక రూపవర్ణన మనకు అలభ్యం, వరంగల్లు ఆలయ ప్రాంగణాలలో చెల్లాచెదురుగా పడివున్న నల్లరాతి విగ్రహ శకలాలు, మొండాలు, తలలు, చేతులు, గుఱ్ఱపు రౌతులను చూచి నాటి కాకతీయ నాయకుల ఆకార విశేషాలు మన మూహించుకోవచ్చు. అప్పటి సంస్కృతి రాజనీతిజ్ఞత సాంఘికాదర్శాలు నాటి వీరుల నేవిధంగా ఉత్తేజపరచినవో, కాకతీయ యుగపు సాహిత్యావలోకన చేస్తే మనకవగతమవుతుంది. హనుమకొండ, రామప్ప వరంగల్ దేవాలయాలలో చెక్కిన నల్లరాతి విగ్రహాలు, యుద్ధవీరులు అశ్వికులగు స్త్రీ పురుషుల ఆకృతులను మనోనేత్రంతో చూచి ఆ వీరుల సమున్నతాకారాలు ఆజానుబాహువులు ఇనుపగుండెలు దృఢచిత్తాలు మనం దర్శించవచ్చు.

"ఊహాపోహలు కల్పన పాక్షిక చారిత్రకకతలను మేళవించి రచించిన పదచిత్రాలతో ఆ వీరుల ఆకృతులను నామనస్సున నిలుపుకొంటున్నాను. చారిత్రక సత్యాల ఇటుకలు, సామాజిక మౌలిక ప్రేరణల సున్నముతో, రాజకీయపు టెత్తుల ఆలోచనల పునాదులపై నిర్మించిన, ఈ పదచిత్రభరిత దేవాలయాన్ని, మహోదాత్తమూ, మహదాశయ పూరితమునగు నాటి సుదీర్ఘ విప్లవోద్యమానికి సమర్పణ చేస్తున్నాను."

ప్రోలయ ఎత్తైనవాడు. దృఢశరీరుడు ఆజానుబాహుడు. విశాల వక్షస్థలము ఎత్తైన భుజములు కలవాడు. బిగువైన మూతి కలిగినవాడు. పసిమి పచ్చని శరీరచ్ఛాయ, కాంతులీను కమలదళముల వంటి అతని కన్నులు సమ్మోహనకరమైనవి. నల్లని దట్టమగు అందమయిన మీసము చూపరులకు ఏకకాలమున భయమును గౌరవమును కలిగించును. విశాల ఫాలభాగము ఆపై నల్లని పొడవాటి వెంట్రుకలు తలపై కొప్పుగా

ముడివేయబడి యుండును. బంగారు పోగుల కటి వస్త్రము బంగారుతీగల జరీ తలపాగ, దట్టీన వివిధాయుధములు, కత్తులు బాకులు, చేఈటెలు, గొడ్డళ్ళు ధరించి యుండును, ప్రతాపరుద్రుడు బందీ అగునాటి కాతనికి నలువది సంవత్సరముల వయస్సు వుండును.

కాపయ వయస్సున చిన్నవాడు. అందగాడు. ఆకర్షణీయము పరుల శాసించు వ్యక్తిత్వము కలవాడు. యువనాయకులకు ప్రేమాస్పదుడు. స్వత: అతని శరీరము బంగారు వన్నెకలది. స్ఫురద్రూపి, చురుకయినవాడు, ఆవేశపరుడు, తెలవితేటలు కలవాడు. అతడు పెద్దదగు తన కొప్పున జరీ అంచుల తలపాగ ధరించును. ఆజానుబాహుడు, బలమగు చేతులు, వేళ్ళు, ఉక్కుపిడికిలి కలవాడు. కత్తి యుద్ధమున విశేష నైపుణ్యము గలిగి తనకాలపు మేటి ఖడ్గ విద్యావిశారదుడుగా పేరుకాంచినాడు. వివేకము ఉత్సాహముకల నాయకమణిగా వాసికెక్కాడు. అతని సమక్షంలో నాయకులు స్వచ్ఛందంగా వినయ విధేయతలతో మెలిగేవారు. అతని మెరిసే ఎర్రని ఆర్ద్రనేత్రాలు ఆనందం, కోపం, దయ చక్కగా వ్యక్తీకరించేవి. కాకతీయ వంశప్రతిష్ఠలపై, భారతీయ ధర్మముపై అతని విశ్వాసమచంచలము. వివేక సామర్థ్యాలు కల నాయకుడు, శిక్షకుడు, నలువుర కూడగట్టుటలో నేర్పరి. దౌత్యవేత్త, గొరిల్లా యుద్ధనిపుణుడు, శత్రువుల నుండి తప్పించుకొను సులువులు, మెలకువలు తెలిసినవాడు.

వీరు పసుపు చందనగంధము మైపూతలుగా వాడేవారు. తైలమర్దనము యోగ సాధనలతో శక్తిమంతులయివుండేవారు.

గుఱ్ఱాలపై ప్రయాణించునప్పుడు బిగుతయిన దుస్తులు, సభలలో, ఇండ్లలో వదులైె వేలాడు పొడుగాటి పట్టుబట్టలు ధరించేవారు. సుగంధ ద్రవ్య మిళితమగు తాంబూలము సేవించేవారు.

ప్రోలయ మంచి అశ్వికుడు. కత్తియుద్ధంలో మేటి. ప్రజానాయకుడు. సైన్యవ్యూహములందు నేర్పరి. కాకతీయ రాజవంశ బంధువులగు గౌరవనీయ కమ్మకుటుంబాల వారందరివలె విద్యావంతుడు. రామాయణ మహాభార్శతాలేకాక కౌటిల్యుని అర్థశాస్త్రము, ప్రతాపరుద్రుని నీతి శాస్త్రము, నారాయణభట్టు రచించిన పంచతంత్రము. భర్తృహరి సుభాషితములు. తిక్కన ఆంధ్రమహా భారతాలను చదివినవాడు. బద్దెన రచించిన సర్వనీతిసారము సుమతీశతకములు వల్లెవేసియుండును.

ప్రోలయ కాపయలు కాకతీయుల చోళ చాళుక్యరాజుల వీరోచిత ప్రవర్తనావళి కంకితమయినవారు. లెంకలుగా నాయకులుగా సమాజ నిర్మాతలుగా పేరు పొందారు.

ప్రతాపరుద్ర చక్రవర్తి రచించిన నీతి శాస్త్రము ప్రోలయకు మార్గదర్శకమై యుండును.

సమకాలీన పండితుల రాజకీయవేత్తల ఆలోచనాశక్తికి అందనిది, వారి గ్రంథములలో లేనిది, ఇతః పూర్వముదహరింపబడనిది నయిన ఇద్దరు నాయకుల సమాఖ్యను ఈర్ష్యాద్వేషముల కతీతంగా ప్రోలయ బాధ్యత వహించి విజయవంతంగా నిర్మించాడు. ముస్లిం దురాక్రమణదారులకు వ్యతిరేకంగా విప్లవపోరాటం సాగించాడు.

భారతాధ్యయనం వలన యుధిష్ఠిరుని రాజనీతి, సహనము, ముందుచూపు రాజకీయ విజ్ఞతలు ప్రోలయకు అబ్బినవి.

ఉత్తరభారత చక్రవర్తులు చేయలేనిదానిని, వ్యవసాయము నరనరమున జీర్ణించుకొనిన ధర్మచింతాపరులయిన దక్షిణాది రైతులు చేయగలిగారు. తామేకమయ్యారు. ప్రజలనేకం చేసి సంఘటితపరచారు. ప్రజాప్రతిఘటనకు నాందీవాచకం పలికి విజయవంతమయిన విప్లవం సాగించారు. జాతిస్వాతంత్ర్యం కోసం మత, సాంస్కృతిక స్వేచ్ఛల కొరకు రైతుల గ్రామీణ చేతివృత్తుల వారి ప్రాథమిక హక్కుల రక్షణకు గ్రామ పంచాయితీ వ్యవస్థ సంపూర్ణ అధికారం కొరకు ఈ విప్లవం సాగింది.

ప్రోలయ నాయకత్వం స్వీకరించిన వెంటనే స్థితిగతుల సమీక్ష జరిగింది. తూర్పు కోస్తా గోదావరి తీరప్రాంతముల దుర్గములప్పటికే విడిపించబడినవి. వరంగల్లు సమీప ప్రాంతాలప్పటికే కాపయ స్వాధీనంలో వున్నవి. భువనగిరి, దేవరకొండ, రేచర్లలు రేచర్ల నాయకుల ప్రాబల్యంలో వున్నవి. రాయలసీమ గండికోట గంగినేనికొండ మరియు కంచి దుర్గాలు సులభంగా సాధించవచ్చు. యుద్ధ నిర్ణయం చేయుటమే ఆలస్యం. కంపిలినాయకులు స్వతంత్రత ప్రకటించుకొనుటకు సిద్ధంగా వున్నారు.

నాయకులొక్కుమ్మడిగా సమరశంఖాలు పూరించారు. సత్వర విజయాలందినవి. కాపయ ఆతని లెంకలు వరంగల్లు స్వాధీనం చేసుకొన్నారు. వరాహకేతనం మరల ఓరుగల్లుపై రెపరెపలాడింది.

శ్రీశైలము గండికోట గంగినేనికొండ నాయకులు ఒకటిగా నిలచారు. ప్రతాపరుద్రుని లెంకలు (కుమారునిగా లేక మనుమనిగా అభినందించబడిన కృష్ణ నాయకుడు (దేవుడు)) మరియు మనవాడి గోపీ దేవనాయకులు ఈ ఐక్యమునకు కారకులు. రాయలసీమ నుండి వరంగల్లుకు వీరు పెద్దసంఖ్యలో సైన్యాన్ని తరలించారు.

తూర్పు, పశ్చిమ ఆంధ్రములలో ఈ విప్లవోద్యమం ఏకకాలంలో సాగింది. రెండవ త్రిపురారి మహాదేవుడు, వినాయక దేవుడు ముఖ్య కార్యకర్తలు. వినాయక దేవుడు వీరుడు సాహసి, అసాధ్యుడు ఈతడు కాపయ కుమారుడు.

దౌత్య విజ్ఞత, పోరాటోత్సాహం, బ్రాహ్మణుల అండదండలు, రాయసోదరుల సహకారాలతో, ఆరవీటి సోమదేవుని, కర్ణాట (మూడవ) భల్లాళుని ఉద్యమ శ్రేయస్సుకై కాపయ జయించాడు. ప్రోలయ నాయకత్వంలో జరిగిన కోస్తా ప్రాంతాల విముక్తి పోరాట స్ఫూర్తితో మాబారు, ద్వార సముద్రం, ఆరవీడు (కంపిలి), రాయచూరు, కర్నూలు, గంగినేని కొండ ప్రభువులు ముస్లిం దురాక్రమణదారులను పారద్రోలుటకు కాపయతో చేతులు కలిపారు.

# 10. విప్లవ విజయం

సస్యశ్యామలమగు తెలంగాణాలో అధికారం నిలుపుకోవటానికి ముస్లిములు ఎక్కువ కృషి చేశారు. దుర్భేద్యమగు దుర్గాలతో రాజకీయ ప్రాముఖ్యం గల తెలంగాణా వారినెక్కువగా ఆకర్షించింది. ఢిల్లీవారికి కాల్బలమే కాని నౌకాబలం లేదు. ఈ బలహీనత కాపయకు ఎక్కువగా ఉపకరించింది. ప్రోలయ తీరప్రాంతాల విముక్తికి ప్రాధాన్యతనిచ్చాడు. తీరప్రాంతాలలో వున్న ఆయుధాగారాలు కోటలు ప్రోలయ స్వాధీనం చేసుకొన్నాడు. సరస్సులతో నిండిన దివి ప్రాంతం కొలనుసీమ కోస్తాలు ముస్లింలకు ఆకర్షణీయంగా లేవు. ఇవి ఇసుకపర్రలు దోమలుతో నిండి తక్కువ జనాభా కలిగి వుండేవి. ఈ ప్రాంతాలు తిరుగుబాటు దార్లకు ఆశ్రయమయినవి. ఈ ప్రాంతపు మత్స్యకారులు తిరుగుబాటుదార్లకు సన్నిహితులు. ఇచ్చటి నాయకులు ప్రోలయ కాపయలకు బంధువులు.

ప్రోలయ విజయ పరంపర కొనసాగింది. మహాభారత బోధన ప్రభావం అతనికి మనోధైర్యాన్నిచ్చింది. శ్రీకృష్ణానుగ్రహపాత్రుడు ప్రోలయ్య అని బ్రాహ్మణ సంఘమాతని కీర్తించినది. అచిరకాలంలోనే కృష్ణా గోదావరీ నదుల ఉభయ పార్శ్వములు విముక్తి పొందినవి. అన్ని వర్గముల వర్ణముల నాయకులు అతనితో చేతులు కలిపి యుద్ధాలలో ముందు నిలచారు.

సామాన్య ప్రజ ముస్లిం ప్రభుత్వంకు సహాయ నిరాకరణ చేశారు. రాజప్రతినిధులు నిస్సహాయులయినారు. "నూనెజ్" అప్పటి పరిస్థితులనిలా వర్ణించాడు. "పర్వతములకు వలస పోయినవారు, గత్యంతరము లేక గ్రామాల్లో పట్టణాల్లో బతుకుతున్నవారు "మాలిక్ నబీ"పై తిరుగుబాటుచేసి అతని కోటను ముట్టడించి ఆహారపదార్థాలు అందకుండా చేసి పన్నులు ఎగవేసి తమ ఇష్టారాజ్యంగా ప్రవర్తించసాగారు. తన ఫర్మానా చెల్లదని అచట వుండటం నిష్ప్రయోజనమని సుల్తానుకు తెలియచేశాడు." ఇది కంపిలిలో పరిస్థితి. అన్ని మండలములలో పరిస్థితులు ఇలాగే వున్నాయి.

ప్రోలయ ప్రజల కారాధ్యదైవమయినాడు. అతనిపేరు, అతని సందేశము విప్లవకాహళులయినవి. అతని రణ నినాదాలు ప్రజల యుద్ధ పరశువులకు పదునుపెట్టినవి.

విలస శాసనమందిట్లున్నది "యవనులు పెట్టుచున్న బాధలు చూసి దయార్ద్ర హృదయుడయిన భగవంతుడు తన విష్ణ్వంశతో అవతరించి భూభారము వహించెను.

పురాణ పురుషుని పాదముల యందు కలికాలమున శ్రేష్ఠమయినదని ఎన్నిక గాంచిన వర్ణము పుట్టినది. ఆ వర్ణమున ముసునూరి ప్రోలయ వంశము పవిత్రమయినది.

ముసునూరి వంశజుడయిన ప్రోలభూపతి విశృంఖలమును, విశ్వమునకు జీవనాధారమునైన తన బాహుబలముతో ఆ విధమయిన యవనుల ఆధిపత్యమును నాశము చేసెను. యవనాధములకు అతని నామోచ్చాటన కర్మధారి అయిన మంత్రమా ఏమి? ఆ పేరు ఉచ్చరించిన మాత్రమున దుర్గములు విడిచిపెట్టి ఎక్కడకో పారిపోయెడివారు. యవనులచేత బాధితులయిన ప్రజలు మనువు వంటి ఆప్రోల భూపతియనే మడుగులను నిదాఘార్తుల వలె ఆశ్రయించిరి. తురుష్కుల చేత భయంకరముగా పీడింపబడినవారే తురుష్కులను చంపివేసిరి. ఆశ్రయబలము గొప్పది కదా." ప్రోలభూపతి యవనాధిపత్యము నంతముచేసి ధర్మప్రతిష్ఠ కావించాడు.

ఈ స్వాతంత్ర్య సమర సిద్ధాంతపు పునాదు లా విధంగా డెబ్బయినాలుగు మంది కల నాయక సమాఖ్యచే వేయబడినవి. భారతదేశ పారతంత్ర్య విముక్తి పోరాటంలో ఇది ఏకైక సంఘటన. ఇంత సుదీర్ఘ స్వతంత్ర సమైక్య పోరాటం ఏకాలంలోనూ దేశమెరుగదు.

ఈ స్వాతంత్ర్య సమరం సామాన్య ప్రజ కత్యంతావశ్యకమయినది. ప్రజలపై అక్రమంగా విధించిన పన్నులు రద్దుచేసి శాంతి నెలకొల్పుటకు నాయకులు పాటుబడ్డారు.

విలస శాసనమందిట్లున్నది. "పూర్వ ధరణీపతులచే నొసంగబడి చిరకాలముగా బ్రాహ్మణానుభవములో నుండి తురుష్కులచే అపహృతములయిన అగ్రహారములు తిరిగి బ్రాహ్మణుల కిప్పించెను. తురుష్కుల పాద ఘట్టనలచే అపవిత్రము అయిన దేశమును ప్రోలరాజు పవిత్రీకరించెను. తపశ్శక్తి మహర్షులు ధారబోసిన చందమున తమ ఆదాయములో ఆరవ వంతును ప్రజలు రాజుకు చెందచేసిరి పారశీకులు నేల నాలుగు చెరగుల నొనరించిన దౌష్ట్యమును ఆ ప్రోల మహారాజు చక్కదిద్దెను."

నాశము చేయబడిన కోటలు దేవాలయములు బాగుపరచుటకు పునఃనిర్మాణము చేయుటకు కొత్తకోటలు నిర్మించుటకు నాయకులు తమ శక్తినంతా ధారపోశారు. ప్రజలు ప్రజానాయకులు సహకారమందించారు.

క్రీ.శ. 1327లో కర్ణాటక రాజ్యస్థితిగతులను "సెవెల్" ఇలా వ్రాసాడు. "కోటలు నిర్మించబడినవి. సైన్యములు సమీకరించబడినవి. దేశమున ప్రబలిన పాశవిక హింసాధోరణికి భయభ్రాంతులయిన ప్రజలు హరిహరరాయల బుక్కరాయల కంపిలరాయల పతాకచ్ఛాయ చేరారు. దురాక్రమణలను అరికట్టారు. మధురలో విప్లవము

నణచుటకు, మైసూరు గుండా నడుచు మహమ్మద్ బీన్ తుగ్లక్, హోయసలలో హిందువుల సమైక్య విప్లవమునకు జడిసి వెనుదిరిగెను.'' ప్రోలయ కాపయ నాయకసమాఖ్యల నాయకత్వం కూడా ఇంత ఉత్తేజకరంగా మరెంతో ధాటిగా నడచి వుంటుంది.

ముస్లిం గవర్నర్ల ఆధీనంలో వున్న కోటలను ఒకదానివెంట నొకదానిని లొంగదీసుకొని ఢిల్లీ సైన్యములను ఢిల్లీ సుల్తాన్ రాజప్రతినిధులను తెలుగుదేశం నుండి నాయకులు వెళ్ళగొట్టారు. రెండవ త్రిపురారి దేవుని కుమారులు గంగినేని కొండ గండికోట తదితర దుర్గాలు స్వాధీనం చేసుకొన్నారు. అనపోతారెడ్డి కొండవీటి ప్రాక్పశ్చిమదిశల మండలముల జయించాడు. ఈ విప్లవాలు అణచుటకు ఢిల్లీ సుల్తాన్ గియాజుద్దీన్ తన కొడుకు యువరాజు అయిన "తకురుద్దీన్ జునాఖాను (ఉలుగుఖాన్)''ను పంపెను. నాయక సమాఖ్య అతనిని ఓడించినది. నాలుగు దశాబ్దాలీ సమాఖ్య ఐక్యత వర్ధిల్లినది. బ్రాహ్మణాశీస్సులతో సామాన్య ప్రజకు శాంతి సౌఖ్యముల నందచేసినది.

# 11. కర్ణాటక విముక్తి

ఢిల్లీ సుల్తాను పరిపాలనలో మగ్గుచున్న దక్షిణావని విముక్తికై కాపయ, కర్ణాటక భల్లాళదేవులు ఏవిధంగా సహకరించుకొన్నది "ఫెరిస్తా" ఈ విధంగా వర్ణించాడు.

"లద్దర్ దేవ్ కుమారుడు కంబనాయక్ రహస్యంగా కర్ణాటక మహారాజగు భల్లాళ దేవుని కలిసి, తిల్గింగ్, కర్నాటకలలో ప్రవేశించిన ముస్లింలు, ఈ రెండు రాజ్యముల నాశము చేయుటకు చేయు ప్రయత్నములు విశదపరచి ఈ విషయ ప్రాధాన్యం తెలియపరచి తగు చర్య తీసుకోవలసిందిగా బోధించెను. భల్లాళ దేవుడు ముఖ్యులతో సమావేశమయి వారిసలహాకోరెను. ముస్లిం సైన్యములు వచ్చు బాటలో వారినెదుర్కొని సరిహద్దులలో నిలిచి అచటి కోటలు నివాసం చేసుకొని ఆ సంవత్సరమే "మాబార్", దార్సమంద్, కంపిలలను స్వాధీనము చేసుకోవలసినదిగా, కంబనాయక్ తెలంగాణ వరంగల్లులను నాక్రమించుకోవలసినదిగా వారు తీర్మానించారు. భల్లాళ దేవుడు తన కుమారుడు సుజనరాయ్ పేర బీజనగరమును నిర్మించెను.

తదుపరి కంబనాయకుడు భల్లాళదేవుడు కర్ణాటకాంతర్భాగములగు ధారాసమంద్ "మాబార్" రాజులకు సహకరించి ఈ రాజ్యములకు విముక్తి కలిగించెను.

("కంబనాయక్=కాపయ ధారాసమంద్=ద్వారసముద్రం మాబార్=మధుర బీజనగరం= విజయనగరం సుజనరాయ్=హరిహరరాయలు)

ప్రోలయ హరిహరరాయలు అతని నలుగురు సోదరులు మధ్య నెలకొన్న సంధి సమైక్యములు రాజకీయంగా సాంఘికంగా ఎంతో విలువయినవి. ప్రతాపరుద్రుని కొలువున హరిహరరాయలు బుక్కరాయలు రాజప్రముఖులుగా వున్నారు. కంపన మారప్ప ముద్దన మొదలగు సోదరులు బీజపూర్ ఆగ్రా ముక్బగల్‌లో గవర్నర్లుగా పనిచేశారు. కంపిలి హోయసల కాకతీయ రాజ్యపాలనలో విశేషానుభవము గడించారు. ప్రోలయకు బంధువగు వీరభల్లాళునకు వీరిపై ఎంతో నమ్మిక గలదు. వీరి పొత్తువలన క్రీ.శ. 1330 నుండి ముస్లిం సైన్యములు మైసూరు రాజకీయాలలో తలదూర్చక మధురలో ఒక ముస్లిం గవర్నరును మాత్రం నామమాత్రంగా వుంచింది.

ఋషితుల్యుడు మహాయోధుడు అయిన వీరభల్లాళునితో కాపయ సఖ్యం పాటించి ముస్లింలను కర్ణాటక నుండి పారద్రోలగలిగాడు. కంచి తొండమడలముల విడపించి 'వెనురుమ్ కొండర్ సాంబువరాయ"ని గద్దెపై నిలిపారు. విజయనగర

సామ్రాజ్యస్థాపకుడు ఆరవీటి వంశపు మూలపురుషుడు అగు చాళుక్య సోమదేవుడు, ప్రోలయలు "మాలిక్ మహమ్మద్" నోడించి ఉత్తర కర్ణాటకకు విముక్తి కలిగించారు. కంపిల స్వాధీనము చేసుకొన్నారు. ప్రోలయ రెండవ త్రిపురారి మహాదేవులు గంగయ సాహిణిచే నిర్మించబడిన "గంగినేనికొండ" సాతానికోట, ఆనెగొందిలను ఆక్రమించి కడప, కర్నూలు బళ్ళారి ప్రాంతాల పారతంత్ర్యాన్ని రూపుమాపారు. ఈ యుద్ధములలో కోమటి వేమారెడ్డి ప్రోలయతో చేతులు కలిపాడు.

ప్రోలయ తన నాయకత్వాన్ని ధర్మరాజు అడుగు జాడలలో మలచుకొన్నాడు సహచర నాయకుల ఆమోదంతో నాయక సమాఖ్యకు అధ్యక్షుడయినాడు. స్పర్ధ, మెలకువ వ్యక్తిత్వములు కలిగి పరులకు తలవంచని ఇందరు నాయకులు ప్రోలయ నాయకత్వాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించుట సామాన్య విషయంకాదు. ప్రోలయ వీరునిగా రాజకీయవేత్తగా దేశభక్తునిగా ఎదిగి భారతేతిహాసవీరుడగు ధర్మరాజుకు ప్రతిరూపమని కీర్తించబడ్డాడు.

ప్రోలయ కాపయల సారథ్యంలో నాయక సమాఖ్య ఐక్యంగా నిలిచింది. ఢిల్లీ సుల్తానును వాని తాబేదార్లను గుల్బర్గా సుల్తానును ఐక్యంగా ఎదుర్కొని సామర్థ్యంతో ప్రతిఘటించింది. నాయకులపై సమాఖ్య కేంద్రీయ పెత్తందారీతనం చెలాయించలేదు. వీరి ఐక్యమునకు ఇది ముఖ్యకారణం. కొందరు నాయకులు కలహాలు ఈ ఐక్యమునకు ముప్పు కలిగించలేదు. ఢిల్లీ సుల్తాను బహ్మని సుల్తానుల నెదుర్కొనుటలో నాయక సమాఖ్య కృషి ప్రతిష్ఠాత్మకమయినది.

ప్రోలయ "రేకపల్లి"ని తన రాజధానిగా చేసుకొన్నాడు. వరంగల్లుపై కాపయ ఆధిపత్య మామోదించాడు. నాయక సమాఖ్య అధ్యక్షునిగా సమాఖ్యకు తన నాయకత్వం మాత్రమే అందించి రాజ్యకాంక్ష లేక సార్వభౌమత్వం నెరపక విజ్ఞత ప్రదర్శించారు. వరంగల్లు గెలిచినప్పటికీ ప్రోలయ నాయకత్వమును సుస్థిరం చేయటానికే కాపయ కృషి చేశాడు. నాయక సమాఖ్య మంత్రిత్వము వహించి మహామండలేశ్వరునిగా కాపయ - ప్రోలయ జీవిత పర్యంతము వ్యవహరించాడు. ప్రోలయమరణంతో కాపయ నాయక సమాఖ్య బాధ్యతలు స్వీకరించాడు. "ఆంధ్రదేశాధీశ్వర" అను బిరుదు ధరించాడు. అతని సహచరులతనిని "పురవరేశ్వర" చోడరాజ్యస్థాపనాచర్య, కాంచీ రక్షాపాలక వంటి బిరుదులతో ఎంతో గర్వంగా కీర్తించినట్లు "పిల్లలమర్రి" శాసనం తెలియజేస్తున్నది.

దీనివలన క్రీ.శ. 1357 వరకు కాపయశక్తి ప్రజాదరణ తెలియుటేకాక నాయక సమాఖ్యకు చోళరాజ్యపు తమిళ ప్రాంతములలో ఎంత పట్టు వుందీ అవగతమౌతుంది. ఈ విషయాలు ఎరపోతు మాచినాయనింగారి కుమారుడు లెంకగారు, రుద్రసాని, పిల్లలమర్రి రాజప్రతినిధి నిర్ధారించారు. క్రీ.శ. 1357 వరకు నాయక సమాఖ్య ఉద్యమము నెంతో స్ఫూర్తితో నడపినట్లు, బహమనీ సుల్తానులచే ధ్వంసం చేయబడిన దేవాలయములు పునర్నిర్మాణ కార్యక్రమాలు ముమ్మరంగా చేపట్టినట్లు తెలుస్తున్నది. అల్లాయుద్దీన్ (గుల్బార్గా)చే ధ్వంసము చేయబడిన పిల్లలమర్రి దేవాలయములోని శివలింగం స్థానే మూల విరాట్టును పునఃప్రతిష్ఠ చేయునవసరమున పిల్లలమర్రి లెంకగారీశాసనం వేశారు.

అసహనాలతో నిరంతర కలహాలతో ముక్కచెక్కలకై కొట్లాడుకుంటూ ఎవరికివారే చక్రవర్తులమని ప్రకటించుకొంటున్న ఫ్యూడల్ ప్రభువులను తన అసమాన రాజనీతి, అద్భుత దౌత్య సరళి, అనుపమాన దేశభక్తి ప్రపత్తులతో నాయక సమాఖ్య ఒకేత్రాటిపై నడిపి ఒకేకట్టగా వుంచగలిగింది. నాలుగు దశాబ్దాల పర్యంతం దక్షిణభారతదేశపు స్వతంత్రతను కాపాడింది.

ప్రోలయ కాపయలు విజయనగర హొయసల పాలకులతో అత్యంతావశ్యకము ఉభయ శ్రేయోదాయకము అయిన సమోధ్య పాటించారు. వారిని సమాఖ్యలో నౌకరివలె కాకుండా మిత్రులగు స్వతంత్రరాజుల వలె గౌరవించారు. సమాఖ్యలోని నాయకులు ఒకరిపై ఒకరు దాడిచేసి ప్రాంతముల నాక్రమించినపుడు ఈ మైత్రి ఎంతో ప్రాధాన్యం సంతరించుకొన్నది. హరిహరరాయలు బుక్కరాయలు, కొండవీటి వారితో యుద్ధములు చేసి వారినదుపులో పెట్టారు. కాపయ నెల్లూరు పెన్నాలోయలను ఆక్రమించు అగత్యమేర్పడినది. ఐనను కాపయ. వినాయక దేవుడు హరిహర బుక్కరాయల సహకారాన్ని బహమనీ సుల్తానుకు వ్యతిరేకంగా పొందారు. తన సైన్య సహకారాలు రాయ సోదరులకు కాపయ అందించాడు. అంతర్గత అనైక్య పరస్పర కలహాలు నాయక సమాఖ్యను బలహీనపరచుచున్నను కాపయ విశాలాంధ్ర స్వాతంత్ర్యరక్షకుడయినాడు. ప్రతాపరుద్రుడు చేసిన యుద్ధములకు, తదనంతరం కాకతీయ నాయకులు జరిపిన పోరాటాలకు భేదమున్నది. కాకతీయ చక్రవర్తుల పేర, కాకతిదేవిపేరగాక ఆంధ్రదేశవిముక్తికై సమాఖ్య నాయకులు పోరాటాలు చేశారు. ఈమార్పు ఆంధ్రదేశము లేక ఆంధ్రప్రదేశ్ లేక విశాలాంధ్ర ప్రజల దృష్టి నాకర్షించినది.

తెలుగు భాష మాట్లాడే ప్రజలందరూ ఆ కష్టకాలంలో ఒకే బలమయిన శక్తిగా రూపొందారు.

కృష్ణానదీ ముఖద్వారమున ఆంధ్ర విష్ణువు వెలసిన శ్రీకాకుళం నుండి శ్రీశైలం వరకు కంచి నుండి కళింగం వరకు తెలుగు వారి సాంస్కృతిక వారసత్వం ఒక్కటయినది. పశ్చిమమున హొయసల కంపిలి, ఉత్తరమున దేవగిరి మహా రాష్ట్రములలో ఇదే పరిణామము సంభవించినది. భావోద్రేక భరితమగు సాహిత్య సంపద, ఛందోబద్ధమగు ఇతిహాస రచనలు, గేయాలు, నాట్యగీతలు, ద్విపద కావ్యాలు, వచన కావ్యాలు ఉన్నతము ఉదాత్తము నియమబద్ధమునగు సాహిత్యం వినూత్న గతులతో ఆవిష్కరింపబడి ప్రజాభిప్రాయమునకు దౌత్యనీతికి సామర్థ్యమునకు అద్దం పట్టింది.

# 12. నాయకయుగపు ఒడిదుడుకులు

దక్షిణాపథం నుండి ముస్లిం సామ్రాజ్యవాదులను వెళ్ళగొట్టిన తర్వాత ప్రోలయ పది సంవత్సరాలు మాత్రమే జీవించాడు. కాపయను వరంగల్లులో కాపయ కుమారుడు వినాకయదేవుని "కాళేశం" (కౌలాస)లో గద్దెలపై నిలిపాడు. రేకపల్లి నుండి ప్రోలయ పరిపాలించాడు. అదృష్టహీనమగు వరంగల్లుపై అతడు మోజుపడలేదు. యువనాయకులకు ఆ నగరరక్షణ బాధ్యతలు అప్పచెప్పాడు. ఢిల్లీ పాలకులతో యుద్ధముల వలన మానసికంగా గాయపడిన ప్రజల నోదార్చుటకై శ్రమించాడు. గ్రామముల పునారావాసము, దేవాయముల జీర్ణోద్ధరణము, నీటివనరుల, రహదారుల విద్యావైద్యముల అభివృద్ధికై ప్రజలతో సహకరించాడు. నాయకుల మధ్య సయోధ్య పెంపొందించాడు. వారి ఐక్యమునకు కృషి చేశాడు. నూతనముగా నాయకత్వమునకెదిగిన రెడ్లను బోయలను దుర్జయవంశస్థులగు రేచర్ల కొలను కాయత్స చోళరాజ కుటుంబముల వారి సరసన నిలిపాడు. వారు ఈర్ష్యా ద్వేషములలోను గానట్లు ప్రవర్తించాడు. అద్దంకి నాయకుడు అనపోతారెడ్డిని, చెరుకూరు నాయకులను గౌరవించాడు. (చెరుకూరు గ్రామములు చెరుకునేని కమ్మవారు) సైనిక రాజకీయ ప్రాబల్యములు కల భువనగిరి దేవరకొండ రేచర్ల నాయంకరములు, రేచర్ల నాయకులకు స్వాధీనం చేసి వారితో సఖ్యం పెంచుకొన్నాడు హోయసల విజయనగర, కాయత్సచోళ, నెల్లూరు కొలను వారితో బాంధవ్యాలందుకొన్నాడు. రాజకీయమైత్రి వారితో పాటించి వారితోను పెన్న కృష్ణ దుర్గాధిపతులతోను తన సంబంధములు మెరుగుపరచుకొన్నాడు. దక్షిణాపథ నాయకులు నాయక కుటుంబములు సమానత్వము పరస్పర రాజ్యాధికార గౌరవములు కలిగి యుండునట్లు చేయటంలో విజయం సాధించాడు. శాసనములు వేయించాడు. ధ్వజస్తంభములెత్తించాడు. విద్యాధికులకు అపూర్వరీతిలో దానాలిచ్చాడు.

నాయక సమాఖ్య సాధించిన సంపూర్ణ విజయాలు చూచుట కాతడు నోచుకోలేదు. ఒరిస్సా గజపతులతో యుద్ధమున ప్రోలయ రణరంగమున వీరస్వర్గమలంకరించాడు. ఉత్తరము విడిచి ప్రాక్ పశ్చిమ దక్షిణ దిశల మిత్ర రాజ్యములతో సమైక్యాంధ్ర నిర్మాణం చేసాడు.

ప్రజా హృదయాధినేతయగు కాపయ నాయక సమాఖ్యకు నాయకత్వం వహించాడు. ముమ్మడి నాయకుడు అతని కుమారులు కొలను రుద్రదేవుడు బ్రహ్మాణ నాయకులు అతని కండగా నిలచారు.

కాపయ వరంగల్లుకు పాలకుడయినాడు. చరిత్ర పుటలలో చిరస్థాయిగా నిలిచాడు. ముస్లిం చరిత్రకారులు కాపయ నొక్కనినే విప్లవనాయకునిగా గుర్తించారు. పశ్చిమంలో హరిహరరాయలు బుక్కరాయలను దక్షిణమున వీరభల్లాళుని చోళపాండ్య నాయకుల విజయాలను చారిత్రక ప్రాధాన్యములను కాపయ మనసున నిల్పుకొని గౌరవించాడు.

ప్రోలయ పేరనే కాపయ శాసనాలు ప్రకటించాడు. సహచరులాతనిపై కురిపించిన రాచరిక బిరుదులు తిరస్కరించలేకపోయాడు. అద్దంకి ప్రోలయ వేమారెడ్డి మొదలగువారు పట్టాభిషేకములు చేసుకొనగా ప్రోలయ మరణానంతరం కూడా కాపయ చక్రవర్తిగా ప్రకటించుకొనుటకు విముఖుడు.

కాపయ కుమారుడు వినాయకదేవుడు. శక్తిపరుడు. ఉత్సాహవంతుడు. బహమనీ సుల్తానులతో యుద్ధములందు తండ్రికి సమాఖ్యకు పెట్టనికోట. ముస్లిం సామ్రాజ్యవాదానికి తీవ్ర వ్యతిరేకి. బహమనీ సైన్యముల బారి నుండి వరంగల్లును ఆంధ్రదేశమును రక్షించుటే యాతని ధ్యేయము.

భారతీయధర్మము, సంస్కృతి, జీవిత విధానము, రక్షణకై దీక్ష వహించి కాపయ దక్షిణాపథ చక్రవర్తిత్వం స్వీకరించాడు. దేవాలయముల పునర్నిర్మాణము కావించాడు. బ్రాహ్మణులను మడులు మాణిక్యాలతో తృప్తిపరచాడు. ఆంధ్రనాయకులలో కాపయ సాటిలేని మేటి నాయకునిగా కీర్తిగడించాడు. అతని సహచరులకు కాపయ వివేకమబ్బలేదు. బ్రాహ్మణులాతనిని పశ్చిమచాళుక్య, దక్షిణ చోళ కాకతీయులు వంశముల బిరుదులతో ముంచెత్తారు. మైమరపించే గర్వము అతిశయోక్తులతో నిండిన గేయాలు శ్లోకాలతో అంతన పొంతనలేని పొగడ్తలతో పురోహితులాలోచనారహితంగా నాతని కీర్తించారు. వృద్ధనాయకుల కిది కంటగింపు అయినది. ఈ భజనలు వారిలో అనైక్య బీజాల వాటినవి. రేచర్ల వారు యితరులు అధికార వాంఛాగ్రస్తులై, ఈర్ష్యాపరులయ్యారు.

ఇటువంటి విషయములలో ప్రోలయ తన సహచరుల మనోభావాలు గుర్తెరిగి ప్రవర్తించేవాడు. అధికారపు హద్దులు తెలిసి మసలేవాడు. కాపయ సమాఖ్యకు అధ్యక్షుడయిన తరువాత నాయకులకు అధికారమదం తలకెక్కింది. కాపయనాయక సమాఖ్య అధ్యక్షునిగా కాక పాలకునిలా ప్రవర్తించాడు. అత్యుత్సాహవంతులగు తన

లెంకల అధికార దుర్వినియోగ మరికట్టలేకపోయాడు. అప్పటి పరిస్థితులు అధికారము రాజగౌరముల ప్రకటనకు, దర్బారులు కొలువులు తీర్చి కవుల పండితుల ప్రగల్భముతో ఒక్కొక్కడొక మహామండలేశ్వరునివలె ప్రవర్తించుటకు, అనువుగా వుంది. శాస్త్ర పరిచయం రాజనీతి వైదుష్యం కలిగి కూడా కాపయ నాయక సమాఖ్యలో సమతాభావం కలిగించు నధ్యక్షునిగా వ్యవహరించలేదు. ఈ కాలంలోనే దేవగిరి తురుష్క సర్దారులు బహమనీ అల్లాయుద్దీన్‌ను తమ సుల్తానుగా ఎన్నుకొనుట జరిగినది. ఈ పరిణామము కూడా లెంకలపై దుష్ప్రభావము చూపియుండవచ్చును.

ఢిల్లీ సుల్తానుపై తిరుగుబాటుచేసి ముస్లిం సర్దారులు దేవగిరి చేజిక్కించుకొన్నారు. వీరిలో కొందరు నూతనంగా ముస్లిం మతం పుచ్చుకున్నవారు. ఎక్కువ మంది ఆఫ్ఘనిస్థాన్, పర్షియా, అరేబియా, టర్కీ, మధ్య ఆసియా, అబిసినియా, ఆఫ్రికాల నుండి భారతదేశ సంపద కొల్లగొట్టుటకు వచ్చినవారు. ఢిల్లీ దర్బారులోని విభేదాలు ఆసరాగా చేసుకొని స్వతంత్రత ప్రకటించుకొన్నారు. బహమనీ సుల్తాన్ అల్లాయుద్దీన్ వీరికి నాయకుడైనాడు. వీరు ఆంధ్ర, కర్ణాటక నాయకుల ముఖ్యంగా కాపయ ఆధిపత్యమును సహించలేకపోయారు. వరంగల్లుపై వారి కన్నుపడింది.

కాపయ వరంగల్లు రాజపీఠాన్నధిష్టించి దాదాపు దశాబ్దం గడిచింది. అనునిత్యం వరంగల్లుపై దండయాత్రకు సిద్ధంగా వున్న ఢిల్లీ సుల్తానొకవైపు, మహమ్మద్ బీన్ తుగ్లక్‌పై తిరుగుబాటు చేస్తున్న దేవగిరి తురుష్కులొకవైపు - అధికారదాహరం యుద్ధమైకం తలకెక్కిన స్థానిక ఫ్యూడల్ ప్రభువుల అంతః కలహాలు ఒకవైపు - ఈ సమస్యల వలయంలో కాపయ చిక్కుకొన్నాడు.

రాజకీయ తంత్రాల్లో భాగంగా ఎక్కువమంది నాయకులను కూడగట్టుటకు ప్రోలయ కాపయలు నాయకులతో బంధుత్వాలు కలుపుకొన్నారు.

రేచర్ల భువనగిరి నాయకులగు సింగమనాయుడు అతని కుమారులు కాపయను లెక్కసేయక దుర్గముల బలపరుచుకొని కొత్తదుర్గాలు నిర్మించి అద్దంకి, కోట రెడ్డిరాజులతో యుద్ధాలు చేయసాగారు. కాపయ వీరిని లొంగదీశాడు. ఈ సంఘటన నాయక సమాఖ్యలో అంతర్గత విభేదాలకు కారణమయింది.

గుజరాతు, దేవగిరి, బెంగాలు ప్రాంతపు తురుష్క సర్దారులు ఢిల్లీపై తిరుగుబాటు చేస్తూ స్వతంత్ర ప్రయత్నాలు మొదలు పెట్టారు. కాపయ దక్షిణాపథ

హిందూ సామ్రాజ్యము ప్రక్కనున్న ముస్లిం సామ్రాజ్యములతో సహజీవనం సాగించక తప్పదని. అపోహపడ్డాడు. దేవగిరి తురుష్క సర్దారులకు యుద్ధ సహాయమందించాడు. దీని పరిణామమే బహమనీ సామ్రాజ్యావతరణ. కాపయ బహమనీ సుల్తానుల నుండి మైత్రీ విశ్వాసములు నాశించుట సహజము.

ప్రోలయ కాపయలు గతంలో భారతీయ ధర్మం. హిందూమతం రక్షణల కొరకు ప్రజాసహకారంతో విప్లవ పోరాటాలు నడిపారు. నేటి పోరాటాల ఆంతర్యం వేరుగా వుంది. స్వతంత్ర రాజ్య స్థాపనాభిలాషులగు కొందరు నాయకులకు మినహా యితరులకు ముఖ్యంగా పురోహిత వర్గాలకు యిదినచ్చలేదు. ఈ సంఘటన తరువాత హిందూమతానురక్తి, విశ్వాసముల పేరిట ప్రజలను కాపయ ఉత్తేజపరచలేకపోయినాడు. ఇరువురు ముస్లింల మధ్య యుద్ధంలో ఒక ముస్లింను సమర్ధిస్తూ వేరొకరిని వ్యతిరేకించే వానిగనే కాపయ భావించబడ్డాడు. సర్వత్రా నాయకుల సహకారము ప్రజాభిమానము పొందలేకపోయినాడు. దేవరకొండ, భువనగిరి, రేచర్ల నాయకులు తరువాత కాలంలో బహమనీ సుల్తానుతో చేతులు కలిపినపుడు కాపయ వారిపై కత్తులు దూశాడు. ముస్లింలతో యుద్ధమునకు సిద్ధమేకాని ఒక ముస్లిం కొరకు వేరొక ముస్లింతో యుద్ధము చేయవలసిన యగత్యమేమని నాయకులాతని నెదిరించ గలిగారు. బహమనీ సుల్తానుకు కాపయ సహకరించినపుడు తాము వేరొక సందర్భములో సుల్తానుకు సహకరించుట పాపమెట్లగునని ప్రశ్నింపగలిగారు. ఢిల్లీ సుల్తాను దేవగిరి సుల్తాను తన ప్రాదేశిక సమగ్రతపై కుదుర్చుకొనిన యొప్పందము గౌరవించరను కఠోరసత్యము కాపయకు అవగతమయినది. వారి జోక్యాలను దురాక్రమణలను అరికట్టలేక పోయాడు. ఆకారణంగా నాయకు లొండొరులతోయుద్ధాలు చేస్తున్నారు. సాంఘిక రాజకీయ సమస్యలు వారికి పట్టలేదు. ఈ కాలంలోనే కాపయ ఢిల్లీ సుల్తాను. బహమనీ సుల్తానులతో నిర్యుద్ధసంధి. మతసహిష్ణుత ప్రాతిపదికగా చేసుకొన్నాడు. పరస్పర సహకారము మతగౌరవములు తనవరకు ఖచ్చితంగా కాపయ పాటించాడు.

బహమనీ సుల్తాను అల్లాయుద్దీన్‌ను సింగమనాయకుడు అతని కుమారులు వరంగల్లు ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకొనేటట్లు రెచ్చగొట్టారు. సింగమనాయకునికి, అతని అనుచరులకు కాపయను నిర్లక్ష్యంచేసే అవకాశం దొరికింది.

బహమనీ సుల్తానులు ఆతని సర్దారులు నాయక సమాఖ్యలోని కొందరితోకుట్రలు పన్ని విశ్వాసహీనులయి కాపయపై దండెత్తారు. ఈ పరిణామాలు

కాపయ ఊహించినవికావు. అతని ఆలోచనలు తారుమారు అయినవి. కాపయ ఓడినాడు. గోదావరి నదిని దాటి ముస్లింలపై సైన్యములు వరంగల్లును ముట్టడించినవి. కాపయ దారుణముగా వంచింపబడ్డాడు. కాపయ్య అతని మిత్రులు ఆత్మగౌరవము దిగమింగి బహమనీ సుల్తానుకు నజరానా చెల్లించి సంధి చేసుకొన్నారు.

ఆంధ్రదేశ స్వాతంత్ర్య మీవిధంగా బహమనీ సుల్తానులచే హరింపబడుట కాపయ జీర్ణించుకోలేకపోయాడు. తనకు విశ్వాస పాత్రులగు నాయకులను. హొయసల విజయనగర రాజులను కూడగట్టినాడు. ఐక్యావశ్యకం వారెల్లరూ గుర్తించారు.

ఈ ఓటమి ఆంధ్రనాయకులకు మంచి గుణపాఠమయింది. ఐక్యంతో కలసికట్టుగా విజయం సాదించవలెననే పట్టుదల వారిలో పెరిగింది. బహమనీ సుల్తానుకు సహకరంచిన రేచర్ల భువనగిరి నాయకులపై యుద్ధాలు సాగించారు. కాపయ సైన్యాలు బలహీనపడినవి. ఆతని సరఫరాలు ఆహారనిల్వలు తరిగిపోయినవి. ముప్పది సంవత్సరాల సుదీర్ఘ పోరాటాలతో ప్రజలు విసుగు చెందారు.

రాయసోదరులు, కాపయ ఢిల్లీ సుల్తాను సాయము కోరవచ్చని బహమనీ సుల్తాను ఆలోచించాడు. బహమనీ సుల్తాను తన వేగులను సర్దారులను ముందు తోలి వారివెనుక తాను బయలుదేరి రెండు సంవత్సరాలు తెలంగాణా పర్యటించి నాశము చేశాడు. దేవాలయాలను కూలద్రోసి మసీదులుగా మార్చాడు.

వరంగల్లును బహమనీ సైన్యములు మరల మరల ముట్టడించినవి. వారి దుర్మార్గములు ఊహాతీతములు. వేరు మార్గములేక కాపయ ఓటమి నంగీకరించి "కాళేశ" దుర్గం ఆతనికి అప్పగించి మితిలేని ధనాన్ని చెల్లించాడు.

కాపయ కష్టాలంతటితో తీరలేదు. హొయసల మూడవ భల్లాళుని మరణ మాతనిని క్రుంగదీసింది. ఎనుబదేళ్ళ వయస్సున వీరభల్లాళుడు మధుర కన్ననూరు సుల్తానుల అణచివేతకు గురి అయిన తమిళనాడు, కేరళ ప్రజల స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించాడు. కన్ననూరు ముట్టడించి అచటి ముస్లింల నడ్డి విరుగగొట్టాడు. ముస్లింలు మధురలో వున్న తమ సుల్తాన్ కుతుబుద్దీన్ అంగీకారముతో సంధి చేసుకొందుమని అతనికి తెలియపరచి వార్తాహరునంపుటకు అనుమతి యివ్వమని కోరారు. భల్లాళుడు అంగీకరించాడు. సుల్తాన్ అనుమతికి మారుగా అనూహ్యంగా సైన్యాలను పిలిపించుకొని వెనుకవైపు నుండి దాడిచేసి వీరభల్లాళుని అతిక్రూరంగా

హింసించి చిత్రవధ చేసి చంపాడు. ఈ విధమగు విధి వైపరీత్యము వలన అనాగరిక తురుష్కులచే దయామయులగు హైందవరాజులు ఓడించబడ్డారు. ఈ విధి దౌష్ట్యము మరల మరల ప్రపంచంలో తల ఎత్తుతూనే వుంది.

బుక్కరాయలు కాపయ ఇతరులు చేసే స్వాతంత్ర్య ప్రయత్నాలు తెలిసి బహమనీ సుల్తాను మరల దండయాత్రకు సిద్ధమయినాడు. కాపయ మరల సైన్య సమీకరణ చేశాడు. విజయనగర రాజుల సహాయమర్థించి బహమనీ సామ్రాజ్యం పశ్చిమ ప్రాంతాలపై దాడి చేయించాడు. వినాయక దేవుడు "కాళేశ్"ను స్వాదీనం చేసుకొనుటకు విజయనగర సైన్యాలకు ముందుండి నడిపించాడు. బహమనీ సైన్యాలు విజయనగరం సైన్యాల నోడించినవి. సంవత్సరంపాటు విజయనగర సామ్రాజ్యంలో పూచికపుల్లకూడా లేకుండా కొల్లగొట్టినవి. వినాయకదేవుడు భువనగిరిని మొదట గెల్చినను, మహమ్మద్‌షా నాయక సైన్యములు మరల ఓడించి, వరంగల్లు ముట్టడించి కాపయచే కప్పము కట్టించుకొని సంధి కంగీకరించాడు.

వినాయకదేవుడు ఆత్మాభిమాని. ధైర్యశాలి. కాని కాపయవలె వివేకశీలి కాడు. విజయనగరము వరంగల్లు పాలకుల ఓటమి సహించలేకపోయాడు. బహమనీ ఆధిపత్యమును సవాలు చేయుటకై మహమ్మద్‌షా నాణెములు కరిగించుటకు ప్రోత్సహించినాడు. మహమ్మద్ షాకై కొనితెచ్చు అరబ్ గుఱ్ఱముల నడ్డగించి స్వాధీనపరచుకొన్నాడు. వినాయకదేవుని ఏలుబడిలోని "వేలుం" పట్టణంపై మహమ్మద్‌షా దండెత్తి అతని నోడించి బందీగా తీసుకొనిపోయాడు.

బందీయగు వినాయకదేవుడు మహమ్మద్ షా యొక్క ఆతని తండ్రి యొక్క విశ్వాసహీనతను ఎత్తిపొడిచి నిండుసభలో వారి ఆధిపత్యమును నిరసించాడు. ధైర్యశాలి సర్వసైన్యాధ్యక్షుడు యువరాజు మహామండలేశ్వరుడునగు వినాయక దేవుని నాలుక కోయించి కోట బురుజుపైనుండి మంటలలోనికి మహమ్మద్‌షా విసరివేయించాడు. అభిమన్యుడు బాలచంద్రునివంటి ధైర్యశాలియగు వినాయకదేవుడు అస్తమించాడు. వినాయకదేవుడు తన సాహసకృత్యములతో నాయకత్వ లక్షణములతో అద్భుతముగా ప్రజాసమీకరణ చేసి వారి హృదయాలను చూరగొని ఆంధ్ర, కర్ణాటక యువనాయకులలో ధ్రువతారగ వెలుగొందాడు. తురుష్కులాతని పరాక్రమమునకు జడిసి భయముతో ద్వేషించారు. మహమ్మద్‌షా వేలుం పట్టణాన్ని కొల్లగొట్టించాడు.

వినాయకదేవుని మరణంతో ఆంధ్రప్రజలు గుండెలు మండినవి. ప్రజలు గెరిల్లా పోరాటాలకు దిగారు. మహమ్మద్‌షా సైన్యములను వేధించి వెంటబడి తరిమారు. వారి దాడులు భరించలేక మహమ్మద్‌షా తాను కొల్లగొట్టిన సామాగ్రినంత తగులబెట్టించి వజ్రాలు, బంగారంతో పారిపోయాడు. కాళేశ్ చేరునప్పటికి రెండువంతుల సైన్యము గాయపడింది. సుల్తాను కూడా క్షతగాత్రుడయినాడు.

ప్రోలయ కాపయ వినాయకదేవులు ఆంధ్ర ప్రజలలో ఎంతగా స్వేచ్ఛా ప్రయత్నాన్నీ జాతీయ గౌరవాభిమానాలను ప్రతిఘటనాశక్తిని తెగువను శౌర్యాగ్నిని రగుల్కొల్పారో పై సంఘటన తెలియచేస్తున్నది.

దక్షిణాపథపు దురదృష్టం కొలదీ బహమనీ సుల్తాను దురాక్రమణదారుగా విశ్వాసహీనుడుగా బలవంతునిగా మారాడు. భువనగిరి నాయకులు దేశభక్తి హీనులయి సుల్తానుతో చేతులు గలిపి కుట్రలు పన్నారు. విప్లవ పోరాటాల్లో గతంలో ఎంతగానో సహకరించిన ఈ నాయకులు వీరి కుమార్లు తరువాత కాలంలో రాజ్యకాంక్షతో ఫ్యూడల్ అలవాట్లను ప్రదర్శించారు. వరంగల్లు నాయకులకు సహకరించలేదు. దీని ఫలితంగా వరంగల్లు బహమనీ సుల్తాను వశమయింది. ఆంధ్రదేశ స్వాతంత్ర్యము కుప్పగూలినది. కాపయ తర్వాత వరంగల్లు భువనగిరి నాయకుల వశమయింది. ముస్లింల అత్యాచారాలను మతమార్పిడులను ప్రజలను బానిసలుగా తీసుకొని వెళ్ళుటను, దేవాలయములను హైందవ మతమును అపవిత్రీకరించుటను, అగౌరవపరచుటను ఎదుర్కొను నైతిక రాజకీయ శక్తి ఈ నాయకులకు లేకపోయింది.

కాపయ తన పోరాటకాలమంతా ద్వార సముద్రము విజయనగరము వారితో మైత్రి కలిగివున్నాడు. ఇదియే కాపయ రాజనీతిలోని ముఖ్యాంశము. బహమనీ సుల్తానుతో దశాబ్దాల పర్యంతం జరిగిన యుద్ధాలలో వారు కలసికట్టుగా వుండి దక్షిణాపథాన్ని రక్షించారు.

నాలుగు దశాబ్దాల దక్షిణాపథ స్వాతంత్ర్య పరిరక్షణోద్యమ నాయకత్వమున ఆంధ్రలో ప్రోలయ, కాపయ, కర్ణాటకలో రాయ సోదరులు వీరభల్లాళుడు ఒకరిపట్ల ఒకరు ప్రదర్శించిన మైత్రి స్నేహబంధాలు ఎంతైనా కొనియాడదగినవి. భయసందేహాలకు తావివ్వక వారు మెలిగారు.

కాపయ సహచరులతో మిత్ర రాజ్యాలతో ఎంతో విశ్వాసపాత్రుడుగా మెలిగాడు. పాండ్య, కేరళ రాజకుమారులు త్రిపురారిదేవుడు సోమదేవుని కుమారులు కాపయపట్ల ఈర్ష్యాద్వేషములు లేక ప్రతాపరుద్ర చక్రవర్తి కాలంలో వలె పరస్పరం మైత్రి పాటించారు. వీరిలో అర్ధాంశము యితర రాజులు కాపయకు సహకరించినా, నాయక సమాఖ్య వలె పరిశుద్ధాంతరంగులై నడిచినా భారత జాతీయ జీవనం ఎంతో సౌఖ్యప్రదమై వుండేది. ప్రజలీ కష్టాలనుభవించేవారు కారు.

వీర భల్లాళుడు హరిహరరాయలు. వినాయకదేవుడు - వీరి మరణాలతో కాపయ అశక్తుడయినాడు. మరల మహమ్మద్‌షా దండెత్తి వచ్చినప్పుడు కాపయ ప్రతిఘటించలేకపోయినాడు. ఎక్కువ మొత్తం సుంకం చెల్లించి గోల్కొండ నాతని వశము చేసి సంధి చేసుకొన్నాడు. తన పచ్చల సింహాసనము సహితము మహమ్మద్‌షాకు సమర్పింపవలసినవాడయ్యెను. గోల్కొండ సరిహద్దుగా నిర్ణయించబడినది. సామాన్య ప్రజలను యుద్ధ ఖైదీలను చంపకుండునట్లు ఒప్పందము చేసుకొన్నాడు. మహమ్మద్ షా తన జీవిత పర్యంతం ఈ ఒప్పందాన్ని గౌరవించాడు.

సింగమనాయకుని కుమారులగు అనపోతానాయకుడు, మాదానాయకుడు అధికారవాంఛతో కన్నులు మూసుకుపోయి కాపయతో అతని సహచరులతో విభేదించి దేశ స్వాతంత్ర్యాన్ని ఐక్యమును విస్మరించారు. అమరావతిపై క్రీ.శ. 1361లో దాడిచేసి అనపోతారెడ్డిని ఓడించి చంపారు. అప్పట్లో కాపయ సైన్య సహాయము అనపోతారెడ్డికి అందుటవలన అతని రాజ్యమును స్వాధీనము చేసుకొనలేక వెనుదిరిగారు. అనపోతానాయకుడు కాపయపై ద్వేషం పెంచుకొన్నాడు. అనపోతారెడ్డి సోదరుడు అనవేమారెడ్డి కుమారుడు కుమారగిరిరెడ్డి కాపయ సహాయమర్థించారు. కాపయ అనవేమారెడ్డికి సాయపడ్డాడు.

బహమనీ సుల్తానుతో లాలూచీపడిన నాయకులతో కాపయ జరిపిన పోరాటాలు వారి అంతర్గత వైషమ్యాలనే తలచబడినవి. మతధార్మిక అభిమానాలను విశ్వాసాలను ప్రజలలో కలిగించలేకపోయినవి. సైనికబలము కొలదిమంది సహచరులను నమ్మి అతడీ యుద్ధములు చేయవలసి వచ్చినది. వినాయకదేవుని మరణానంతరము విజయనగర బుక్కరాయలు సహితం ఢిల్లీ సుల్తాను సహకారమర్థించుట కాపయను మరింత క్రుంగదీసింది.

కాపయ కత్యంత అభిమాన పాత్రమగు వరంగల్లు సమీపంలోని "భీమవరం' వద్ద క్రీ.శ. 1367లో రేచర్ల వారితో యుద్ధం జరిగింది. అదృష్టదేవత శత్రువులను వరించింది. కాపయ రణరంగంలో వీరమరణం చెందాడు. క్రీ.శ. 1325-26 నాటి మల్లవరం. సంతమాగులూరు శాసనాలవలన ప్రోలయ వేమారెడ్డి సోదరుడగు మల్లారెడ్డి కాపయ్యకు అత్యంత ఆత్మీయుడని తెలుస్తుంది. ఇందువలననే సింగమనాయకుడు అతని కుమారులు అమరావతిపై దాడిచేసినప్పుడు కాపయ వారితో యుద్ధంచేశాడు.

నాయక సమాఖ్యనుండి మొదట వైదొలిగినవాడు "ఏరువ భక్తిరాజు." అతి బలహీనుడగు భక్తిరాజు రాజమండ్రి ప్రతినిధియగు. "ముమ్మడిరాజు"ను చంపాడు. ఇది ఊతగా తీసుకొని సింగమనాయకుడు కాపయ నెదిరించగలిగాడు. అదృష్టవశాత్తు సింగమనాయకుడు గెలిచాడు. ఈ గెలుపుతో "ఆంధ్రదేశాధీశ్వర" ఆంధ్రాధ్యక్ష. అను కాపయ బిరుదులు తాను ధరించాడు.

ఇది ఎంత రిత్త విజయము! దశాబ్దాలుగా బహమనీ సుల్తానులతో లాలూచీపడిన సింగమ నాయకుని కుమారుడు అనపోతానాయకుడు వరంగల్లుకు రాజైనాడు. బహమనీ సుల్తాను సార్వభౌమాధికారాన్ని తలదాల్చాడు.

శతాధిక దుర్గాధ్యక్షుడగు కాపయ ఓటమి మరణములు ఆతని కుటుంబమునకే కాక ఆంధ్రావనికి తీరని నష్టం కలిగించినవి. ముస్లింలు ఆంధ్రదేశానికి సర్వాధికారులయినారు.

గూఢచారి కృత్యాలకు పాల్పడుతూ, తిరుగుబాట్లు చేస్తూ, నాయక సమాఖ్యకు విధేయులగు అనపోతారెడ్డి వంటి వారిపై యుద్ధాలు చేస్తూ శాంతి భగ్నం చేస్తున్న వారినణచివేసి ఆంధ్రలో సుస్థిరత నెలకొల్పటం కాపయ వుద్దేశ్యం కావచ్చును.. యుద్ధ పరిణామాలు అతని అంచనాలను తలక్రిందులు చేసినవి. ప్రోలయ తాను సహచరులు మూడు దశాబ్దాలు అవిశ్రాంతంగా పోరాడి కడగండ్లు అనుభవించి సాధించిన జాతీయ ఐక్యత తన కన్నులముందే భగ్నం కావటం కాపయ సహించలేకపోయాడు. స్వార్ధంతో దేశభక్తి హీనులయి తిరుగుబాట్లకు దిగిన నాయకుల వైఖరి కాపయను క్రుంగదీసింది. ఈ కుట్రలను అణచటానికి వృద్ధాప్యాన్ని లెక్కచెయలేదు. మరణించుటకు వెనుకాడలేదు. ఈ యుద్ధం కాపయకు గానీ రేచర్ల వారికి గానీ ఏవిధంగానూ ఉపకరించలేదు. బహమనీ సుల్తానుకు, తదనంతరపు ముస్లిం పాలకులకు యావదాంధ్ర దేశంపై అదికారం కట్టబెట్టింది. కాపయ పరాజయం తర్వాత బహమనీ పాలకులు వారివారసులగు

గోల్కొండ, బీదరు, అహమ్మద్ నగర్, గుల్బర్గా పాలకులు రెండు శతాబ్దాలు విజయనగర రాజులతో యుద్ధాలు చేశారు. తుదిగా క్రీ.శ. 1565 తళ్ళికోట యుద్ధంతో విజయనగర సామ్రాజ్యం పతనమయింది.

దుర్జయ వంశస్థులు విప్లవ నిర్మాతలు వీరులు అయిన కాకతీయ నాయకుల పాలన ఆవిధంగా అంతమయింది. కరికాళచోళుని వారసత్వంతో కీర్తిమంతమయిన ఆంధ్రకిసానుల కాకతీయ తెగకు గ్రహణం పట్టింది.

కాకతీయులు రాజనీతి, దేశభక్తి వీరత్వ వివేక సౌరబాలు ఆత్మబలిదాన సంఘర్షణాగేయాలై, జాతీయ స్వాతంత్ర్యము ధర్మము స్వేచ్ఛలను జాతికందించినవి.

క్రీ.శ. 1323 నుండి 1373 వరకు హైందవ జాతి విముక్తికి ఉన్నతికినై సాగిన పోరాటాలు రాచరికపాలన ఫ్యూడల్ అధికారాలు మత దౌష్ట్యాలపై ధర్మాధిక్యంను చాటిచెప్పినవి.

దక్షిణభారత ప్రజారక్షణ విప్లవ పోరాట కాకతీయ ఛత్రం, కాపయచేతి నుండి గాలికెగిరిపోయినా, ఉన్నత సందేశము మైత్రీబద్ధత గల విజయనగర రాజుల, లెంకల దృఢతర బాహువులకు చిక్కి రెండు శతాబ్దాలు మరల దక్షిణా పథానికి నీడనిచ్చింది.

దేశభక్తి ఉన్నత రాజకీయ విలువలు, వీరత్వము ధర్మతత్పరత గల ప్రోలయ కాపయ వినాయకదేవుడు హరిహరరాయలు బుక్కరాయలు భల్లాళుల వాల్లభ్యము దొరుకుట దక్షిణాపథపు అదృష్టము.

మూడవ భల్లాళుని దారుణ మరణం తరువాత ఆతని కుమారుడు నాల్గవ భల్లాళునికి విజయనగర రాజులు ఆంధ్రనాయకులు అండగానిలిచి పోరాడారు. నాల్గవ భల్లాళుడు కర్ణాటకనంతా ఏకం చేశాడు. వినాయకదేవుని మరణం కాళేశ్ గోల్కొండలు చేజారటం కాపయను క్రుంగదీసాయి. దక్షిణభారత రక్షణాభారం విజయనగరం రాజుల భుజస్కంధాలపై పడింది. మధుర, బహమనీ సుల్తానులను వీరదుపులో వుంచారు. కాపయమరణం తరువాత అయిదు సంవత్సరాలకే బుక్కరాయలు సార్వభౌముడయినాడు. "సురత్రాణ" బిరుదు వహించాడు. కాపయ వారసులగు తెలుగు నాయకులు, నాల్గవ భల్లాళుడు. కర్ణాటక, తమిళనాయకులు బుక్కరాయలకు సహకరించారు. భారతీయ సాంస్కృతిక వారసత్వం రాజకీయ సమైక్యములను

అర్ధశతాబ్దం కాకతీయ నాయకులు కాపాడారు. తదనంతరం రెండు శతాబ్దాలు కాకతీయ నాయకులు విజయనగరరాజుల నీడ నుండి పరిరక్షించారు.

**కాపయ వారసులు :**

కాపయ కుమారులలో ఒకరు ప్రోలయ నాయకుడు. కాకతి ప్రోలరాజు ముసునూరి ప్రోలయలపేరీతనికి పెట్టుకొన్నారు. చోడయువరాణి చోడమాంబ ఈతని భార్య. నామయ్య, కొప్పులయ్య (కొప్పులభూపతి) వీరికుమారులు. నేడున్న ఈ కొప్పుల వెలమలు ఈ కొప్పులయ్య సంప్రదాయాన్ని పాటించిన వారై యుందురు. కొప్పులయ్య భార్య ముప్పాదేవి. ఈమె "ముప్పనేని" యింటివారి ఆడపడచు. కొప్పులయ్య కుమారుడు రెండవ ప్రోలనాయకుడు. కాపయ మరణానంతరం వరంగల్లు అనపోతానాయకుని వశమైన తరువాత రెండవ ప్రోలానాయకుడు అతని అనుచరులు గోదావరి ఉత్తరతీరాన ఏలేరు నుండి శ్రీకాకుళం మధ్య ప్రాంతాల నాక్రమించి పరిపాలించారు. ఆంధ్ర ప్రజాహృదయాధి నేతలం తామే అని చాటిచెప్పటానికి ఈ కొత్తరాజ్యాన్ని "ఆంధ్రఖండ మండలము" అని పిలుచుకొన్నారు. వరంగల్లు చేజారిపోయినా ఆంధ్ర తీరప్రాంతముల ఆధిపత్యము కాకతీయ వారసులకు మిగిలింది. ఈ చారిత్రక సత్యాలను దోనేపూడి, రాజమండ్రి, సింహాచలం శాసనాలు తెలియచేస్తున్నవి. స్థానిక నాయకులు స్వతంత్రులయిన పిదప గోదావరీ తీర మహామండలాల్లో మాత్రమే వారి రాజ్యాధికారం సాగింది. ఏలేరు ఉత్తర ప్రాంతాన పిఠాపురం మాత్రం వారి రాజధానిగా మిగిలింది. అనపోతానాయకుడు అన్నయ మంత్రుల మార్గాన్నే నడచి రెడ్డి ప్రభువులు తీరాంధ్రానికి మహామండలేశ్వరులయ్యారు. కళింగ గజపతులు, రాజమండ్రి, కొండవీటి రెడ్లు అనపోతానాయకుని పాలనలోని ప్రాంతాలను తమ రాజ్యంలో కలుపుకొన్నారు.

14వ శతాబ్దానికి నాయకరాజులు మండలేశ్వరులుగా మిగిలారు. వీరి వారసులు కొత్రపాటి కమ్మవారుగా, కొప్పులకమ్మవారిగా, మరికొందరు కొప్పులతెగల వారిగా ప్రసిద్ధిచెందారు. కొప్పుల తెగల నుండి కొందరు కాలమున కెదురీదలేక ముస్లింలకు జడిసి బహమనీ సుల్తానులతో సఖ్యం పాటించారు. వెలమవారినాశ్రయించి కొప్పుల వెలమలుగా శ్రీకాకుళం విశాఖ కళింగ ప్రాంతముల స్థిరపడ్డారు.

కాపయ బంధువగు ముమ్మడి నాయకుడు కోరుకొండ దుర్గాన్ని నిర్మించాడు. కాపయ వేరొక బంధువు తొయ్యేటి అనపోతానాయకుడు రాజమండ్రిని క్రీ.శ. 1353

వరకు పాలించాడు. రాజమండ్రి ఆధిపత్యం "ముమ్మడి" వంశానికి వచ్చింది. బహుశా నేటి ముమ్మడివరం వారిపేర కట్టబడి వుంటుంది. ఈతని సోదరుడు సింగమనాయకుడు ప్రతిభాశాలి. వీరి వారసులు దాయాదులు కుమారులు 14వ శతాబ్దం వరకు రెడ్డిరాజుల ప్రాపకంలో నాయకులుగా వున్నారు.

## హైందవ రక్షణ :

క్రీ.శ. 1372లో పాతభీమవరం యుద్ధంలో కాపయను రేచర్ల వారు జయించారు. సింగమనీడు "ఆంధ్రదేశాధీశ్వర" అని బిరుదు ధరించాడు. తమ అధికార సుస్థిరత కొరకు రేచర్లవారు కొండవీటి, రాజమండ్రి రెడ్డిరాజులతోనూ, విజయనగర రాజులతోనూ యుద్ధాలు చేశారు. ఈ పోరాటాలన్నిటిలో రేచర్ల వారికి నవాబుల సహకారముంది. రేచర్లవారు రెండవ దేవరాయలకు, గుల్బర్గా నవాబుకు వ్యతిరేకంగా సహకారమందించారు. ఈ కారణాన దశాబ్దాల వీరిమైత్రిని అహమ్మద్‌షా వదిలిపెట్టాడు. ఈ నాయక కుటుంబాలు మరల బహమనీ సుల్తానును ఆశ్రయించినా, అతడు వీరిని నమ్మక తెలంగాణాపై దాడిచేసి నాయకుని చంపి వరంగల్లును బహమనీ సామ్రాజ్యంలో కలుపుకొని వెలమవారిని సామాన్య భూస్వాములుగా మిగిల్చాడు.

నాయక సమాఖ్య సాధించిన స్వతంత్ర హిందూ సామ్రాజ్యం, దాని రాజధాని వరంగల్లు, ఆ తర్వాత ఆవిర్భవించిన నాయంకరము లేక వెలమసామ్రాజ్యం క్రీ.శ. 1425లో నశించిపోయింది.

కాపయ వలెనే సింగమనాయకుడు కూడా 1364లో సుల్తాను మహమ్మద్‌షాతో హైందవ మత రక్షణకు ఒప్పందము చేసుకొని ఉంటాడు. అందువలననే కాపయ మరణం, వరంగల్లు పతనం, వెలమరాజుల, రెడ్డిరాజుల, గజపతుల యుద్ధాలు, ఎంతో చరిత్ర నడిచినా, హిందూదేవాలయాలు మతారాధనా విధులు గౌరవించబడినవని చెప్పవచ్చు.

తెలగ, రెడ్డి, బోయ నాయకులలో అధికులు వెలమల ధోరణి నచ్చక, సుల్తానుకు లొంగియుండలేక, ఆంధ్రదేశం వదిలి విజయనగరం చేరారు. అద్దంకి, కొండవీడు రెడ్డి నాయకులు, తమ నాయంకరాల రక్షణకై వరంగల్లు వెలమ నాయకులతో పోరాటాలు చేస్తూ దేశంలోనే నిలిచారు.

శతాబ్దకాలం రెడ్డిరాజులు తీరాంధ్రాన ముస్లింపాలనకు చోటివ్వక తాము పాలించారు. **ముస్లింలు - వరంగల్లు** నాయకుల కలయిక **తెలంగాణా** ఆధిపత్యంతోనే తృప్తిపడవలసి వచ్చింది.

ఫ్యూడల్ రాజకీయాలతో, కటకం కళింగ గజపతుల, కొండవీటి రాజమండ్రి రెడ్డిరాజుల, విజయనగర రాజుల యుద్ధాలతో, ప్రజాసంక్షేమం, అభ్యుదయం, రాజకీయ స్థిరత్వం వెనకబడినవి.

ప్రోలయ కాపయల స్ఫూర్తి ఇతర నాయకుల ఆత్మస్థైర్యానికి ప్రోదియై రేచర్ల నాయకులను నిరాకరింపజేసినది. ప్రోలయ కాపయ ఉద్యమవారసులు. విజయనగరరాజుల విజయాలకై పాటుపడ్డారు. వీరి వారసత్వం తరతరాలకు మార్గదర్శకమయినదనుటకు ఈ క్రింది చారిత్రక సంఘటనే తార్కాణం. ఈ సంఘటన శ్రీ కె.ఎల్. నారాయణ గారు తన "సాయపనేని నాయకుల" చరిత్రలో ఉదహరించారు.

"అక్బరు చక్రవర్తి తన సార్వభౌమత్వ మంగీకరింపవలసినదిగా సందేశము పంపగా, హిందూనాయకమణియగు వెంకటరాయలు **(1585-1614)** ఈ ప్రత్యుత్తర మిచ్చాడు. "ఈ నా సామ్రాజ్యము భగవద్దత్తము. నాకీ రాజ్యము లేకుండా చేయు సంకల్పమా భగవంతునకు అభిలషణీయ మయినప్పుడు ఆసంకల్పమడ్డుకొనగల వారెవరు? ఇది మాత్రము సత్యము. అక్బరు ఇచటకు వచ్చినను నేనాతని పాదములంటను. యుద్ధ మనివార్యము."

ప్రజారక్షణ బాధ్యతలో నాయకుల దీక్ష. త్యాగనిరతి జపాను దేశస్థుల "హరాకిరి' సంప్రదాయాన్ని గుర్తుకు తెస్తుంది.

"దద్దనాల నాయంకర ప్రభువగు చినవేంకటాద్రినాయని పరోక్షంలో హైదరాబాదు నిజాం ఉల్‌ముల్క్ అమీర్ మీర్ ఫజులుల్లా అతని పట్టణం నాశనం చేసి కొల్లగొట్టాడు. నాయడు తిరిగివచ్చి తన పట్టణమునకు పట్టిన గతిని, మరణించిన తన సైన్యమును, బంధువులను, సన్నిహితులను చూచి, వారికై పోరాడి, వారితోపాటు వీరమరణము చెందు అదృష్టము కలుగనందుకు విచారించి, ఖిన్నుడై వారల ఆత్మశాంతికి ప్రార్థనలు సలిపి తన్ను తాను కత్తితో పొడుచుకొని మరణించాడు." (Sri K. L. Narayana History of Sayapaneni Nayaks)

నాయకవీరుల ప్రవర్తనలోని వైవిధ్యం పరిశీలిద్దాం. ముస్లింల దాడులకు వెలమనాయకులు తలవంచక తప్పలేదు. అయినా వీరు హిందువులకు, మతానికి కొంతవరకు రక్షణ కల్పించారు. వీరిపాలనలో బ్రాహ్మణ, అబ్రాహ్మణ హైందవ పూజారులు తమ పూజావిధులు కొనసాగించగలిగారు. మతాంతీకరణలంతగా కనపడవు. స్థానిక స్వపరిపాలనలో విదేశీయుల జోక్యం అంతగా కనరాదు.

హైందవ మత స్వాతంత్ర్య రక్షణ బలవంతులగు విజయనగర రాజుల వలన కావచ్చును. వెలమనాయకులు కొలదిమంది రెడ్లు కమ్మవారు తెలగవారు వారి సహచరులగు మున్నూరుకాపులు, బలిజలు, రెడ్లు, కమ్మ, ముత్తరాజు మరియు గ్రామ పెత్తందార్లు అనగా రెడ్డి, కాపు, చెట్టి, చౌదరి వర్గముల వారు నిరంతరం తమ స్వాతంత్ర్యాన్ని హిందూ జీవన విధానాన్ని శాంతియుతంగా అవసరమయితే ప్రాణాలకు తెగించి వేయికన్నులతో కాపాడుకోవటం ముస్లింల మతాధిక్య ప్రవాహానికి అడ్డుకట్టగా నిలిచింది. నిజాం కాలంలో మతసహనం వుంటానికి వేరుకారణం కనపడదు. తానీషా తన (క్రీ.శ. 1658-87) పాలనలో భద్రాచల రామచంద్ర దేవాలయ రక్షణ బాధ్యతలను స్వీకరించాడు.

దౌలతాబాద్ నుండి దక్షిణ భారతం వరకు కన్పించిన మత సామరస్యం ఒక్క రాజస్థాన్ మినహా ఉత్తరభారతంలో కన్పించదు. ఉత్తర భారతదేశ పురాతనదేవాలయాలు విధ్వంసమయినవి. కొన్ని నిర్లక్ష్యము చేయబడ్డవి. కొన్ని పాడుబడినవి. కొత్తవి నిర్మించుట కనుమతి లేదు. బెనారస్ (వారణాసి)లోని ప్రసిద్ధ దేవాలయాలు మసీదులుగా మార్చబడినవి. గోల్కొండ బహమనీ సుల్తానుల మతసామరస్యం సాకుగా తీసుకొని ఔరంగజేబు వారిపై దండెత్తాడు. ఈ సామరస్య సాధన (గోల్కొండ - బహమనీ సుల్తానుల) విజయనగరరాజులు సాధించినంత ఘనమయినది కాకపోయినా ఇది ఆంధ్ర తెలంగాణా నాయకుల విజయంగా భావించవచ్చు.

# 13. కాకతీయ నాయకుల వారసత్వం

నాయక సమాఖ్య విచ్ఛిత్తితో ఎక్కువమంది వెలమనాయకులు, హిందూ మత రక్షణకు, తమ స్వప్రయోజనాలు కాపాడుకోవటానికి గత్యంతరం లేక ముస్లింలకు తలవంచారు. కోస్తా, మధ్య తెలంగాణాలలో మహమ్మదీయ, ఫ్రెంచి, ఇంగ్లీషు వారి పాలనలో వెలమ భూస్వాములు ఆరు శతాబ్దాలు నిలువగలిగారు. పెక్కుమంది కళింగదేశం వెళ్ళి గజపతులతో కలిశారు. వారిపతనం తర్వాత ముస్లింలచే, బ్రిటీషువారిచే అణచివేయబడి కొప్పులవెలమలుగా మిగిలారు. మొదట కృష్ణానది ఉభయ పార్శ్వాలు, తరువాత గోదావరి తీర ప్రాంతాన రెడ్డి నాయకులు, అద్దంకి కొండవీడు రాజమండ్రిలను తమ రాజధానులు చేసుకొని శతాబ్దికాలమెన్నో యొడిదొడుకుల కోర్చి గోల్కొండ బహమనీ సుల్తానులకు కప్పం చెల్లిస్తూ తిరుగుబాట్లు చేస్తూ సామంతులుగా స్వతంత్రులుగా తమ స్వతంత్రతను నిలుపుకొన్నారు.

ప్రతాపరుద్రుని సోదరుడగు అమ్మయదేవుననుసరించి కొందరు బస్తరు, జైపూరు అడవులు కొండలు లోయలకు తరలివెళ్ళారు. పవిత్ర పంపానదీ జలాలు, ఎత్తైన పీఠభూములు అగమ్యములగు లోయలు దట్టమయిన అడవులు కల తూర్పుకనుమలలో చిత్రకూటం రాజధానిగా బస్తరు రాజ్యం స్థాపించారు. బ్రిటీషువారు సహితం బస్తరును లొంగదీయలేక పరిమిత స్వేచ్ఛాధికారములు గల స్వతంత్రరాజ్యంగా గుర్తించారు. శబరివంశజులగు శబర లేక సవరలు మరియలతో వీరు భ్రాతృభావంతో మెలిగారు. బస్తరురాజులు తాము కాకతీయులమనే చెప్పుకొన్నారు.

కొందరు నాయకులు, ఆయుధ జీవనము, ఫ్యూడల్ అధికారాలు, వదలి వ్యవసాయదారులై వ్యవసాయాభివృద్ధికి కృషిచేశారు.

నాటి ముస్లిం పాలకులు కాకతీయవీరులను వెంటాడి వేధించినా తమ సంప్రదాయాలను వీరు వదలలేదు. "చిర" "బలిగుడు" "కోతి" కొమ్మచ్చులు" (గెరిల్లా సాంప్రదాయాలు మొదలగు ఆటలు) - వీరపూజ. ఆయుధపూజలను కొనసాగించారు. రాజాభరణాలు ధరిస్తూ (రాయిడి లేక రాయణింగార్లు) వివాహిత కుమార్తెలకు బంగారు శిరోభూషలు బహుకరిస్తూ, రాజలాంఛనాలగు బంగారు కిరీటాలను ప్రదర్శిస్తూ వుండేవారు. పెండ్లికొడుకులు పవిత్ర ఖడ్గధారణ చేసేవారు. శుభ సందర్భములలో భుజకీర్తులు

సందెతాయెతులు ధరించుట, దూరప్రయాణములకు మట్టికుండ తీసుకొనిపోవుట (వివాహ సందర్భమున గరికెబుడ్డి-ఐరేని అరివేణి కుండలు) కాకతీయ నాయకుల ఆచారాలుగా నేటికీ మిగిలినవి. వారి కుటుంబాలు శాఖోపశాఖలయినవి.

ముస్లింపాలన తట్టుకొని కష్ట నిష్టూరాల నోర్చి శతాబ్దాలుగా కమ్మవారు తమ కాకతీయ వారసత్వం ప్రకటించుకొన్నారు.

తెలుగువారు, మున్నూరుకాపులు, తెలగవారు, ఆదివెలమ, బలిజ, చెట్టిబలిజ గాజులబలిజ, గానుగబలిజ, తెలిక, పెరిక, ముత్తరాజు లేక ముదిరాజు లేక ముత్రాసు, వెలమ రెడ్డి తెగలుగా పిలువబడ్డాడు. ముస్లిం పాలకుల ప్రతీకారేచ్ఛకు జడిసి కొందరు అధికారాలపై ఆశలు వదిలారు. తమ వీరలక్షణాలకు గుర్తులుగా శిరోజాలను కొప్పులుగా తీర్చుకొని వెలమమండలేశ్వరుల రక్షణలో ఒదిగియుండి గౌరవెలమలు కొప్పుల వెలమలుగా విశాఖపట్టణం శ్రీకాకుళం జిల్లాలలో నివాసమున్నారు. కొందరు గ్రామపెత్తందార్లగు రెడ్లు, గోదావరికి ఉత్తరాన కొండలలో నివాసమేర్పరుచుకొని కొండదొరలు కొండరెడ్లుగా పిలువబడి బ్రిటీషువారిచే "ముఠాదార్లు"గా ముద్రవేయ బడినారు.

సముద్ర ప్రాంతముల చిత్తడి భూములకు కొందరు వెళ్ళారు. వారు సముద్రయానం చేపలవేట వృత్తులుగా వ్యవసాయం ఉపవృత్తిగా స్వీకరించి, పల్లెవారు, పులగపురెడ్లుగా పిలువబడ్డారు. కొలదిమంది ముస్లింల వేధింపులు లెక్కచేయక తమ వారసత్వమును మరుగుపడనీయక కాలమున కెదురీది నిలచి కమ్మకాపులుగా ప్రసిద్ధి గాంచారు.

హరిహరరాయల బుక్కరాయ విద్యారణ్యుల నూతన హిందూ నాయకత్వ మపేక్షించి ఎందరో విజయనగరం వలసవెళ్ళారు. కమ్మ, రెడ్డి, బోయ, బలిజ నాయకులు అచ్చటి నాయంకరము లంగీకరించి హంపి విజయనగరకోటల నిర్మాణానికి సహకరించారు. గంగయసాహిణి, అంబదేవ, త్రిపురారి దేవులు తమ విశాల భూభాగాలను, గంగినేనికొండ, గండికోటలను ఈ నూతన హిందూ సామ్రాజ్యంతో అనుసంధానం చేసుకొన్నారు. విజయనగరంతో ద్వార సముద్రం హొయసలులు మైత్రితో మెలిగినవి. ఇది కాపయ ముందుచూపు ఫలితం. వరంగల్లు నగరం మరల ముస్లింల అధీనమయినా విజయనగరమును విజయ నగర సామ్రాజ్యంగా తీర్చిదిద్దినది - ఆంధ్ర, కన్నడ చోడ నాయకులే.

కంచి, మధుర చోళులకు, కాకతీయులతో గల మైత్రి, నాల్గవ భల్లాళునికి రాయలతో గల సాన్నిహిత్యం వలన విజయనగర రాజులు సరిహద్దులలో వున్న చోళ సామ్రాజ్యంలో తేలికగా నిలదొక్కుకొన్నారు. అలసటెరుగని కమ్మ, రెడ్డి, తెలగ, చోడ నాయకులు తమిళనాడు, కోలారు, మైసూరు సరిహద్దు మండలాలకు విస్తరించి మండలేశ్వరులయినారు. క్రీ.శ. 15-16 శతాబ్దాలలో వారు కంచి, చెంజి, వెల్లూరు, తంజావూరు, మధుర, తిరుచినాపల్లి మొదలగు ప్రాంతాలతో ప్రఖ్యాతి గాంచిన నాయక సామ్రాజ్యాలు స్థాపించారు. భారతీయ ధర్మము సంస్కృతీ వికాసములపై గల మక్కువ, నిర్మాణాత్మక కృషి యుద్ధ నైపుణ్యముల వలన ఖ్యాతి గడించారు.

వీరికి గల వ్యవసాయ వ్యసనం జగత్ప్రసిద్ధం. అడవులు నరికించి జలవనరులభివృద్ధిచేసి గ్రామాలు నిర్మించి గ్రామీణ సంస్కృతిని గ్రామీణ వృత్తులను అభివృద్ధి చేశారు. ఆధునిక పద్ధతులను, వ్యవసాయంలో, పశుపోషణలో ప్రవేశపెట్టారు. విత్తనాలు నాగలితో ఎదబెట్టటం, మిశ్రమ పంటలు పండించటం, ఒకటికన్నా ఎక్కువసార్లు పండించటం (పునాస - పైర పంటలు - మాగాణిలో ముక్కారు పంట) రాయలసీమలో ఆచరణలో వుంది. కళలనాదరించారు. వలసవచ్చిన చేతివృత్తుల వారికి ముఖ్యంగా గ్రామీణ వృత్తులకు చేనేతవారికి ఆశ్రయం కల్పించారు. చోళదేవాలయాల నభివృద్ధిపరచారు. మధుర కంచి తంజావూరు తిరుచినాపల్లి హాళేబీడు మేలుకోట్టై బేలూరులలో దేవాలయాలు నిర్మించారు. స్థానిక ప్రజల సాంస్కృతిక వారసత్వము ధార్మిక సంప్రదాయాలను రంగరించి తమిళనాడు కర్ణాటక దేశములలో గౌరవప్రదము చిరస్మరణీయమునగు గ్రామీణ సమాజాన్నుద్ధరించి వారికి ప్రేమాస్పదులయ్యారు.

ముస్లిం పాలనలో తీరప్రాంతపు కోటలపై వీరు ఆధిపత్యము స్వీకరించ లేదు. ముస్లింలకు అణగిమణగి వుండలేదు. ముస్లిం పాలకులను వారి విధేయులను నిరసించి వారికి దూరమయ్యారు. వారి తిరుగుబాటు ధోరణులు ఢిల్లీ బహమనీ సుల్తానుల పట్ల వారికి కల ద్వేషము జగద్విదితము. కావున వారికి అధికారములు ముస్లింలీయరని తెలుసు. కమ్మ, రెడ్డి, బలిజ శాఖలవారు ఆంధ్ర సురత్రాణుడగు కాపయతో తమ గర్వకారణమగు సాహచర్యము బాంధవ్యముల స్మరించుకొనుటకై తమ్ముతాము కాపులమని పిల్చుకొన్నారు.

ప్రతాపరుద్రుని నాయకత్వమున జరిగిన ఏడు యుద్ధములలో మరల 1323-1385 మధ్యకాలంలో ఢిల్లీ సుల్తానులతో జరిగిన రెండు యుద్ధములతో రెండు

దశాబ్దములు పైబడ్ జాతీయ స్వాతంత్ర్య పాలనలో నాయకులందించిన సేవలు త్యాగాలకుగాను వీరిని "నేని లేక నాయక, నీడు రాయుడు కాపు లేక నాయుడు నీడు లేక రెడ్డి, మున్నూరు కాపులు అని జాతి గుర్తించి గౌరవించింది. తెలగ, రెడ్డి, కమ్మవారిని కాపులుగా పేర్కొన్నారు. వీరిలో స్థానిక పెద్దలను పెద్దకాపుగా పిలువసాగారు. భారత ధర్మప్రతీకలుగా వెలసిన కాకతిదేవి విజయనగర భువనేశ్వరీమాతల పాదపీఠాలచెంత వారు గావించిన అనుపమానమయిన త్యాగాలు అనుభవించిన క్లేశాలు ప్రదర్శించిన పరాక్రమాలు కోల్పోయిన ప్రాణాలు శైవ, వైష్ణవ ధర్మముల మేళవింపుతో జాతికి క్రమశిక్షణ నేర్పినవి. కవులీ నాయకుల, మండలేశ్వరుల వీరగాథలు పద్యాలుగా పాటలుగా గానం చేశారు. తమ పూర్వులగు ప్రోలయ కాపయ విజయనగర రాజుల వీరకథాగానాలతో వివిధ తెగల కాకతీయ నాయక కుటుంబాలవారు స్ఫూర్తినీ ఉత్తేజాన్ని పొందుతున్నారు.

దుర్గ వెంట దుర్గాన్ని రక్షించుకొంటూ, యుద్ధం తర్వాత యుద్ధంలో పాల్గొంటూ, దీర్ఘకాలం నాయకవీరులు చూపిన తెగువ, అకుంఠిత దీక్షలు, సమకాలీన ప్రజా హృదయాంతరాళాల్లో భావోద్రేకాలు నింపి, నాటి వీరులకు వీరత్వానికి, వీరతర్పణాలందించే సంప్రదాయానికి కారణమయింది. ఈ వీరపూజను ప్రతిరైతు ప్రతి అడవిబిడ్డ ప్రతి దళితుడు, తమతమ గృహాల్లో పాటించారు. వినయవంతులగు తమ బిడ్డలకు కాపయ ఆదర్శాలను దేశభక్తి విలువలను ప్రతిమాతృమూర్తి ఉగ్గుపాలలో రంగరించి పట్టింది. కాపయవలె కాపుగా ధర్మరక్షకునిగా స్వాతంత్ర్య పరిరక్షకునిగా తీర్చిదిద్దినది.

ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రలలోని కాకతీయ కిసానులు కవి గాయక వైతాళికుల వీరకథాగానంతో స్ఫూర్తిని సమధికోత్సాహాన్ని సంతరించుకొంటూ, సాటిలేని మేటి దేశభక్తి సాహసాలు ప్రదర్శించిన తమ పూర్వులగు నాయకులకు పోటాపోటీగా తమ శాఖల వీరుల ఘనమయిన వారసత్వాన్ని కీర్తించేవారు. ఇతరులీ కుటుంబం పట్ల గౌరవం భక్తి తత్పరతతో మెలిగేవారు.

రాష్ట్రకూట చోళ చాళుక్య పల్లవ కాకతీయ నాయకులు ధైర్యసాహసాలతో ఈ భరతవర్ష స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, రైతుస్వామ్యానికి, పంచాయితీ వ్యవస్థకు శ్రేణీ (చేతివృత్తుల సంఘాలు) విధానాలకై చేసిన త్యాగాలను చెల్లించిన మూల్యాలను శతాబ్దాలుగా తమ సంప్రదాయాచరణలతో నూతనోత్సాహంతో స్మరించే ఈ కుటుంబాలవారెంతో ధన్యులు. అభినందనీయులు.

చోళుల చాళుక్యుల కాలపు రైతుస్వామ్యాన్ని గ్రామీణ పంచాయతులను శ్రేణీ నిర్మాణాలను కాకతీయులు సువ్యవస్థితం కావించారు. విజయనగరరాజులీ వ్యవస్థను మరింతగా ఆదరించారు. ముస్లింలు బ్రిటీషువారు ఈ వ్యవస్థను బలహీనపరచే యత్నాలు చేశారు. హైదారాబాద్ నవాబులు తమ ఆశ్రితుల లబ్ధికోసం ప్రోత్సహించిన భూస్వామ్య వ్యవస్థకు బదులుగా 19వ శతాబ్దంలో సర్ థామస్ మన్రో రైతుస్వామ్యాన్ని మరల ప్రతిష్టించాడు.

స్వయం ఉపాధిపరులగు రైతులు చేతివృత్తులవారు ఈ రైతుస్వామ్యానికి ప్రాణం. తరతరాల సంప్రదాయక మార్గదర్శక సూత్రాల ఆధారంతో గ్రామ పంచాయితీలు వీరిపై అజమాయిషీ చేసేవి. గ్రామ పంచాయతీలకు రాజు రక్షణ వుండేది. అడవులు నరికించటం, సేద్య యోగ్యమయిన భూమిని రైతులకు పంచటం వంటి అధికారాలు పంచాయితీలకుండేవి. పొలాలకొలత, శిస్తు నిర్ణయం, ప్రభుత్వ వాటాలపై పంచాయతీలకు స్పష్టమయిన అధికారాలుండేవి. పంటపండనప్పుడు కొత్తసాగుకు శిస్తు మినహాయింపుల అధికారం పంచాయితీలకే దత్తం చేయబడింది.

రైతుల భూములపై రాజులకేనాడూ యాజమాన్యపు హక్కులు లేవు. రైతుకు నష్టపరిహారం చెల్లించక పంచాయితీ అనుమతి పొందక రాజు లేనాడూ ఒకరి భూములను వేరొకరికి కేటాయించేవారు కాదు.

వివిధ శ్రేణీ వర్గాలకు ఈ హక్కులు అధికారాలు వుండేవి. భూములు వ్యవసాయపనిముట్లు చేతివృత్తులపై తమకుగల ప్రాథమిక హక్కులను గ్రామీణులు శతాబ్దాల పర్యంతం కాపాడుకొన్నారు. అనుభవించారు.

ప్రతాపరుద్రుడు బందీ అయినాడు. నాయక విధానము నామమాత్రమయింది. ఢిల్లీవారి పెత్తనం మితిమీరింది. ఈ పరిస్థితులలో గ్రామీణులు వ్యవసాయం చేతివృత్తులపై తమ దృష్టి మరల్చారు. వారి రాజకీయ మానసిక శారీరక గాయాలకు గ్రామస్వామ్యంలో ఊరట వెదుకుకొన్నారు.

గ్రామీణ జీవితంలో తరతరాలుగా బలంగా నేళ్ళూనుకొన్న గ్రామస్వామ్యం దాని అంతర్భాగమయిన శ్రేణీవిధానం సామాన్య ప్రజల శ్రమజీవుల ప్రాణప్రదమయిన ప్రాథమిక హక్కులగు సాంఘిక ఆర్థిక స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు ఆలంబనమయింది.

సుమతి శతకకారుడగు బద్దెన, 16-17 శతాబ్దాలకు చెందినయోగి వేమన, పోతన మహాకవులు - రైతులను బ్రాహ్మణులను రాజులు గౌరవించనప్పుడు గౌరవప్రదమైన వ్యవసాయానికి వీరినంకితంకమ్మని బోధించారు. పోతన రాజాశ్రయాన్ని నిరసించాడు.

రైతుస్వామ్యం, చేతివృత్తుల వర్గాల నుండి ప్రభవించిన నాయకులు, లెంకలు తమ సాంఘిక జీవనానికి మూలకందమగు ఈ కవిత్వ తత్త్వాన్ని వృత్తి స్వేచ్ఛలను జీర్ణించుకొని తమ ప్రాథమిక హక్కులను చిరకాలం అనుభవించారు. శివాజీ నాయకత్వాన మహారాష్ట్రులు ఢిల్లీపై నిరంతరం యుద్ధాలు చేశారు. ఈ వృత్తి స్వేచ్ఛ స్వయం ఉపాధి ప్రతిపత్తులే తమిళ, కన్నడ, మహారాష్ట్ర, తెలుగు ప్రజల స్వాతంత్ర్యేచ్ఛకు ప్రాణం పోసినవి.

రైతుస్వామ్యము వృత్తి స్వాతంత్ర్యము స్వయం ఉపాధి ప్రతిపత్తుల కొరకు నాయకవీరులు సాగించిన ఉద్యమాలు దక్షిణాపథ చరిత్రలో మైలురాళ్ళు. ఈ ప్రాథమిక హక్కుల సంరక్షణ సాధనలు నాయకవీరులు సాధించిన అపూర్వవిజయాలు.

ఈ కాలంలో కాకతీయ శిల్పం నూతనవిలువలతో మహోన్నతంగా విరాజిల్లింది. హనుమకొండ రామప్ప దేవాలయాల శిథిలాలలో నాటిశిల్పుల సృజనాత్మకత వుట్టిపడుతుంది. వరంగల్లు కోటలోని దేవాలయాల అవశేషాలు, కాకతీయ శిల్పుల నైపుణ్యానికి అద్భుత ప్రజ్ఞకు సాక్షీభూతాలు. నల్లరాతిలో మలచిన నాలుగు సమున్నత కీర్తి తోరణాలు సాంచీతోరణాలకు మెరుగులు దిద్ది నాటి శిల్పుల ధీశక్తికి ఊహాపోహాలకు విజయార్భాటాలకు ఎత్తిన పతాకాలు. ఈ ద్వారాలమధ్య నల్లరాతిలో చెక్కిన ప్రతాపరుద్రుని శిరస్సు, పాండిత్యనిధి యుద్ధకోవిదుడు అయిన ఆతని శక్తి సౌందర్య ఔన్నత్యాలను ప్రతిఫలిస్తూ వాస్తువిజ్ఞుల శిల్పుల ప్రజ్ఞాపాటవాలకు అద్దంపడుతున్నది. చూపరులను ఆశ్చర్యచకితులను చేస్తున్నది.

అతిచక్కగా చెక్కబడి నునుపు చేయబడిన ద్వారపాలకులు యక్షిణులు. ఏనుగులు గుఱ్ఱాల విగ్రహాలు, అతినల్లని మెరుగులతో గ్రీకుల హొయలు తలతన్నే విధంగా మలచబడిన నిలువెత్తు సౌందర్యరాశులు. "తేనెలో ముంచితీసిన ఉలులతో చెక్కబడినవా" అన్నట్లు చూపరులను అనిమేషులను చేస్తాయి. రామప్ప దేవాలయమందలి పద్మాలపై విష్ణు దశావతారాలు భారత శిల్పుల అనన్య ప్రజ్ఞకు మచ్చుతునకలు. రుద్రమదేవి వీరత్వానికి ముగ్దులయిన ఈ శిల్పులు ద్వారపీఠాలపై ద్వారతోరణాలపై అశ్వారూఢులగు యువతుల శిల్పాల ననేకం మలిచారు.

కాకతీయ సామ్రాజ్య పతనానంతర మీ శిల్పులు హోయసలకు వలస వెళ్ళారు. మేల్కొటై, హాళేబీడులలో తమ ఉలులకు మరల పదును పెట్టారు. రామప్ప దేవాలయంలో మనోజ్ఞంగా పద్మదళాలపై చెక్కిన దశావతారాలు నవగ్రహాలు మరల మరల హంపీ దేవాలయాల స్తంభాలపై, మండపాలపై విజయనగర గోపురాలపై రథాలపై అదేనిష్ఠతో అంత సుందరంగాను శిల్పీకరించారు. కాకతీయులంతరించారు. నాయకులు చెల్లాచెదరయ్యారు. పురోహితులు పారద్రోలబడ్డారు. శిల్పులు వలసవెళ్ళారు. దేవాలయములు మసీదులుగా మారినవి. కానీ కాలానికతీతంగా శిల్పంలో వాస్తులో కాకతీయుల హైందవమత భక్తి శ్రద్ధ అభిమానములను శిల్పాచార్యులు అజరామరం గావించారు. మైకెల్ ఆంజిలోవంటి కళాతపస్వి "అమరశిల్పి జక్కన"పై తెలుగు కన్నడములలో నిర్మించిన చలనచిత్రము ఆతని స్మృతికి ఘనంగా నివాళు లర్పించినది. ఢిల్లీ, విజయవాడ, గుంటూరులలోని మ్యూజియంలలో క్రీ.శ. 12-17 శతాబ్దాల కాకతీయ హొయసలి విజయనగర రాజులకాలపు శిల్పాలు భద్రపరచబడినవి.

పరిపాలన, సామాజిక వ్యవస్థలలో పూర్తి ఇస్లామీకరణ చేయతలపెట్టిన బహమనీ సుల్తానుకు చుక్కెదురయింది. నాయకుల తీవ్ర ప్రతిఘటనవలన స్థానిక నాయకత్వాన్ని మార్చలేకపోయాడు. సైనికాధికారం సామ్రాజ్యాధికారంతోనే తృప్తిపడవలసివచ్చింది. ముస్లిం బ్రిటీషు పాలనలో ప్రభుస్వామ్యం నెరపిన జమీందార్లందరూ హిందువులే. సామ్రాజ్యవాదానికి తలవంచినా ఈ నాయకుల ఆత్మగౌరవం హిందూ మతానికి రక్షణగా నిలిచినది.

ముస్లింల దక్షిణాపథ ఆక్రమణ ఆధిపత్యాలలో కొన్ని ఊరట కలిగించే అంశాలు గోచరిస్తాయి. వారు సామ్రాజ్యాధిపతులుగా మిగిలారు. పరిపాలనా యంత్రాంగం స్థానికులగు హిందువులు నిర్వహించేవారు. గ్రిబెల్ ఇలా వ్రాశాడు. "దక్షిణాపథంలోగానీ, ఇండియాలోకాని మహమ్మదీయులు కోటలు సైనిక స్థావరాలుమాత్రమే జయించారు. విజయనగరంలోవలె ఈ కోటలను నేలమట్టం చేయడంగానీ, సైనిక స్థావరాలుగా మార్చి ముందుకు సాగివెళ్ళటంగానీ జరిగేది. దేశం జోలికి వెళ్ళేవారుకాదు. హిందూ రైతులు తమ భూమిని తామే దున్నుకొనేవారు. హిందూరాజులకు మారుగా ముస్లింలకు పన్నులు కట్టేవారు. చేతివృత్తులవారు. వ్యాపారులు తమ వృత్తులలో కొనసాగారు. రాజకుటుంబాలు మాత్రం కనుమరుగయ్యేవి. భూస్వాములు తమ అధికారం కోల్పోక పన్నులు వసూలు చేసుకొనేవారు. తాము పన్నులు ప్రభుత్వానికి చెల్లించేవారు. ఒక

చిన్న జిల్లాకు ఒక రాజప్రతినిధి ఉండి కొద్దిపాటి బలగంతో సాధారణ పరిపాలన పర్యవేక్షించేవాడు. గ్రామాల ఆక్రమణ లేదు. దురాక్రమణదారులు గ్రామాల్లో నివసించటం లేదు. హిందూ ప్రజానీకం గతంలో వలె భిన్నత్వంలో ఏకత్వం ప్రదర్శిస్తూ వుండేది. హైందవ సంప్రదాయాలు మతవిధులలో మార్పులేదు. ముస్లిం సైన్యాలు నడిచిన త్రోవలో దేవాలయాలు అపవిత్రం కావించబడేవి. దాడులు జరుగనిచోట్ల దేవాలయాలకు ముప్పులేదు. యుద్ధాలులేని రోజుల్లో ముస్లింలు దేవాలయాల జోలికి వెళ్ళేవారు కారు. కొందరు హిందూ జమిందారులు, సేవకులవలె తమ బలగాలతో అత్యంత విశ్వాసంతో ముస్లింలను కొలిచారు. ఈవిధంగా దక్కను ముస్లింలు సైన్యాల నిర్మాణంలో మార్పు చోటుచేసుకొన్నవి. విదేశీ ముస్లింలకు దక్కను ముస్లింలకు వచ్చిన అంతఃకలహాల వలన గానీ, ఢిల్లీ చక్రవర్తి సైన్యములోజేరు ఆకర్షణగానీ, ఏదిఏమైనా విదేశీయులు వెనుకటివలె దక్కను సైన్య విభాగాల్లో లేరు. అందువలన హిందువులను దక్కను సుల్తానులు ఎక్కువగా తమ సైన్యాల్లో జేర్చుకొన్నారు.

ప్రోలయ కాపయ వినాయక దేవుల, నాయక సమాఖ్యల వారసత్వం కల కాకతీయ నాయకులు మాత్రం ముస్లింల తదుపరి బ్రిటీషువారి సైన్యాల్లో జేరలేదు.

# 14. నాయకయుగ వైఫల్యాలు

వివిధ ప్రదేశాలలో వివిధ దశలలో ఒక్క ఊపుతో మొదలయిన భారత ప్రజల పురోగతికి భారత చరిత్ర సాక్షీభూతమయింది. ప్రాథమిక అమానుషత్వం నుండి మొదలయి, బానిసత్వపు సంకెళ్ళ నుండి విడివడి అభ్యుదయకరమయిన గ్రామీణత్వము, స్వతంత్ర రైతాంగజీవనము, వ్యవసాయ పారిశ్రామికీకరణం అంతిమలక్ష్యంగా మానవత్వం వైపు పురోగమించింది. క్రీ.శ. 14-16 శతాబ్దాలలో ఫ్రాన్సు, ఇంగ్లండు దేశములలోవలె వివిద తెగల నాయకత్వం నుండి ప్రజాస్వామ్యం సమసమాజం రాచరికం రాజ్యాధికారాల దిశగా ప్రయాణాన్ని భారత చరిత్ర చూడలేదు. ప్రజాభిప్రాయానికి తలవంచిన బ్రిటీషు పార్లమెంటును, ఫ్రెంచి విప్లవ విస్ఫోటనాన్ని కాకతీయులెరుగరు. రష్యా బాల్కన్ ప్రజలవలె అతిహేయమయిన అణచివేతకు భారతప్రజలు గురయ్యారు. టర్కీ సామ్రాజ్యవాదపు బానిస విధానాలతో పోల్చదగిన విధానాలకు లోనయి అట్టడుగు చీకటి కోణాలకు భారత ప్రజ, సమాజం నెట్టివేయబడింది.

ఆర్యులు భారతీయుల సాంఘిక రాజకీయ జీవితాల్లో అడుగుపెట్టారు. వీరు మైదానాల నుండి వచ్చారు. పశుపోషణ వ్యవసాయం వీరివృత్తులు. వీరిరాకతో ఏకేశ్వరోపాసనయగు శివపూజ, పరిమిత విగ్రహారాధనయగు మాతృపూజ, ద్రావిడ నాగరికత కుంటుబడింది. ఆర్యుల జీవిత విధానం భారతీయులకు కొంతలాభకారి అయింది. అభివృద్ధికి దోహదం చేసింది. వ్యవసాయంతోపాటు పట్టణ నాగరికత అభివృద్ధి చెందింది. దర్బారులు కొలువులు దర్జాలు వీరి జీవితాల్లో కొసమెరుపులయ్యాయి. కానీ హరప్పా, మొహంజదారో, ఇంద్రప్రస్థము, నలందా, అమరావతి నాగరికతలను పరిశీలిస్తే వ్యవసాయము పారిశ్రామిక ప్రగతి భౌతికంగా నైతికంగా ముందడుగు వేయలేకపోయిందని తెలుస్తుంది. మానవాతీత శక్తులు మత విధులు కర్మకాండలు పునాదిగా గల ఆర్యుల సాంఘిక ఆలోచనా ధోరణులు, మత విశ్వాసాల మధ్య, ప్రాచీన ద్రావిడ తెగల కుల వ్యవస్థ నలిగిపోయింది. ఆర్య నాగరికత పాలకుల విధులు, కుటుంబ జీవితము, కులపెద్దల బాధ్యతలను చక్కగా నిర్వచించింది. గుప్తుల కాలపు ఆర్యసాహిత్యం సామాన్యులకు అందుబాటులో వుండేది.

ఆటవిక నాయకత్వం నుండి, తెగల మధ్య జరిగే భీభత్స హత్యాకాండ నుండి రాజు సాక్షాత్తు విష్ణంశ సంభూతుడనే నమ్మకంతో ఆడించే ఆట పాడించేపాటగా

సాగుతున్న పాలనా విధానాలు, బుద్ధునికాలపు స్వతంత్ర గణతంత్ర పాలనలో **ఆర్యఋషి ప్రభావాలతో రక్షింపబడినవి.** మానవత్వానికి అహింస మూలమని, **"అహింసా పరమోధర్మః"** అని అశోకుడు ప్రపంచానికి ప్రబోధించాడు. రోమనుల **చట్టాలు సాధించిన** దానికన్నా మానవత విశాల దృక్పథాలు పెరగటానికి ధర్మప్రబోధం ఎంతో ఉపయుక్తమయింది. ఈ ధర్మాచరణము భారతదేశ ప్రధాన లక్షణమయింది. ఈ ధర్మాచరణమే నాటి నుండి నేటివరకు భారత సమాజాభివృద్ధికి కుల మత వర్గ వర్ణ వివక్షలకు వ్యతిరేకంగా మనం జరుపుతున్న పోరాటానికి ప్రాణం అయింది.

పశ్చిమ యూరపు దేశాలు సాంఘిక ఆర్థిక విప్లవాలవైపు పరుగులు పెట్టుంటే భారత సమాజం సహనం పరస్పర గౌరవం శాంతియుత సహజీవనం తెలియని బాధ్యతారాహిత్య ప్రభుస్వామ్యానికి దిగజారింది.

**ముస్లింలు దేశాన్ని** ఆక్రమించారు. ఓడినవారిని బానిసలుగా చేశారు. వారి సంస్కృ**తీ ఔన్నత్యాలను** కాలరాచి అణగదొక్కారు. మూడు శతాబ్దాలీ **అణచివేత** సాగింది. **కానీ హిందూ** నాయకులకు చీమకుట్టినట్లయినాలేదు. వారి రాజకీయ **సాంఘిక ధోరణులు మార్చుకోవటంగానీ,** స్పందించి రాజకీయ సాంఘిక విప్లవాలు నడపటం గానీ **చేయలేకపోయారు.**

రెండు దశాబ్దాలు కాకతీయ ప్రతాపరుద్రుని సామ్రాజ్యం ఢిల్లీ **ముస్లింల** దండయాత్రలకు గురిఅయింది. యావత్ దక్షిణ భారత నాయకులు **మాలికాఫర్, అల్లాయుద్దీన్** అతని వారసులు ఉలుగుఖాన్ చేతులలో ఓటమి చెందారు. ఈ పరిస్థితులలోనైనా హిందూ సమాజనాయకులు మతపెద్దలు రాజకీయ పండితులు ప్రజలను మేల్కొల్పటంకానీ, విప్లవాలకు పురిగొల్పటంకానీ, ముస్లిం దారుణాల **నుండి** బయటపడే మార్గాలనన్వేషించటం గానీ చేయలేకపోయారు. పరస్పర సహకారం **సాంఘిక** రాజకీయ ఐకమత్యం సాధించి మానవతా శిఖరాల నధిరోహించలేకపోయారు. ఇదే కాలంలో వైక్లిఫ్ వగైరాలు చర్చి ఆధిపత్యాన్ని సవాలు చేస్తున్నారు.

బసవనమంత్రి (బిజ్జల బసవన్న 1150-63) హిందూ వర్ణాశ్రమ ధర్మాలకు కుల వివక్షతలకు వ్యతిరేకంగా సాంఘిక విప్లవాన్ని దక్షిణాపథంలో సాగించాడు. అతని ననుసరించి భాస్కరుడు భావగర్భితమయిన కవిత్వంతో కాకతీయ సామ్రాజ్యంలో కొన్ని వర్గాల ప్రజలను మేలుకొలిపాడు. పురోహితుల వైషమ్యాలకు **అతీతంగా శ్రామిక ప్రజలు**

గళం విప్పారు. ఆత్మగౌరవశ్రీలకు పాటుబడ్డారు. హిందూ మతంలో కొత్త తెగలేర్పడినవి. బ్రాహ్మణ పురోహితులు వీరిలో కూడా జొరబడ్డారు. ప్రజాకవిత్వంలోని విప్లవాగ్నిని చల్లార్చి మెల్లమెల్లగా పాండిత్యానికి పట్టం గట్టారు. 12వ శతాబ్దంలో పలనాటి బ్రహ్మనాయుడు చాపకూటి సిద్ధాంతం అమలు జరిపాడు. మాలకన్నమను దండనాయకునిగా చేశాడు. ఈ వీరవైష్ణవం కూడా కులాల ప్రాధాన్యము నరికట్టలేకపోయింది. అగ్రవర్ణాల ఆధిక్యమును వారునుభవిస్తున్న హక్కులను త్రోసిరాజనలేకపోయింది. సాంఘిక రాజకీయ సమానత్వమందించలేకపోయింది.

ఆంధ్ర కిసానులు శతాబ్దాలుగా పల్లవ రాష్ట్రకూట చోళ చాళుక్య రాజ వంశాలతో వివాహ బాంధవ్యాలు నెరపుతూ రాజకీయంగా ప్రాధాన్యం సంతరించుకొంటున్నారు.

మొదటి ప్రతాపరుద్రుడు చేసిన కిసాను తెగల విభజన కులాల అంతరాలను పెంచింది. ఇది అంత వివేకమయినచర్యకాదు. ప్రతాపరుద్రుని ఆదేశము తెగలను కులాలుగా వర్గీకరించింది. ఉపతెగలు ప్రత్యేక ఉపకులాలుగా రూపొందాయి. కులాల ఉపకులాలలోని పెద్దలు సమాజంలోని అంతర్గత విభేదాల్లో జోక్యం చేసుకొనే అధికారం కలిగియుండేవారు. ఈ విభజన పురోగమిస్తున్న సాంఘిక ప్రగతిని కుంటుపరిచింది. అత్యంత బలవంతులగు కిసానులను చీలికవర్గాలుగా వేరువేరు కులాలుగా ఏర్పరిచి కులపెద్దల ఔన్నత్యాన్ని మాత్రం పెంచింది. విస్తృతమయిన కమ్మ ప్రజాబాహుళ్యంలోని వెలమ బోయ బలిజ ముతరాసు తెలిక ఒంటరి రెడ్డి వర్గాల మధ్య సయోధ్యకు సాంఘిక రాజకీయ ఐక్యంకు ప్రతాపరుద్ర చక్రవర్తి కృషిచేశాడు. ముస్లింలతో ఇతర దక్షిణాపథ నాయకులతో చేసిన యుద్ధాలలో ఈతెగల వారు చేసిన త్యాగాల ఆధారంగా వీరికి ఆయుధోప జీవులతో సమాన హోదా కల్పించాడు.

ఇదే కాలంలో పైపద్ధతికి వ్యతిరేకంగా ఇంగ్లాండులో కెల్ట్స్, డేన్స్, నార్మన్లు ఇతరులు కలగలిసిపోయి ఒకే ఇంగ్లీషు జాతిగా రూపొందారు. ఇప్పటి నుండి నాలుగు శతాబ్దాలు యూరోపు ప్రభుస్వామ్యానికి వ్యతిరేక దిశగా ప్రయాణించింది. దురదృష్టవశాత్తు భారతదేశం, మరీ దక్షిణాపథం కులమత విభజనల మార్గం తొక్కి అట్టడుగు వర్గాలపై వివక్షతలను ప్రోత్సహించి, సాంఘిక తిరోగమనం సాగించింది.

ముస్లిం సామ్రాజ్యవాదంపై విజయం సాధించిన కాకతీయ నాయకులు రాచరిక వ్యవస్థగా రూపుదిద్దుకొన్నారు. సామాన్య జనాల రాజకీయ సాంఘిక స్వాతంత్ర్య

పోరాటాలను నీరుకార్చారు. బ్రిటను ఫ్రాన్సులలో వలె నాయక సమాఖ్యను పార్లమెంటరీ వ్యవస్థగా రూపుదిద్దవలసిన నాయకులు, రైతులను సామాన్య ప్రజను తిరోగమనవాదుల కౌగిళ్ళలోనికి నెట్టారు. ముస్లిం దురాక్రమణలు - పురోహిత వర్గాలకు అధికారం కోసం తాపత్రయపడే నాయకులకు అవకాశం కల్పించి ప్రజలు మతఛాందసాల కబంధ హస్తాలలో చిక్కుకొనేటట్లు చేసినది. ఇస్లాంమతంలోని ఏకేశ్వరోపాసన, సౌజన్యం, సౌభ్రాత్రం వివక్షతారాహిత్యం. సమానత్వాల నుండి గుణపాఠం నేర్చుకొని, కనీసం బసవన, బ్రహ్మనాయుడు, మాధవ, ప్రతాపరుద్రులు సాధించిన సమానత్వం వైపు ప్రజలను నడిపించలేకపోయారు. అంతేకాక ముస్లిం ఆక్రమణల నుండి నాయక సమాఖ్య నుండి నిర్జీవమయిన రాజరికాన్ని సైన్యాధిపత్యాన్ని తలపై పెట్టుకొన్నారు. ఇస్లాం హిందూమతాలు రెండూ చక్రవర్తిపై తిరుగుబాటును నిరసించేవి. తమ రాజకీయమనుగడకు కేంద్రీకృత పాలనను ఈ రెండు మతాలు సమర్థించేవి.

నాయకుల విపరీత అధికార వ్యామోహాన్ని అచ్చటచ్చట గొంతువిప్పిన కవులు అరికట్టలేకపోయారు. వేములవాడ భీమకవి కొందరు నాయకులను తన శాపానుగ్రహశక్తితో మోకరిల్లచేసుకున్నాడు. భాగవతోత్తముడు పోతనామాత్యుడు తన జీవితకాలవు కృషియగు మహాభాగవతాన్ని భువనగిరి సర్వజ్ఞ సింగభూపాలుని కంకితమీయక శ్రీరామచంద్రునకు అంకితం చేశాడు. రాజీగ్రంథాన్ని భూస్థాపితం చేశాడు. దురదృష్టవశాత్తు ప్రతిభాశాలులయిన శ్రీనాధుని వంటి కవులు బీదరికాన్ని సామాన్య జనాన్ని అవహేళన చేస్తూ రాజులను పొగడ్తలలో ముంచెత్తారు. నాయకులు గర్విష్ఠులై, అధికారమత్తులై, స్వజాతీయుల, బాంధవులను తమజాతి మత సంస్కృతికి వారసులను వైషమ్యంతో చిన్నచూపుచూశారు.

ఈ నాయకుల, రాజుల దౌర్జన్యాల నుండి కొంతకాలము పంచాయితీ వ్యవస్థ సామాన్య ప్రజలకు రక్షణ కల్పించింది. గ్రామపంచాయితీల స్వయంప్రతిపత్తి ప్రజల దైనందిన సమస్యల పరిష్కారాలు, కులపెద్దలను, వేరువేరు సంఘపెద్దలను గౌరవించటం కులతగాదాలు పరిష్కరించటం చేస్తూ కొంత వరకు ఈరాచ నాయకుల జోక్యాన్ని గ్రామాల్లో నివారించగలిగింది. క్రమేణ వంశపారంపర్య గ్రామాధికారుల ప్రాబల్యం పెరగటంతో గ్రామ పంచాయితీల అధికారాలు వెనకబడ్డాయి. ఈరాచనాయకులుగా ఎదిగినవారు గ్రామాధికార్ల కుటుంబాల నుండి వచ్చినవారే. ఈ క్రొత్తగా వచ్చిన ప్రభుత్వ ప్రతినిధులు రాచరికానికెదుగుతున్న తమ తమ వర్గాల కొమ్ముకాచి ప్రజల నణచి

బీదరికపు టంచులకు ప్రజలను నెట్టివేయగలిగారు. ఈ వ్యవస్థకు తెలంగాణాలో, కోస్తాలో తిష్టవేసిన ముస్లింల మద్దతు వుంది. ఫ్యూడల్ దోపిడీ, హిందూమతంలోని పరస్పర అసహనం, బలవంతపు మతాంతరీకరణలు, గ్రామాధికార్ల పెత్తందారీతనము **14-16** శతాబ్దాల సాంఘిక వ్యవస్థను నామమాత్రంగా మిగిల్చినవి. కుతుబ్‌షాహీలు మొగలాయిలు నిజాములు ఈ వ్యవస్థను కాలనాళికలో బిగగట్టి ప్రజల నిరాశా నిస్పృహలలో ముంచి, వారి ఆత్మగౌరవాన్ని స్వాతంత్ర్యాన్ని పెంపును నిరోధించారు. బ్రిటీషువారు కూడా ఈ విధానాన్నే అనుసరించి ప్రపంచంలో హక్కులకొరకు, స్వాతంత్ర్యం కొరకు జరిగే పోరాటాలు తెలియకుండా సంస్థానాల ప్రజలకళ్ళకు గంతలు కట్టారు.

కాకతీయ నాయకులు పార్లమెంటరీ విధానాలవైపు నడచి నాయకులను, పురోహితుల, ఆయుధోపజీవుల వారి అనుచరుల వలెనే గౌరవించినట్లయితే శిక్కులవలె ప్రజాస్వామ్యంవైపు నడిపించి, గ్రామీణ పంచాయితీ వ్యవస్థను కాలరాయక, దళితులను అట్టడుగు వర్గాలను, గౌరవించి ఆదరించినట్లయితే - నాటి హిందువులు ముస్లింలను పారద్రోలగలిగేవారు. దక్షిణాపథాన్ని సౌభాగ్యవంతము, అభివృద్ధికరమగు దేశంగా తీర్చి ప్రపంచదేశాలతో పాటు ముందుకు నడిపించేవారు.

# 15. అభివృద్ధి సూచికలు

మతసహనము : కాకతీయ నాయకుల విజయనగర రాజుల కాలం, మత సహన పరతా, యూరోప్ దేశాల పరిస్థితులకు భిన్నంగా ఒకఅడుగు ముందే వుంది. ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్స్ తదితర యూరప్ దేశాల 16వ శతాబ్దపు చరిత్ర - కాథలిక్ - ప్రాటెస్టెంటు మతస్థుల మతపునరుద్ధరణ. దౌర్జన్యకాండ పరస్పర వినాశనం వేధింపులు చర్చిపై తిరుగుబాట్లతో నిండివుంది. దక్షిణ భారతంలో బసవని వీరశైవం, రామానుజుని వీరవైష్ణవం హిందూఛాందసవాద పోరాటంలో నెగ్గి సమసమాజ దృక్పథంతో సనాతన హిందూమతంతో కలసిమెలసి సహజీవనం చేయగలిగినవి. బౌద్ధం, జైనం సహించబడినవి. కాకతీయుల శక్తిపూజతో సమాధానపడినవి. కాకతీయుల తరువాత నెలకొన్న ఈ వాతావరణం హిందూమత విశిష్టతకు తార్కాణం.

"విజయనగర సామ్రాజ్యంలోని అన్ని మతాలవారూ - యూదులు. క్రిష్టియన్లు, ముస్లింలు రాజును తమ సంరక్షకునిగా భావించేవారు."

"ప్రభుత్వ దృష్టిలో అన్నిమతాలు సమానమేనని అన్నిమతాలను ఆదరించటం రక్షించటం రాజు విధి" యని బుక్కరాయలు శాసించాడు.

"భగవంతుని చేరే మార్గాల్లో ఇస్లాం కూడా ఒకటి" అని మాధవాచార్యులు వాక్రుచ్చారు.

బుక్కరాయలు కాపయలు బహమనీ సుల్తానులో దయాగుణం మేల్కొల్పి నిరాయుధులగు యుద్ధ ఖైదీల రక్షణకు వాగ్దానం పొందారు.

మహమ్మదీయ సైన్యాలు సామాన్యజనంపై సాగించిన మారణకాండ సుల్తాను మహమ్మద్ చూచాడు. భారతీయ యుద్ధ ధర్మానికి కట్టుబడనట్లయితే ప్రజలు తనను క్షమించరని తెలుసుకొన్నాడు. ముస్లిం చరిత్రకారుడు "ఫెరిస్తా" ఇలా వ్రాశాడు.

"సుల్తాను విజయానంతరం ఏ ఒక్కరినీ వధించననీ హిందువులకు వాగ్దానం చేశాడు. నాటి నుండి యుద్ధవిరమణానంతరం నిరాయుధుల రక్తం దక్కనులో చిందలేదు."

కాకతీయ ప్రజలు తమ చక్రవర్తిని యగు రుద్రమదేవి రాణి గణపాంబలపై తమ భక్తి విశ్వాసాలు విధేయతలను దశాబ్దాల పర్యంతం ప్రకటించుకొని గర్వించే వారు.

నాటి కిసాను మహిళలు ధైర్యవంతులు బలవంతులు స్వావలంబకులై యుద్ధప్రియులై ఉన్నారని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఢిల్లీ సుల్తాను బహమనీ సుల్తానుల దురాక్రమణలు ప్రతిఘటించటానికి నాటి స్త్రీలు రుద్రమ అడుగు జాడలలో నడచి తామూ ఆయుధాలు ధరించారు. నాటికి నాలుగు శతాబ్దాల క్రితం పల్నాటి నాయకురాలు నాగమ్మ బ్రహ్మనాయనితో పోరాడి యుద్ధభూమిలో అసువులు వీడింది.

అసంఖ్యాకంగా కిసాన్ మహిళలు రుద్రమదేవి నాదర్శంగా తీసుకొని యుద్ధ విద్యలలో ఆరితేరారు. వ్యవసాయ కుటుంబముల, తెగల శాఖల, స్త్రీలు కొన్ని వంశాలకు పూర్వీకులుగా కీర్తింపబడ్డారు. మౌర్యుల తరువాత రాజ్యానికి వచ్చిన శాతవాహనులు తమ తల్లులనే చెప్పుకొన్నారు. వాశిష్ఠీ పుత్ర పులుమాయి, గౌతమీపుత్రయజ్ఞశ్రీ, గౌతమీపుత్ర శాతకర్ణి (గౌతమీబాలశ్రీ), మాధవీపుత్ర శకసేనిఇత్యాదులు. తమ తల్లుల నుండి భార్యల నుండీ స్ఫూర్తి పొందిన కాకతీయులు ఆ వారసత్వం ప్రకటించుకొన్నారు. శీలంవారు రాష్ట్రకూట శీలమహాదేవి వంశస్థులు. లక్కమసాని, కొలసాని, చలసాని పెమ్మసాని వారీవిధంగా గణుతికెక్కిన వంశములవారే.

కాకతీయ విజయనగర నాయకుల కాలంలో ఎందరో పరిపాలకులుగా మన్ననలందారు. నాయకీమణులుగా. కోటగణపాంబ, కోటబయ్యల మహాదేవి, ప్రియకోటలదేవి, కనకమేడల వంశస్థురాలయిన కనకమేడల మేళాంబిక, న్యాయమాంబ, చమకాంబ, అమ్మన్న, సుబ్బమ్మ, అక్కమహాదేవి. వెంకటాంబ, మైలాంబమహాదేవి, ఊర్జవ కళింగగౌరి. ఆర్యమదేవి, చోళ కుందమాంబ మల్లమ మగువ మాంచాల, సూరమ్మ, సిద్దమ్మ, అక్కమ్మ, కూనలమ్మ, హేమాద్రి మల్లమ్మ మొదలగు వారిందు కుదాహరణలు.

పురోగామిత్వము విశాల దృక్పథము గల ఈ నాయక సాంప్రదాయముల వలననే వరంగల్లు విజయనగరముల పతనానంతరం, మధుర రాజధానిగా నాయకురాలు మంగమ్మ తమిళనాడును దశాబ్దాలపాటు గొప్పగా పరిపాలించింది. అశోకునివలె సంక్షేమ రాజ్యాన్ని ఆకాంక్షించి తన పేర రహదారులు వైద్యశాలలు సత్రాలు, చెరువులు మధుర నుండి కన్యాకుమారి వరకు నిర్మించింది.

కాకతీయుల, నాయక వీరుల స్వాతంత్ర్య సమరాల్లో, ప్రత్యక్షంగా భాగస్వాములయిన వీరవనితల పేర్లతో నేటి కమ్మ, తెలగ, రెడ్డి, కాపు, దళిత కుటుంబాలు వాసికెక్కాయి.

నాటి కాకతీయ వీరవనితల సాహసాలు త్యాగాలు వర్ణనాతీతం. సామ్రాజ్య రక్షణకు తమ మానసంరక్షణకు అగ్నిహోత్రునికి తమను తామర్పించుకొన్న ఘట్టాలు కోకొల్లలు. దురాక్రమణదారుల ఆలోచనా రాహిత్యాన్ని అమానుషమారణకాండను ముస్లిం చరిత్రకారుల హృదయాలు, నేత్రాలు, కలాలు వంకర చూపులతో చూసినా అన్యాపదేశంగానయినా గ్రంథస్థం కావించబడినాయి.

బ్రిటీషువారి బానిసత్వంకన్నా, మరణమే మేలని, కిత్తూరు రాణి చెన్నమ ఈ కాకతీయ సాంప్రదాయానుసారం మరణాన్నాహ్వానించింది. కాకతీయ వంశజులగు వీరవనితలు నడుం బిగించి స్వరాజ్యపోరాటంలో ముందు నిలచారు.

దురదృష్టవశాత్తు ఈ శాఖలు 14వ శతాబ్దంలో తమతో కలసి పోరాడిన సామాన్య ప్రజకు దూరమయ్యారు. పురోహితుల దయతో సంపాదించుకొన్న సాంఘిక హోదాల మోజులోపడి దళితులను అంటరానివారినిగా మార్చినా, తమ స్వజనులు సహచరులు శూద్రులుగా ముద్రవేయబడినా సమాజంలో వెనుకకు నెట్టివేయబడినా పట్టించుకోలేకపోయారు. వీరుబసవని, బ్రహ్మనాయని బోధలు పెడచెవిని పెట్టారు.

వీరశైవ వీరవైష్ణవ మతాలు సవరల, మరియల ధర్తీమాత ఆరాధనలు ప్రవచించిన సర్వసమతావాదాన్ని హిందూ ఛాందసవాదులు నీరుకార్చారు. కులతత్వవాదులుగా మత ఛాందసులుగా ఘనీభవించారు. ఈ సమయంలోనే దురాక్రమణదారులు సమాజంలోని ప్రతి వారిని ఇస్లాంలోనికి ఆహ్వానిస్తూ స్నేహహస్తాలందించారు. ఇస్లాం వ్యతిరేకులకు నరకం చూపించారు. భారత మతగురువుల భారత ధర్మాన్ని ఉక్కుచట్రంలో, వూపిరాడనీయకుండా బిగగట్టి, మత గ్రంథాల కొరతల (శూలాలు)పై నిలపి, సామాన్యులు తమను తామల్పులుగా భావించుకొనేటట్లు చేశారు. తులసీదాసు, సూరదాసు, మీరాబాయి, గురునానక్ ఉత్తర భారతంలో, భాస్కరుడు, వేములవాడ భీమకవి. పోతనామాత్యుడు దక్షిణభారతంలో, ఈ ధృతరాష్ట్రకౌగలి భగ్నం చేయటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

వీరేశలింగం, వివేకానందుడు శ్రద్ధానందుడు గాంధీగారి వంటి సంఘసంస్కర్తలు ఛాందసత్వపు వేళ్ళను పెరకివేసి భారత సమాజపు ఆత్మను మేల్కొల్పి భారతీయతకు ప్రాణవాయువు లందించారు.

1933 సంవత్సరంలో అస్పృశ్యత హిందూ సమాజమునకు అనావశ్యకమని ఛాందసవాదులు అంగీకరించారు.

కాకతీయ యుగంలో తెలుగు సాహిత్యం వెలుగులు విరజిమ్మింది. వ్యాకరణబద్ధమైన ఛందోయుత సాహిత్యంలో సామాన్య జనుల నుడులు నానుడులు సామెతలు చాటువులు చోటుచేసుకొన్నాయి. ప్రజాకవిత్వం మతప్రచారంలో వూపందుకొని వీరశైవ వీరవైష్ణవ బోధనలను ప్రజలలోకి తీసుకువెళ్ళింది. సంస్కృత కవిత్వంతో ప్రభావితులయిన నన్నయ నన్నెచోడ మహాకవుల నతిక్రమించి తెలుగు కవిత్వం ముందడుగు వేసింది. తిక్కన, భాస్కరమంత్రి, మారన, మాచన, బద్దెనలు సంస్కృత పౌరాణిక సాహిత్యాన్ని ఆంధ్రీకరించారు. మహామండలేశ్వరుల ఆశ్రితులగు కవులు, శైవకవులు, (బసవపురాణం ద్విపదలు వచనాలు శతకాలు రచనలతో) ప్రజాసాహిత్యాన్ని సముచిత స్థానంలో నిలిపారు. మయూరసూరి ఈశ్వరసూరి వంటి అబ్రాహ్మణ కవులు గుర్తింపు పొందారు.

రాజకీయంలో విజ్ఞతలోయుద్ధ ప్రతిభలో (కాకతీయ నాయక) నాయకరాణులు - మధురలో మంగమ్మ (1689-1706) మీనాక్షిలు (1732-39) రుద్రమదేవి, **గణపాంబలవలె** ప్రఖ్యాతి చెందారు. ఇందిరాగాంధీని మూడవసారి ప్రధానిగా **చూడగలగటం** భారతీయుల ఉదార విధానానికి కాకతీయ వారసత్వానికి ఒక ఉదాహరణగా మనం వివరించవచ్చు.

పల్నాటి నాయకులు ఆంధ్రకిసానులను రాచరికపు బాటపై నడిపించి కాకతీయ విజయనగర రాజ్యాల్లో రాచరికాలు కట్టబెట్టారు. మాలకన్నమనాయకుని బ్రహ్మనాయుడు సర్వసైన్యాధ్యక్షుడిగా చేశాడు. స్వతంత్ర భారతదేశం ఈ బాటలోనే నడచి అంబేద్కరును రాజ్యాంగ నిర్మాతగా బాబూ జగజ్జీవన్‌రామ్‌ను రక్షణమంత్రిగా గౌరవించుకున్నది. జైనులు ప్రారంభించిన అక్షరాస్యతా వుద్యమాన్ని శైవులు మరింత ముందుకు తీసుకవెళ్ళి తెలుగు భాషావ్యాప్తికి కృషిచేశారు. అక్షరాభ్యాస సమయంలో ప్రతి తెలుగుబిడ్డ దిద్దే 'ఓనమాలు' ఓం నమః శివాయ ఓం నమః సిద్ధేభ్యః అనునవి ఈ శైవజైన సంప్రదాయాలే. సామాన్యజనంలో భాషావ్యాప్తి జంగమదేవరల పుణ్యమే. బసవని అనుచరులగు పాలకురికి సోమనాథుడు పండితారాధ్యుడు, ప్రసిద్ధకవి మారనల సాహిత్యసేవ చిరస్మరణీయం. వీరందరూ ఆంధ్రదేశ పటిష్ఠతకు ఐక్య సాధనకు ఎనలేని సేవలందించారు.

తిక్కన మహాభారతాన్ని ఆంధ్రీకరించాడు. సోమనాథుని ద్విపదకావ్యాలు ప్రజాహృదయాలలో అనురాగాన్ని, దైవభక్తిని ప్రేరేపించినవి. ప్రతాపరుద్రుని సాహిత్యసేవ విప్లవోద్యమాలకు బలం చేకూర్చింది.

# 16. సాంఘిక సంక్షేమం

14వ శతాబ్దంలో మొదలయిన ముస్లిం దండయాత్రలు ఆంధ్ర జన జీవనాన్ని అల్లకల్లోలం చేసినవి. పంచాయితీలకు. వ్యాపారులకు శ్రేణీవర్గాలకు చేతివృత్తుల వారికి రక్షణలేకపోయింది. రాజులు మహామండలేశ్వరులు మండలేశ్వరులు సంఘవ్యతిరేక శక్తులను దారిదోపిడీగాండ్లను అదుపుచేయలేక పోయారు. సంఘ జీవితం క్రమేపి కనుమరుగయ్యింది. సామాన్య ప్రజల దుస్థితి ఊహించవలసిందేకాని వర్ణింప నలవికాదు.

దక్షిణాపథం కరువుకాటకాల్లో పలుమార్లు చిక్కి అలమటించింది. శాసనాల్లో కూడా ఈ విషయాలు చోటు చేసుకున్నవి. క్రీ.శ. 1344, 1377, 1393, 1396లలో వచ్చిన కరువులు ప్రత్యేకంగా శాసనాధారాల వలన తెలుస్తున్నవి. మూడవ భల్లాళుని మరణం వెంటనే వచ్చిన పన్నెండు సంవత్సరాల కరువు "దుర్గాదేవి" అని పిలువబడి నరమాంస భక్షకులను కూడా చూచింది. ఇది 1396లో మొదలయింది.

నాడు ఆహార ధాన్యాల రవాణా ఎడ్లబండ్లపై జరిగేది. వర్షాలు లేక పంటలు పండక రాష్ట్రాలకు రాష్ట్రాలు కరువువాత పడినప్పుడు - దురాక్రమణ దారులు పంటలు ధ్వంసం చేసినప్పుడు యుద్ధాలలో యువకులు మరణించి నప్పుడు - రహదారి దొంగలూ స్వార్థపరులగు వ్యాపారులు మాత్రమే సమాజంలో మిగులుతారు.

కాకతీయ, విజయనగరరాజులు వ్యవసామాభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ వహించారు. నీటివనరులు పుష్కలంగా అభివృద్ధి చేశారు. నాయకులు వారి బంధువులు ఈ నీటిపారుదల సౌకర్యాలను మెరుగుపరిచారు. తటాకాలు నిర్మించారు. చెరువులు తవ్వారు. ముస్లిం దురాక్రమణదారుల కన్ను ఈ నీటి వనరులపై పడినట్లు కనిపించదు. బౌద్ధ సంప్రదాయాలను ఉన్నత కుటుంబముల వారు. అంతఃపురమహిళలు వ్యాపారవర్గాల శ్రేణీవర్గాల స్త్రీలేకాక సామాన్య స్త్రీలు కూడా ఆదరించారు. అమరావతి, చేబ్రోలు, చందోలు, నిడుబ్రోలు, చందలూరు శాసనాలీ విషయాలను తెలియచేస్తున్నాయి. రుద్రమదేవి నాదర్శంగా తీసుకొని గణపాంబ తన తండ్రిపేర శివాలయం నిర్మించి "చింతవాడ" గ్రామం మాన్యంగా యిచ్చింది. అమరావతిలో తన భర్తపేర "బేతేశ్వరాలయం" నిర్మించి "బేతదేవి" గ్రామం పోషణకు ఏర్పాటు చేసింది.

కొడాలి లక్ష్మీనారాయణ గారు "మార్కోపోలో పర్యటన"లో ఈవిధంగా వ్రాశాడు. "ఆమె తన రాజ్యమును తన భర్తవలె అంతకన్నా సమర్థవంతంగా న్యాయంగా

సమానత్వ శాంతికాముకత్వాలతో పాలించి స్త్రీ జనాభ్యుదయము గౌరవము ఆకాంక్షించి ప్రజలకు ప్రేమాస్పదురాలయింది."

ప్రొ॥ మజుందార్ తన Advanced History of India నందు "విజయనగరమునందు మల్లయుద్ధమున, జ్యోతిష్యమున, భవిష్యద్వాణి వినిపించుట యందు సిద్ధహస్తులగు స్త్రీలు కలరు. కోటలోపల వెలుపల లెక్కలు వ్రాయువారు, ఆదాయ వ్యయాల ఆరాతీయు స్త్రీలు రాజువద్ద వున్నారు. రాణులు సంగీత నిష్ణాతులు. న్యాయాధికారులుగా దండనాధికారులుగా రాజప్రతినిధులుగా కోట రేపవళ్ళు కావలి కాచేవారుగా స్త్రీలెంతోమంది నియమింపబడినారు."

విజయనగర రాజ్యాన్ని గురించి "గ్రిబెల్" చేసిన వర్ణన చోళ, కాకతీయ పరిపాలనా కాలానికి కూడా వర్తిస్తుంది. లక్ష్యసాధనలో అంతరాలు స్వల్పంగా వుండినా అంతిమ లక్ష్యమొక్కటే. "హిందూ రాజులు వ్యవసాయము. నీటిపారుదల సౌకర్యముల ఖర్చులకు వెనుకాడరు. నదులకు ఆనకట్టలు కట్టిరి. మాగాణులకు కాల్వల ద్వారా నీళ్ళందించిరి. మైళ్ళకొలది విస్తరించిన జలాశయము లేర్పరిచిరి. వ్యవసాయ భూములను విహంగ వీక్షణము చేసిన జిగిబిగిగా అల్లుకొన్న అందమయిన సాలెగూడువలె కన్పించును."

ఈ శతాబ్దారంభమున సర్ థామస్‌మన్రోదత్తమండలములు విభజనాధికారిగా పనిచేసినాడు. మైసూరు నుండి దత్తత చేయబడిన బళ్ళారి, అనంతపురము, కడప, కర్నూలు జిల్లాలివి.

"కొత్త తటాకాలు నిర్మించే ప్రయత్నం నిరర్ధకము. ఉన్నవాటిని బాగుచేయుట మేలు. దేశము తటాకములతో నిండియున్నది. కొత్త నిర్మాణములకు చోటులేదు. కడప సబ్ డివిజనులో (రెవిన్యూ అధికారిగా నేను) 3574 చదరపు మైళ్ళ వైశాల్యమునందు 4194 చిన్న పెద్ద జలాశయములు అత్యంత మేధావంతమగు రెవిన్యూ విధానమునుసరించి రక్షింపబడుచున్నవి" అని నిర్ధారించుచున్నాను.

ఈ రెవెన్యూ విధానము (దశబంధ) నందు సాగులో నున్న కొంతభూమి తటాక నిర్మాణాల పర్యవేక్షణకు మరమ్మత్తులకు బాగోగులు చూచువారికి శిస్తు మినహాయింపుతో కేటాయించబడినది. మిగిలిన యావత్తు సాగుభూమికి ప్రభుత్వం పన్నులు వసూలు చేయుచున్నది. ఖజానాపై వ్యయభారము లేక దేశాభివృద్ధి జరుగుచున్నది." - (సర్ థామస్ మన్రో)

భూస్వామ్య విధానము గ్రామములలో శాంతికి ఆస్కారము కలిగించినది. పంచాయితీలు లేనిచోట్ల గ్రామాధికార్ల ఆవశ్యకమును కవులు తమ గ్రంథాలకు కూడా ఎక్కించారు. నాయకులు బలహీనులై శాంతిభద్రతలు కరువైనప్పుడు ప్రజల దుస్థితిని పలువురు వర్ణించారు.

సువెల్ మరియు అయ్యంగార్ల "SOUTH INDIAN INSCRIPTIONS" పరిశోధనలు ఈవిధంగా తెలియ చేస్తున్నవి. "13వ శతాబ్దారంభంలో అరాచక శక్తులు పెచ్చరిల్లి ప్రజాజీవితం దుర్భరం కావించాయి. రహదారులపైన, సముద్రయానంలో రక్షణ లేదు. నాయకులు, తెంపరిగాళ్ళు, శ్రేణీ అధికారులు దోపిడీలకు పాల్పడ్డారు. నాయకులు వారి సైన్యాలు నడిచేబాటలో పూచికపుల్ల కూడా మిగిలేది కాదు."

మైసూరు పరిసర ప్రాంతపు శాసనాల వలన దక్షిణ భారతదేశపు ప్రజాజీవితం ఎంత దుర్భరంగా వుందో తెలుస్తుంది. పశుపోషణతో పదిరూపాయలు సంపాదించి భాగ్యవంతుడయిన మరుక్షణం వానిపై దాడులు జరిగేవి. సంపదలను, స్త్రీలను అపహరించేవారు. నాడులకు నాడులే దోపిడీలలో పాల్గొనేవి.

మితిమీరిన సముద్రపు దోపిడీలను మార్కోపోలో వర్ణించాడు. "మలబారు నుండి గుజరాతు వరకు సంవత్సరములో వందకుమించి దొంగల పడవలు ప్రయాణించేవి. ప్రపంచపు సముద్రపు దొంగలందరిలో ఈ గుజరాతీవారు అతి దుర్మార్గులు" అని వ్రాశాడు.

"గుర్రాల వ్యాపారం ఎక్కువగా నష్టపోయింది. సముద్రమార్గాన "కోయల్" కు అరేబియా వర్తకులు రాజుల కమ్ముటకై గుర్రాలు తెచ్చేవారు. భారతదేశపురాజులు ఈ వాణిజ్యంలో చాలా నష్టపోయారు. మలబారు పశ్చిమకోస్తా చాలా ప్రమాదకరమయినది.

# 17. నాయకశబ్దము - వ్యుత్పత్తి

నాయక బిరుదు రాజశబ్దానికి భిన్నమయినది. ఈ విషయం కాకతి గణపతిదేవ చక్రవర్తికాలపు కరీంనగర్ జిల్లా 1236 నాటి శాసనం ద్వారా తెలుస్తుంది. "రాజనాయక' ' అనే సైన్యాధిపతి గణపతిదేవుని వద్ద వుండేవాడని ఈ శాసన సారాంశము.

ఈ నాయక శబ్దం చోళ చాళుక్య కాలంలో కూడా వాడుకలో వుంది. అంతకుపూర్వపు పల్లవ రాష్ట్రకూట శాసనాలలో ఈ బిరుదు కన్పిస్తుంది. సామాన్య పాలనాధికారాలున్ననాటి పంచాయితీ వ్యవస్థలో, ఈ నాయక బిరుదులున్న, చోళ చాళుక్య కాకతీయ విజయనగర రాజుల కాలంలో, స్వరూప నిర్ధారణ సమగ్రంగా లేని వివిధ తెగల, వర్గాల మధ్య జరిగిన విమోచనోద్యమం. నాయక సమాఖ్య నిర్మాణ సమయాల్లో ఈ నాయక శబ్దం ప్రత్యేకమయింది. గౌరవ ప్రదమయింది. భట్రాజులు. గాయకులు, కవులు ఈ నాయకులను రాజ, రాయ శబ్దాలతో కీర్తించినా కమ్మ, బలిజ, రెడ్డి ముఖ్యులు - విజయనగర రాజగు వెంకటప్పయ్య నాయకుని వరకు నాయక బిరుదునే అభిమానించారు.

స్వతంత్ర పాలకులగు మధుర తిరుమల నాయకుడు. మంగమ్మ. తంజావూరు రఘునాధనాయకుడు. చెవ్వప్పనాయకుడు నాయకులుగానే కీర్తింపబడినారు. కుందూరి ఈశ్వరదత్తు గారి అభిప్రాయములో "రెడ్డి అనునది ఒక గ్రామము లేక గ్రామ సమూహములగు నాడు - సీమలో పౌరపరిపాలన, సైన్యాధికారము గల ఉద్యోగహోదాను తెలియచేస్తుంది. దుర్జయ వంశజులగు కమ్మ తెగ నుండి వేమాద్రి రెడ్డి యనునతడు గణపతిదేవుని మంత్రిగా నుండెను. తెలగ, కమ్మ, బోయ, వైశ్యులు ఈ హోదాను అందుకోగలిగిరి."

డా॥ సి. ఆర్. రెడ్డి గారు "రెడ్లు ఇతర కిసాను తెగలవలె దక్షిణ భారతదేశపు వ్యవసాయదారులు." గ్రామీణ కళలు చేతివృత్తులయిన వడ్రంగము, శిల్పము, కుడ్య నిర్మాణము, ఇటుకల తయారీ, కమ్మరి మొదలగు వృత్తులు వ్యాపారాలలో పేరుకెక్కిన వారు సహితం ప్రజానాయకులయినారు. వీరు శెట్టి లేక శ్రేష్ఠిగా గుర్తింపు పొందారు. వీరిలో కొందరు ఆయుధోపజీవులయి రెడ్డి, నాయుడు లేక నాయకుడు బిరుదములు వహించుటేగాక నాయంకరములు సంపాదించి పేరుమోశారు.

నందిగామలోని నతవాటిసీమ దుర్జయవంశస్థుడగు త్యాగి లేక చాగి పోతరాజు (క్రీ.శ. 1199) వంశావళి బ్రాహ్మణులచే శాసనబద్ధం చేయబడింది. వీరి పూర్వులు స్థానికులగు కిసానులు. వీరిని క్షత్రియులుగా వర్ణించారు. నాలుగు తరాల వృత్తాంతం ఈ శాసనాల్లో కలదు.

1. దొర, 2. పోత. అతని భార్య రాజాంబిక లేక 3. దొర అతని భార్య చమ్మాంబిక 4. ముప్పదుర్జయ. ఈ నాలుగు వృత్తాంతములు శాసనబద్ధములు. నాయక బిరుదు వహించుటకు మారు వీరు నీడు రాయుడు పదములను తమపేర్ల చివర జేర్చుకొని తమ నాయక వంశములను చాటుకొనిరి. బాపినీడు, సర్వారాయుడు, బుచ్చిరాయుడు ఇటువంటివే. కమ్మ, తెలగ, దళిత కుటుంబములలో "రాయలు" ఇంటిపేరు కలవారున్నారు.

ఈ నాయకులు కాకతీయ చక్రవర్తికి విశ్వాసపాత్రులు. కాని వీరిలో అనైక్యం చోటుచేసుకొన్నది. రాజబంధువులు కొత్తగా వచ్చిన లెంకలను చిన్నచూపు చూసేవారు. ఈ లెంకలను వెంకలు అనికూడా పిలిచేవారు. చక్రవర్తుల నుండి నాయంకరాలు పొంది చోళులతో చాళుక్యలతో యుద్ధాలు చేసిన నాయకులు స్వకులస్థులైన లెంకల పదోన్నతిని సహించలేక వారితో సౌహార్ధత పాటించక ఈర్ష్యాద్వేషాలు పెంచుకొన్నారు.

కొందరు కిసాన్ యోధులు "రెడ్డి" స్థాయినుండి నాయకులుగా ఎదగవలెనని తహతహలాడినారు. ఢిల్లీవారు ఇటువంటి వారిని ప్రోత్సహించారు. దేశద్రోహియగు "గన్నయ" ఇటువంటివాడే. ఈతడు యువకులగు బుచ్చిరెడ్డి, బొబ్బారెడ్లను మోసపుచ్చి ఢిల్లీ సామ్రాజ్యవాదులవైపు తిప్పినాడు.

కొందరినాహ్వానించుట, కొందరిని వెడలగొట్టుట, మరికొందరను నిర్లక్ష్యము చేయుట, అణచివేయుటతోనూ, పదవులు కొనుగోలు చేసుకొని కవులతో పౌరాణిక వ్యక్తులతో లేని సంబంధములున్నట్లుగా వ్రాయించుకొని, కొత్తకొత్త కులములు వర్ణసంకరములు ఏర్పడి, పౌరాణిక వంశముల వలె నూతన గౌరవములు కుటుంబములకు - కుదుళ్లకు కలిగినవి.

# మరోమాట

గోదావరి నదిని దాటివెళ్ళి బస్తర్ రాజ్య నిర్మాణం చేసిన ప్రతాపరుద్రుని సోదరుడు అన్నయ్యదేవుని వారసులని, వారు కాకతీయులమని చెప్పుకొనేవారనే చారిత్రాకాధారాలు ఈ మధ్యనే లభ్యమయినాయి. బస్తర్ చివరిపాలకుడు భంజదేవ్. ఈతని మరణం పిదప బస్తరు స్వతంత్ర భారతదేశంలో విలీనమయింది.

కాకతివారి ఉపాస్యదైవం కనుక వారు కాకతీయులుగా పిలువబడ్డారు. కాకతి యను దేవత నారాధించు ప్రత్యేకమైన కాకతి యనే తెగ వుండేదని తెలుస్తున్నది. ప్రస్తుత పార్లమెంటులో కాకతి అనే పేరుగల సభ్యుడున్నాడు. అతడు కాకతి తెగకు చెందినవాడు. కనుక కాకతీయులు ఈ దేశపు ప్రాచీన తెగలకు చెందినవారని భావించవలసి వస్తుంది. ఈ తెగవారు వ్యవసాయం కోసం, సాంఘిక రాజకీయ లబ్ధికోసం ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి వలస వెళ్ళేవారని భావించవచ్చు. రాష్ట్ర కూటుల వద్ద భూస్వామ్య పెత్తందార్లయినవీరు - భారతదేశపు వివిధ ప్రాంతాలలో భూస్వాములుగా, ప్రభువులుగా, నాయకులుగా వేరువేరు కాలాలలో భారతీయ చక్రవర్తుల పాలనలో ఎదిగారు. చాతుర్వర్ణ విభాగంలో ఇమడలేని కొందరు తమ "కాకతి" తెగనే కాపాడుకుంటూ తమ ప్రత్యేకతను నిల్పుకొన్నారు. "శ్రీ కాకతి" గారు పార్లమెంటుకు "నేఫా" నుండి ఎన్నికయ్యారు. హిందువులతో వివాహ రాజకీయ సంబంధాలు కలిగినవారు హైందవ సమాజంలో కలగలసిపోయారు. క్షత్రియత్వం ప్రసాదించటానికి బ్రాహ్మణులున్నారు కదా! ఈ ప్రాచీన కాకతి తెగవారు ఎప్పుడు ఎలా నాగాలాండు తదితర ప్రాంతాల నుండి దక్షిణ భారతానికి వచ్చారో లేక దక్షిణ దిశ నుండి ఈశాన్య భూభాగాలయిన నాగాలాండుకు వెళ్లారో తెలియదు.

## రెండవ భాగం

# వినాయక దేవుడు

## (నాటిక)

వేలుం పట్టణం ముట్టడింపబడినది. వినాయకదేవుడు బందీ అయినాడు. క్రీ.శ. **1362లో** అతడు, అతని నాయకులు గుల్బార్గా సుల్తాను మహమ్మద్‌షా ఎదుటకు తీసుకొని పోబడ్డారు. విజేతయగు సుల్తాను దయాదాక్షిణ్యములు లేనివాడని వారెరుగుదురు. వినాయకదేవుడు తన ప్రాణాలకై విచారించలేదు. వీరమరణం పొందనందుకు చింతాక్రాంతుడయివున్నాడు.

(సుల్తాను మహ్మద్‌షా ప్రవేశం - సభామర్యాదలు వగైరాలు తర్వాత - అభియోగము)

సుల్తాన్ : యువరాజా! వినాయకదేవా! మీరు యువకులు కార్యాచరణ సమర్థులు వీరనాయకులు. మీ ధైర్య సాహసాలు నాయకత్వ లక్షణాలు మమ్మ ముగ్ధులను కావించినది. అందువలననే మేము మీ తండ్రిగారితో స్నేహము వాంఛించినాము. మీరు మాత్రము మాతో విరోధించుచున్నారు. ఇక మా ప్రవర్తన మెట్లుండవలెను?

వినాయక దేవుడు : సుల్తాన్ మహాశయా! ఈ ఇచ్చకపు మాటలు పొగడ్తలు ఎందుకు? మేము మీపై మీ తండ్రిగారిపై అకారణముగా కయ్యమునకు కాలుదువ్వితిమా?

సుల్తాను : మరి మమ్ములను ఇన్ని విధములుగా ఏల రెచ్చగొట్టితిరి?

వినాయక : రెచ్చగొట్టుటా! అది ఏమి?

సుత్తాను : కన్ననూరు మొదలగు ఓడరేవుల నుండి వచ్చు **మాగుఱ్ఱము**ల నటకాయించుట రెచ్చగొట్టుట కాదా! మా అరబ్ **వ్యాపారులు** వారి గుఱ్ఱములు ఇంతకు ముందు మీ భూభాగములలో ప్రయాణించలేదా? వారినేల ఇప్పుడు అటకాయించితిరి? ఏల స్వాధీనము చేసుకొనిరి?

వినాయక : లేక మా వేళ్ళతో మా కళ్ళు మమ్మే పొడుచుకొమ్మందురా? మీరీ గుల్బర్గముల‌ను మాపై యుద్ధము చేయుటకే కొనిరని మాకు తెలియును.

సుల్తాను : అట్లేల మీరాలోచింపవలయును? మనము గత యుద్ధానంతరము సంధి చేసుకొనలేదా? మీ సామ్రాజ్య దురాక్రమణ చేయమని యొప్పందము కాలేదా?

వినాయక : అహహా! మీకు యొప్పందములు - (వెటకరించును) మాటలు అనిన ఎంత గౌరవము! అహహా!

సుల్తాను : వినాయక దేవా! ఏమా ధైర్యము? (గద్దించును)

వినాయక : మీ తండ్రి గారు మా తండ్రిగారికి చేసిన మర్యాద తెలిసి ఇంకేమనగలము? ఢిల్లీ సుల్తాను మీపై దండెత్తినప్పుడు మా తండ్రి మీకు సహాయపడలేదా? మాసాయమే ఆనాడు మీకు లేకున్న మీరు మీ తురకసరదారులు ఢిల్లీ సైన్యములను త్రిప్పికొట్టగలరా! దానికి మీరు చూపిన కృతజ్ఞత ఎట్టిది? చేసిన ఉపకృతి ఏమి? అకారణంగా ఆంధ్రసామ్రాజ్యంపై మీ తండ్రి గారు దురాక్రమణ చేయుటయా? మా సహాయముచే సుల్తాను గద్దె నెక్కిన విషయము మరచినాడు కాబోలు!

సుల్తాను : మీ తండ్రికంతకన్న గత్యంతరమేమున్నది? ఢిల్లీ సుల్తాను మీకు వ్యతిరేకికాదా? మీ స్వలాభము కొరకు ఆనాడు మీరు మా పక్షము వహించితిరి.

వినాయక : స్నేహమునకు అర్థము మీకెట్లు తెలియును? ఢిల్లీ సైన్యములు ఉత్తరము నుండి మీపై దాడిచేసినప్పుడు మేము ఆంధ్ర నుండి మీపై దాడిచేసిన మీగతి ఏమైయుండెడిది? మా నాయకులు మా సైన్యాధ్యక్షులు ఈ సలహా మాకీయలేదా? వారిని కాదని మీకు సహాయము చేయుట చేతనే బహమనీ సుల్తాను నేడీ విధముగా మాట్లాడగలిగినాడు.

సుల్తాను : అట్లు మీరు చేసిన వరంగల్లు మాత్రము ఢిల్లీవారిచేతిలో నాశమయి వుండదా?

వినాయక : అవకాశము కలదు. కానీ ఇప్పుడు మేమేమి బాపుకొంటిమి? అట్లు జరిగియుండిన కాకతీయ బహమనీ సామ్రాజ్యములు రెండునూ ఒండొంటి ప్రక్క చిరనిద్ర పొందెడివి.

సుల్తాను : అట్లయిన మీ తండ్రిగారు మాకేల సాయము చేసెను?

వినాయక : మీ తండ్రికి కృతజ్ఞత, విశ్వాసములు, నాగరికత తెలియుననుకొన్నారు. మీరింత దారిదోపిడీ దొంగలనుకొనలేదు.

సుల్తాను : యువరాజా! ఇంత నిర్లక్ష్యము, నోటి దురుసుతనము మంచిది కాదు.

వినాయక : సుల్తాన్ మహమ్మద్ షా - నిజము చెప్పుటకు మేమేల భయపడవలయును?

సుత్తాను : వినాయక దేవా! మీ తండ్రి విజ్ఞుడు. సుల్తానగుటకు మాకుగల హక్కును గుర్తించినాడు. మీ తండ్రి రాజనీతికోవిదుడు కనుకనే ఢిల్లీ సుల్తాను నోడించుటకు మాతో చేతులు కలిపినాడు. ఎంతో సమయస్ఫూర్తితో యుద్ధములో మాది పైచేయిగా వున్నప్పుడు సంధి చేసుకొని **30 లక్షల** రూప్యములు అత్యంత విలువగు బహుమతులు మాకిచ్చినాడు.

వినాయక : సుల్తాన్ మహాశయా! మీరు అకారణముగా మా కోటపై ముట్టడిచేసినప్పుడు మేము ఓడిపోవుదుమని కానీ, మిమ్ములను గెలువలేమని భయముతో గానీ మీతో సంధి చేసుకొనలేదు. మా ప్రజలను మతభ్రష్టులను చేయుదురని మాతరతరాల సంస్కృతీ వారసత్వమును ధర్మమును నాశము చేయుదురని మీ సైన్యములు మా గ్రామముల నాశముచేసి మా పంటల పల్లార్చి మా స్త్రీల మానమర్యాదలు మంటలో గలుపుదురని మా దేవాలయముల అపవిత్రము చేయుదురని మాత్రమే సంధి చేసుకొంటిమి. మీవారు సైనికులు కారు. దొంగలు. మీ సైన్యాధిపతులు నాయకులు కారు. రహదారి దోపిడీగాళ్ళు.

సుల్తాన్ : వినాయకదేవా! నీవు పొరపాడితివి. మా సైనికులకు మా మతమునందున్న విశ్వాసమటువంటిది. మా మతౌన్నత్య సాధనే వారిపరమ లక్ష్యము. మీ అనాగరిక విగ్రహారాధన, అతికోలహలముగా మీరు జరుపు జంతుబలుల ప్రార్థనా విధుల నిరసనే వారినట్లు చేయించినది. బుద్ధిహీనులు, అనాగరిక విగ్రహారాధకులగు మీ ప్రజలను రక్షించుటే వారిధ్యేయము.

వినాయక : ఏమి చక్కని సమర్థన! అటులయిన ఢిల్లీ సైన్యములు బహమనీ సామ్రాజ్యముపై దాడిచేసి సోదర ముస్లింలపై ఏల యుద్ధము చేసినవి. యుద్ధమున ఏల వారిని వధించినవి? మొదటి బహమనీ సుల్తాను వరంగల్లు హిందూ చక్రవర్తి సాయమేల కోరెను? ఇవి యన్నియు ఒట్టిమాటలు. మీరు మతముకై పోరాడుట యనునది అబద్ధము. మీ కవసరమగునప్పుడు మాతో స్నేహమునకు, మా విగ్రహారాధన, మా జంతుబలులు, మా కుల పట్టింపులు, మా సామూహిక ప్రార్థనా విధులు మా దేవతలు దేవుళ్ళు మీకు ఆటంకం కాలేదు.

సుల్తాన్ : మరి మా విజయములకు మీ పరాజయములకు అర్థమెట్లు చెప్పెదవు? అల్లాహో అక్బర్ అను మా యుద్ధపుకేక మా సైన్యముల నుత్తేజపరచి వారి మనసులలో నిలిచి ఉప్పొంగించి వారి తెగింపును పెంచి మాకు విజయలక్ష్మి నందించును.

వినాయక : మా కాకతిమాత పరమశివుడు శ్రీరామచంద్రులపై మాకదే విశ్వాసమున్నది.

సుల్తాన్ : మీ సైన్యములకైక్యం ఎక్కడిది? ఒకే యుద్ధ నినాదము మీకు కలదా?

వినాయక : సుల్తాన్ మీరు చెప్పినదానిలో సత్యము లేకపోలేదు.

సుల్తాన్ : మాకుపకరించినవెన్నో కలవు. అందువలననే ఈ విజయము లన్నియు సాధ్యపడినవి.

వినాయక : ఎల్లప్పుడూ మీరు గెలిచితిరా, మీ ఢిల్లీ ముస్లింలు ఏడుసార్లు వరంగల్లు వారితో పోరాడి ఓడిపోలేదా? మీ ఉలుగుఖాన్ పిరికిపందవలె తన సైన్యములను వదలి ప్రాణాలు రక్షించుకొనుటకు పారిపోయినప్పుడు నేను బాలుడను. నేను తుగ్లక్ సైన్యముల వెంటాడి తరుముట మీకు తెలియని విషయమా? ఆహా! ఆ పారుబోతుల పరాక్రమము మెచ్చవలసినదే.

సుల్తాన్ : వినాయకదేవా. మేమిప్పుడు విజేతలము. మీరు మా బంది, పాతగొప్పలు చెప్పనేల?

వినాయక : "విధి విలాసమను బంగరు పళ్ళెమునకు గెలుపోటములు - ఇరువైపులు" ఇందు గొప్పేమున్నది?

సుల్తాన్ : యువరాజా.... మనము స్నేహితులుగా వుండలేమా.

వినాయక : మేము మీతో స్నేహము చేయలేదా? బహమనీ సుల్తాను వారికి మా స్నేహముపై ముఖము మొత్తినది. మీరు కళలను శాంతిని ప్రేమించలేరు. సహించలేరు. భగవంతుని మీరు మానవత్వంలో దర్శింపలేరు. రక్తతర్పణములందే మీకు భగవత్సాక్షాత్కారము కలదు.

సుల్తాన్ : ఎంత ధైర్యము! మామతమునే అవమానించుటకు సాహసించుచుంటివిగా!

వినాయక : శివ శివా! హైందవుడనైన నేను భగవదపచారము కలనయినా చేయుదునా! భగవంతునిపై విశ్వాసము ఎటువంటిదయినను నాకును పూజనీయమే. భగవంతునిపై మీ విశ్వాసము మిమ్ములనీ క్రూరకృత్యములు చేయమనినదా! మహమ్మద్ ప్రవక్త మాకు పూజనీయుడు. వారి అనుచరులను మాత్రము మేము అభిమానించలేము.

సూల్తాన్ : సంతోషము సంతోషము. ప్రక్కరాజ్యములపై దండయాత్రలు చేయుట మాతోనే మొదలయినదా?

వినాయక : ఏమంటిరి? మా వలన అటువంటి పొరపాటు జరిగినదా?

సుల్తాన్ : మరి కాళేశంను ఏల ముట్టడించితివి?

వినాయక : అది మా కోటలలో మణిపూస. దానిని ముట్టడించి స్వాధీనము చేసుకొని మా పరాక్రమముపై తొడచరచి మా హృదయాలలో కత్తులు గుచ్చితివి. మా హృదయాలను మేము విడిపించుకోవలదా? బహమనీ కత్తిని మా వరంగల్లు గుండె నుండి పెరికివైచుట దురాక్రమణ ఎట్లగును? కాళేశంను వదలుటకు మేమంగీకరించినా మేము మా జాతికి వరంగల్లుకు మా లెంకలకు మా వీర సంప్రదాయములకు మా ఆయుధములకు అపచారం చేసిన వారమగుదుము. కాకతిమాత మమ్ములను శపించి యుండెడిది.

సూల్తాన్ : (హేళనగా) ఓష్ కాకతి - కాకతిమాత (నవ్వును)

వినాయక : మా తల్లిని అవహేళన చేయకుము. మేము పరాజితులమయినట్లు మీరును యుద్ధమున మట్టిగరచు అవకాశముండకపోదు. పరస్పరము వీరులుగా గౌరవించుకొందము.

"వీరత్వము శాశ్వతము - విజయము క్షణికము"

సుల్తాను : యువరాజా! మీరు యువకులు ఉత్సాహవంతులు. మీరు మీముసలి తండ్రిని వదిలి మాతో చేతులు గలిపిన మన మిరుపురము ఢిల్లీ సుల్తానును మట్టి గరిపించగలము.

వినాయక : శ్రీరామచంద్రుడు మా ఆదర్శము. తండ్రి ఆజ్ఞను శిరసావహించుట మా జాతి ధర్మము. పితృద్రోహము చేయుటకు మేము ఉలుగుఖాన్ వంటి నీచులకు కాము. ఇటువంటి అసమంజసపు సలహాలు మీకే చెల్లును.

సుల్తాన్ : అట్లయిన మీ తండ్రిగారు మాతో చేసుకొన్న నిర్యుద్ధ సంధిని మీరేల గౌరవించలేదు! పితృాజ్ఞాబద్ధులు కదా!

వినాయక : మీ గుఱ్ఱములు మా భూములలో స్వేచ్ఛగా తిరుగాడుట ఆ సంధిలో భాగము కాదు.

సుల్తాన్ : మా నాణేముల నేల కరిగించితిరి? అది మాపై ప్రత్యక్షముగా కాలుదువ్వుట కాదా? మేమీ అవమానము సహించి వూరుకొందుమనుకొంటిరా?

వినాయక : సంధిలో మీ నాణెముల నంగీకరించుట భాగము కాదే. దానివలన మీకు గలిగిన నష్టమేమి?

సుల్తాన్ : ఏమి నష్టము - మా ప్రతిష్ఠకు నష్టము. దానికారణముగనే ఈ యుద్ధము మీ భంగపాటు. మీ దయనీయస్థితి.

వినాయక : దయనీయ స్థితి. భంగపాటు. నిజమే మేమోడిపోతిమి. అది యోధుల జీవితములో నొకభాగము. ఇంతమాత్రము తెలియదా! అయిననేమి! మేము మరణమునకు భయపడువారము కాము. మృత్యుదేవత కౌగిట ఓదార్పు పొందుటయే మాకానందము. నీకీ సైనిక ధర్మముపై అవగాహన లేదా? మా నాయకులు లెంకలు మొదట వీరస్వర్గమును వివాహమాడి తరువాతనే ఈ నేలపై తిరుగాడు స్త్రీలకు భర్తలగుదురు. మేము, మీముందు బందీలుగా నిలచిన మా లెంకలు, నాయకులు ఎవరి దయా దాక్షిణ్యములకై చేయుసాచువారము కాము. మేము మరణము నాహ్వానించుచున్నాము. మమ్ము సగౌరవముగా మృత్యువుకు అప్పచెప్పి నిన్ను నీవు గౌరవించుకొనుము. యుద్ధ ధర్మముల గౌరవించుము.

సుల్తాన్ : మరణించుట కెందులకీ ఆత్రము? మా సార్వభౌమాధికార మంగీకరింపుమని మీ తండ్రికి నచ్చ చెప్పుము.

వినాయక : సుల్తాన్! మా తండ్రిని ఎవరిగా భావించితివి? ఈ ఆంధ్రదేశమును, దక్షిణాపథమును ఢిల్లీ సామ్రాజ్యధికారము నుండి విడిపించి, తన కీర్తిని శాశ్వతముగా దిగంతములకు వ్యాపింపచేసిన ధర్మమూర్తి.

సుల్తాన్ : మేమునూ ఢిల్లీ సుల్తానుకు వ్యతిరేకులమే. మన యిరువుర ప్రయోజనమొక్కటే. మనమీ ప్రయోజనము కలిసి ఏల సాధించరాదు?

వినాయక : మరల నొకసారి మోసపోవుటకా? ఢిల్లీవారికి మీకుగల వ్యత్యాసమేమి? మీ సామ్రాజ్యాధికారము నంగీకరించుట మాత్రమే గౌరవప్రదమా?

సుల్తాన్ : వినాయక దేవా! మాది దక్కను. ఢిల్లీ పాలకులు పరాయివారు.

వినాయక : మీరును ఢిల్లీవారివలె దురాక్రమణకై ఇచటకు వచ్చినవారే కదా?

సుల్తాన్ : వినాయక దేవా! మీ వివేక మేమయినది. బుక్కరాయలు, మీ తండ్రి, ఢిల్లీ సుల్తానును మాపై యుద్ధమునకు ప్రోత్సహించలేదా. ఢిల్లీవారు పరాయివారంటివి కదా?

వినాయక : యువకులమగు మేము ఆ ఆలోచనను నిరసించితిమి. బహమనీ సుల్తాను కృతఘ్నత కుచ్చితములు మమ్మందులకు వొప్పుకొనునట్లు చేసినవి. యుద్ధనీతిలో అది యొకభాగము.

సుల్తాన్ : అట్లయిన మీరు ఇస్లాం మతంకు వ్యతిరేకులు కాదుగదా?

వినాయక : లేదు సుల్తాన్ లేదు. మేము ఇస్లాంను మహమ్మద్ ప్రవక్తను ఏల నిరసింపవలెను? ఏల తృణీకరింతుము. ఇన్ని మతములతో ఇందరు దేవతలతో ప్రవక్తలతో సహజీవనము చేయు మేము ఇస్లాంను గౌరవింపలేమా? మీరు మతము పేర ప్రవక్త నామమున చేయు దుర్మార్గములకు, మీ అధికార వ్యామోహమునకు, ఆశబోతుతనమునకు మాత్రమే మేము వ్యతిరేకులం.

సుల్తాన్ : వినాయక దేవా! రేచర్ల భువనగిరి నాయకులు మాతో సహకరించుటకు సిద్ధముగా నున్నారు. వారివలె మీరును వివేకము కలిగి ప్రవర్తించుడు. వారి మార్గము ననుసరింపుడు.

వినాయక : వారి మార్గము! అది కుట్ర కుహకముల మార్గము.

సుల్తాన్ : కుట్రా! ఎట్లగును? మీ తండ్రి వారికి సార్వభౌముడు కాడే.

వినాయక : మా తండ్రి వారికి సురత్రాణుడు. కాపయ నాయకుడు "ఆంధ్ర సురత్రాణుడని వారంగీకరింపలేదా? వారు నాయక సమాఖ్యలో భాగస్వాములు కారా? బహమనీ సుల్తాను మాలో కలహములు సృష్టించుచున్నాడు.

సుల్తాన్ : బహమనీ సుల్తానుతో చేతులు కలిపి ఢిల్లీవారితో యుద్ధము చేయుట అది మాలో మాకు అంతః కలహములు సృష్టించుట కాదా?

వినాయక : ఢిల్లీవారు మాకు శత్రువులు. మా నాయక సమాఖ్యను భగ్నము చేయుటకు ప్రయత్నించుచున్నారు. మీరు మా స్నేహితునివలె మా పొరుగు వానివలె నటించుచూ మమ్ము మోసపుచ్చు ప్రయత్నములు చేయుచున్నారు.

సుల్తాన్ : మమ్ములను కూడా మీ నాయక సమాఖ్యలో భాగస్వాములుగా తలచలేరా!

వినాయక : మీ ఒప్పందముల నెట్లు నమ్మవచ్చును? మీరు మా ప్రజలపై చేసిన దౌర్జన్యములు అత్యాచారముల నెట్లు మా దేశము క్షమించగలదు? మీ పాపాలకంతులేదు.

సుల్తాన్ : మేమింకను పరాయి దేశస్థులమేనా!

వినాయిక : మీరు మీ వారసులు మా భాషను మా ఆచార వ్యవహారములను మా ధర్మమును ప్రేమించి గౌరవించువరకు.

సుల్తాన్ : మీకెట్లు నమ్మకము కలుగను?

వినాయక : ప్రజలను మా జాతీయ ధర్మబద్ధముగా పాలించినపుడు.

సుల్తాన్ : ఏమిటా ధర్మము?

వినాయక : (విచారంగా) పూజనీయుడగు వీరభల్లాళుని పట్ల మలబారు సుల్తాను నీచ ప్రవర్తనను ఒక భారతీయుని నుండి ఆశింపగలవా? భారత ధర్మోద్ధారకునిగా పేరుగాంచి మా ప్రజలకు ఆరాధ్యుడయిన ఆ వృద్ధవీరుని మా ప్రజలెంతగనో పూజించిరి.

సుల్తాన్ : అతడు మలబారుపై దండెత్తెను. ఆ ముసలి, కన్ననూరు ప్రజలను కూటికి నీటికి అలమటింపచేసెను. ఇదియేనా అతని ధర్మవర్తనము అతని పూజనీయత?

వినాయక : మీరు ఆంధ్రదేశముపై దండెత్తిరాలేదా?

సుల్తాన్ : అపుడు మేము చిన్నవారము.

వినాయక : మా దేశమున నిరంకుశత్వమును నిర్మూలించుటకు వృద్ధాప్యము అడ్డురాదు. సుల్తాను నిరంకుశుడు. ప్రజాద్రోహి. అందులకే 80 సంవత్సరముల వయస్సులో వీరభల్లాళ చక్రవర్తి మలబార్‌పై దండెత్తెను.

సుల్తాన్ : అతడు ఓడింపబడి బందీయై శిక్షింపబడినాడు.

వినాయక : యుద్ధ ఖైదీని అగౌరవించుట మా ధర్మము కాదు. మహారాజు, వృద్ధుడు, చక్రవర్తియగు నాతని హింసించి దయారహితముగా చంపుటకన్న పాతకము మేము వూహింపలేము.

సుల్తాన్ : ప్రజలను భయభ్రాంతులను చేయలేని వాడెట్లు రాజగును?

వినాయక : మీవంటి క్రూరులకు, భల్లాళుడు, మా తండ్రివంటి ధర్మపరులకు తేడా ఇందే యున్నది.

సుల్తాన్ : ఎంత ధైర్యము, మేము క్రూరులమా?

వినయాక : వీర భల్లాళునికి జరిగిన అవమానమును సమర్థించుటకన్నా క్రూరత్వమేమున్నది?

సుల్తాన్ : మీ తండ్రి ప్రవర్తన మాత్రమెట్లున్నది?

వినాయక : మా తండ్రి భల్లాళునితో, హరిహరారాయలుతో, కంచి మధుర నాయకులతో ఒప్పందములు చేసుకొని గౌరవించినాడు. సహాయ మవసరమగునప్పుడెల్లా వారికి సహాయపడినాడు. వారు నట్లే ప్రవర్తించిరి. మా రక్షణకు వచ్చిరి. రాయ సోదరులు మమ్ములను సమర్థించలేదా? ధర్మానుసరణమనగా నదియే. కానీ మీరు మా తండ్రికి ద్రోహము చేసితిరి. మా నమ్మకము నీరుకార్చిరి. కృతఘ్నతతో దుర్బుద్ధితో వ్యవహరించిరి.

సుల్తాన్ : ధర్మము ధర్మము అదియే మంత్రమువలె జపించుచున్నావు. దైనందిన రాజ్యపాలనలో ధర్మవర్తనమనగానేమి?

వినాయక : నికర వ్యవసాయాదాయంలో రాజు 1/6వ వంతుకు మాత్రమే హక్కుదారుడు. ప్రజాసంపదలో పరిశ్రమలలో ఆతని జోక్యముండరాదు. రైతును బలహీనునిగా చేయరాదు. నష్టపరిహారమీయక ఆతని భూమి

స్వాధీనము చేసుకొనరాదు. స్త్రీలను అవమానపరచరాదు. సుంకములు శిస్తులు మీ ఇష్టము వచ్చినట్లు పెంచినారు. మీ దేశములలో మా పాలకులు ఇట్లే పాలించిరా! గ్రామ స్వామ్యములో జోక్యము చేసుకొనుట. కులమత ఆచార వ్యవహారాలలో జోక్యము నిషేధము. దేవాలయముల వాటి ఆస్తుల గౌరవించుట మా ధర్మము. ఈ సామాజిక హక్కులను మీరు గుర్తించుటలేదు. మా సమాజ వ్యవస్థను మీరు కాలరాయుచున్నారు.

సుల్తాన్ : మీ తండ్రి ఈ ధర్మముల నాచరించెనా?

వినాయక : గ్రామ పంచాయితీల అనుమతి లేనిదే మా తండ్రి ఏ గ్రామములోను అడుగుపెట్టలేదు. ఆహారధాన్యములు పాడిపంటలు బలత్కారముగా లాగుకొనలేదు. యువకులను బలవంతముగా సైన్యములో జేర్చుకొనలేదు. సైన్యములు కొనిన వస్తువులకు వెల చెల్లించెడివాడు. ప్రజల ఆరాధనా విధులను గౌరవించెడివాడు. ప్రజలకు ముఖ్యముగా స్త్రీలకు జరిగిన ఎంత చిన్న అమర్యాదకైనను నష్టపరిహారము చెల్లించెడివాడు.

సుల్తాన్ : ధర్మ ప్రకారము మీపట్ల మా వైఖరి ఎట్లుండవలెను?

వినాయక : యుద్ధవీరుల ఆత్మగౌరమునకు తగిన విధముగా మాకు మరణము విధింపుము.

సుల్తాన్ : మీరు ఇస్లాం మతము స్వీకరింపుడు.

వినాయక : హిందువులుగా మరణించుటయే మాకు సంతోషము. గన్నమ నాయకుడు జగన్నాధ పండితునివలె మేము ద్రోహులము కాదు.

సుల్తాన్ : బహమనీ సుల్తాను ఎడల మీకేమీ బాధ్యతలు లేవా?

వినాయక : ఉండిన ఇరువురకు సమానమే.

సుల్తాన్ : మీరు మాపై తిరుగుబాటు చేసితిరి.

వినాయక : మేము మిమ్మెప్పుడు మారాజుగా గుర్తించలేదు.

సుల్తాన్ : బ్రాహ్మణులెందరో మలి మతమును కౌగిలించుకొనినారు, జగన్నాథ పండితునిచూసి నేర్చుకొనుట.

వినాయక : వారావనిని మనస్ఫూర్తిగా చేసినవారిని అభినందింతును. వారు బలాత్కారముగా మార్చబడిరి.

సుల్తాన్ : మీరు మాత్రము ఎందరు బౌద్ధులను, జైనులను హింసించలేదు? శైవ, వైష్ణవ మతముల నిప్పించలేదు?

వినాయక : మేము మానవత్వముతో ప్రవర్తించుట తెలుసుకొంటిమి. అటువంటి వేధింపుల మానితిమి.

సుల్తాన్ : మన మధ్య సామరస్యతకు అవకాశము లేదా?

వినాయక : ఏ ప్రాతిపదికపై.

సుల్తాన్ : మా సార్వభౌమాధికారమును వరంగల్లు అంగీకరించవలయును. మీ తండ్రి మా వద్ద నాయకునివలె ప్రవర్తించవలెను.

వినాయక : నా బొందిలో ప్రాణముండగా అది జరుగదు. నా తండ్రి ప్రాణము లయినను వీడును గాని ఈ దౌర్భాగ్యమున కంగీకరింపడు.

సుల్తాన్ : మీ అభ్యంతరములేమి?

(పై సంభాషణ లన్నియు రాగిరేకులపైన దేవాలయములపైనా శాసనములుగా వ్రాయబడినవే)

వినాయక : బహమనీ సామ్రాజ్యము నిన్న మొన్నటిది. శతాబ్దముల చరిత్ర వరంగల్లుకు కలదు. మీ బహమనీ సామ్రాజ్యము ఢిల్లీ సామ్రాజ్యము నుండి వారి పైశాచిక దారుణ మారణకాండ నుండి, మానభంగముల నుండి ఆవిర్భవించినది.

సుల్తాన్ : బహమనీ సుల్తాను సార్వభౌమాధికారమునకు కైమోడ్చి విజయ సంకీర్తనము గావింపుము.

వినాయక : నా నాలుక కోసినను నేనాపని చేయను.

సుల్తాన్ : అహహ... నీ మాట ప్రకారమే చేసిన నీవేమి చేయగలవు?

వినాయక : నీ వంతకు దిగజారుదువని నాకుతెలియును.

సుల్తాన్ : వినాయకదేవా! నీపట్ల ఎంతో ఉదారముగా వ్యవహరించితిని. నీకు వివేకము లేదు. నీకు మాతో రాజీపడు నుద్దేశ్యము లేదు. మాకు లొంగుట లేదు. నీవు రాజనీతివేత్తవుకావు. కనుక నిన్ను బంధవిముక్తుని చేయపనిలేదు. నీ నాలుక తెగగోయవలసినదిగా ఆజ్ఞాపించుచున్నాను. మరల మరల ధర్మము ధర్మము అను నిర్ధకపు మాటలనిక మాట్లాడలేవు.

వినాయక : నాకేమియు భయము లేదు. పశువుల ప్రవర్తన ఇంకెట్లుండును! నా నాలుక కోయుము. కానీ ఇంతవరకు నన్ను మాట్లాడనిచ్చి నందులకు మీకు నా ధన్యవాదములు. నా నాలుక పోయిన మాత్రమున నేమయినది? నా శరీరమున ప్రతి అణువు ధర్మము ధర్మమని వేనోళ్ళ సహస్రఫణియగు ఆదిశేషునివలె ఘోషించును.

సుల్తాన్ : నీ కోర్కె తప్పక తీర్చెదను. మీ వేయి తలలపాముపలె నీ శరీరమును ముక్కలుముక్కలుగా చేసెదను. నీకింకేమయినా కోర్కెలున్నవా?

వినాయక : నేను మరల ప్రబోధించుచున్నాను. యుద్ధ ఖైదీకి ఇవ్వవలసిన గౌరవము యిచ్చి వీరుడవనిపించుకొనుము.

సుల్తాన్ : అట్లు చేయనిచో?

వినాయక : నా ప్రజలు తెలుసుకొందురు. నా తండ్రి తెలుసుకొనును. ఢిల్లీ సర్పముల నుండి తనచే రక్షించబడిన ఒక విషకీటకము తనను కాటువేసినదని.

సుల్తాన్ : నీవు శిక్షార్హుడవు. నీ ప్రేలాపనల కంతములేదు. నీ నాలుక కోయ వలయును. ఇతని శరీరము కోటగోడపై నుండి పేల్చివేయబడవలయును. ముక్కముక్కలుగా వెదజల్లబడవలయును.

వినాయక దేవుడు - ఓం శాంతిః శాంతిః శాంతిః నా శరీరమును నాశనము చేయగలవు. ధర్మమును నాశనము చేయలేవు. నీవు నాచే పలికించిన పలుకులు, స్వతంత్రాలోచనలు వేనోళ్ళ ప్రజలనోట ప్రతిధ్వనించి, నా ప్రజలు శక్తిమంతులు సంతోషస్వాంతులు స్వతంత్రులు అగుదురు. భగవంతుని, ధర్మమును ఆశ్రయించిన వాని ఆత్మకు చావులేదని మా విశ్వాసము.

కాకతీయ నాయకులకు, ప్రతాపరుద్ర చక్రవర్తికీ ప్రోల మహారాజుకు జయము.

నా ప్రజలకు శాంతి కలుగు గాక.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# వివరణలు

## 1. కాకతీయ నాయకులు

1. ఒంగోలు (నేటి ప్రకాశంజిల్లా) జిల్లాలోని చందలూరులో లభ్యమయిన పల్లవ - రెండవ కుమార విష్ణు తామ్రశాసనం క్రీ.శ. 673లో 'కర్మకార రాష్ట్రము' లేక కమ్మరాష్ట్రః అను పేర్లు కలవు. క్రీ.పూ. 400 నాటి అమరావతి శాసనంలో మహరవ కమ్మలు - నవకమ్మలు అనే రెండు తెగల బోధకులు పేర్లుదహరించ బడినవి. మల్కాపురం - పరిశోధనావ్యాసంలో శ్రీ సి.హెచ్. పూర్ణచంద్రరావు గారు కాకతీయులు కమ్మ తెగల నుండి ఉద్భవించారు అని వ్రాశారు.

2. (1) ఈ దుర్జయుడు చారిత్రక వ్యక్తి. శ్రీకాకుళం, విశాఖ, గంజాము జిల్లాలతో కలసియున్న కళింగ దేశానికి అధిపతి. విష్ణుకుండిన మహారాజు మూడవ మాధవవర్మ కీ.శ. (546-611) ఈతనిని ఓడించినట్లు కీ.శ. 583 శాసనం ద్వారా తెలుస్తున్నది. (మన సంస్కృతి - చరిత్ర పేజీ. 137)

(2) వెలనాటి చోడుడు వారి బంధువులు, మిత్రులునగు కమ్మ, రెడ్డి, వెలమ, తెలగలు తాము దుర్జయులుగా చెప్పుకొన్నారు. (మల్లంపల్లి సోమశేఖర శర్మ Forgotten Chapter of Andhra History P-55.

(3) కాకతీయులు, వెలనాటి చోడులు వీరి వారసులగు ప్రోలయ కాపయలు వీరి బంధువులు తాము కళింగ దుర్జయ వంశీకులుగా కీర్తించుకొనినారు. ఎందరో లెంకలు తాముప్రతాపరుద్రుని కుమారులుగా, మనుమలుగా చెప్పుకొన్నారు. ప్రతికూల పరిస్థితుల వలన తామెంత సాంఘికంగా వెనుకబడినా తమ అధికారాన్ని ప్రాముఖ్యతలను నిలుపుకొనుటకు వీరెంత పట్టుదలతో వ్యవహరించిందీ అర్థం చేసుకోగలము. వారు తమ పూర్వీకుని విజయపరంపరలనూ కీర్తిని తమ బంధుత్వాన్ని తమ సాంఘిక ఔన్నత్య సాధనకు మెట్లుగా మలుచుకొన్నారు. దుర్జయవంశజులగు కిసాను తెగలవారు తమ రాజకీయాన్ని కళింగంతో ప్రారంభించి పశ్చిమ చాళుక్యుల ఆదరణ, తూర్పు చాళుక్యుల అండతో ఆంధ్రదేశాన్ని యావత్తూ తమ రాజకీయాధికార పరిధిలోనికి కాకతీయుల కాలం నాటికి తీసుకొని వచ్చి ప్రోలయ కాపయ వినాయకదేవుల నేతృత్వంలో ఢిల్లీ

సామ్రాజ్యవాదంపై విప్లవం నడిపారు. వారి సాహసోపేత రాజకీయ జీవితం, వారి దేశభక్తి తత్పరతకు పరాకాష్ఠ అయింది.

(4) కళింగ దుర్జయుని పరాజయం తరువాత ఆతని వారసులు విజేతల వేధింపుల నుండి రక్షించుకొనుటకు మరుగునబడియుండవలసి వచ్చినది. సామాన్య వొడ్డె వంశములు వారిగా (కాళింగులు - ఓఢ్రులు - వొడ్డెలు) మరల ఫ్యూడల్ అధికారాలు సంపాదించుకొనువరకూ కాలం వెళ్ళబుచ్చారు. కాకతీయులు సామంతవొడ్డె వంశస్థులుగా చెప్పుకొన్నారు. కాకతీయ గుండ్యన - హనుమకొండ ప్రభువు కుమార్తెను పెండ్లాడాడు. తన చెల్లెలు కామసానిని విరియాల వంశపు "ఎఱ్ఱన" కిచ్చి వివాహం చేశాడు. ఈ వివరాలు కాకతీయులు కళింగవీరుడగు దుర్జయుని వారసులని ఋజువు చేస్తున్నవి. (క్రీ.శ. 6వ శతాబ్ది) కాకతి గుండ్యన, అతని తరువాత అతని భార్య కుంతల మహాదేవి మహామండలేశ్వరులై, బలవంతులగు విరియాల నాయకుల బాంధవ్యంతో తాము దుర్జయ వంశస్తులుగా ప్రకటించుకొన్నారు. వారి వారసులు కూడా తాము దుర్జయులమనే పేర్కొన్నారు.' ' (కాసె సర్వప్ప - సిద్ధేశ్వర చరిత్రము, పేజీ XXV-II).

చోళ చాళుక్యరాజులు తమ అంతః కలహాలతో బలహీనపడినప్పుడు, వీరు స్వతంత్ర మండలాధీశులుగా పాలకులై చోళ చాళుక్య ప్రభువుల గుర్తింపు పొందారు. విరియాల వారి వలెనే వీరు తాము దుర్జయ వంశస్థులమని బాహాటంగా చెప్పుకొన్నారు. (ప్రతాపరుద్ర దేవ చరిత్రము 6 పరిచయం. పేజి-25).

(5) భారతి, మార్చి 1970, వెలనాటి చోడ లేక చోళరాజ కుటుంబముల వారు స్థానిక ఆయుధోపజీవులగు రైతు తెగలతో వివాహ సంబంధాలు నెరపినారు. కంచి చోళుల ఆధిక్యత అంతరించిన పిదప స్థానిక నాయకులు బలవంతులయినప్పుడు వీరు "వెలమలు" గా పిలువబడ్డారు. నేటికి కమ్మవారిలో "వెలమాటి" వెలగా లేక వెలుగు వారున్నారు. వెలమ లేక వెలమాటి లేక వెలనాడు రేచర్ల నాయకులు కాకతీయులకు సన్నిహితులుగా రుద్రదేవుని కాలం నుండి వుంటూ కాకతీయ సామ్రాజ్య నిర్మాణ భాగస్వాములయినారు. వీరు సమాజంలో వెలమలుగా పిలువబడ్డారు. చోళ దండయాత్రలతో దక్షిణ దిశ నుండి "వెల్లాలులు" కూడా ఆంధ్రకు వచ్చియుందురు.

# 2. కాకతీయ సమాజము - వారసత్వము

1. తిక్కన శిష్యుడగు కేతన రచనల నుండి తెలుసుకొనవచ్చును.

2. మహారాజు, రాజు, నాయకుడు ఎవరైనప్పటికీ సర్వాధికారిగా గుర్తించబడినా, వారి అధికారము హైందవ ధర్మము, హైందవ సమాజ ప్రాచీన కట్టుబాట్ల కనుగుణంగానే సాగింది.

3. ధర్మాతిక్రమణము జరుపబడలేదు. (YAZDANI - OP.CIT.P.671) ఈ కాలము నందలి రాజన్యులు మత సామరస్య ధోరణి ప్రదర్శించినారు తిక్కన కవి ప్రేరణతో గణపతిదేవుడు ఓరుగల్లులో జైనుల హింసించడం అపవాదం - (మలయశ్రీ).

4. రాజేంద్రచోళుడు, భూమిని, రైతులకు భూములపై గల హక్కులను క్షుణ్ణంగా సర్వే చేయించాడు. (నీలకంఠశాస్త్రి - చోళులు 2వ ఎడిషన్ 18 మరియు 21 అధ్యాయాలు).

5. జాయపసేనాని అయ్యవంశస్థుడు. చేబ్రోలు, చందోలుల నేలిన ప్రభువు. నారమ్మ, పేరమ్మల సోదరుడు. గజసాహిణి. కాకతీయ శిల్పానికి లక్షణ గ్రంథం అనతగిన నృత్త రత్నావళి రచించాడు.

పాకాల శాసనంలో జాయపసేనానిని గూర్చి "కవి చక్రవర్తి" గణపతిదేవుని ఆస్థాన కవి ఇలా వ్రాశాడు.

"మన్త్రీ కావ్య నిరూపణే ప్రియసుహృద్వి స్రంభసంభాషణే కావ్యారంభవిధే కవిః సహచరస్సంగీత సంపాదనే కర్తా శిల్పకళాకళాపవిషయే సంప్రేషణే కింకరో యుద్ధే యశ్చలమర్తిగండ నృపతే రగ్రేసరో వర్తతే॥

# 3. కాకతీయ చక్రవర్తులు

గణపతిదేవుడు - రుద్రమదేవి

1. వరంగల్లు ఢిల్లీ దురాక్రమణదారుల వశమయిన తర్వాత ఈ రాయితీలను అద్దంకి ప్రభువగు అనపోతారెడ్డి (క్రీ.శ. 1324-30) కూడా మంజూరు చేశాడు. సామ్రాజ్య

పతనానంతరము స్థానిక ప్రభువులు స్వతంత్రత ప్రకటించుకొనే వారనుటకు ఇదొక నిదర్శనం.

2. ఈ ప్రభుస్వామ్య కుటుంబం, కళింగ గంగవంశమునకు చెందినదై యుండును. **క్రీ.శ. 815-977** వరకు ఈ వంశం గాంగవంశంగా ప్రసిద్ధి చెందింది. (P. 189 of S. Srinivasa Chary "History of India - hindu Period). ఈ కారణాన కళింగ గంగవంశానికి చెందిన కాయత్సులుగా అతడు చెప్పుకొని యుండవచ్చును.

3. కమ్మవారగు గంగినేని, త్రిపురనేని వారు తమ పూర్వీకుల సాహసాలను, దేశభక్తిని, రాజనీతిజ్ఞతను ఎల్లప్పుడూ మననం చేసుకొంటారు.

4. "మీకు చక్రవర్తి జన్మించినాడు" అని పొత్తిళ్ళలో బిడ్డను (ప్రతాపరుద్రుని) సింహాసనముపై నుంచి ప్రజలకు చెప్పినది (సిద్దేశ్వర చరిత్రం).

5. ఎంతో భూమి వ్యవసాయ యోగ్యం చేయబడిందని లోకల్ రికార్డుల ద్వారా తెలుస్తున్నది. గణపతిదేవుడు రుద్రమదేవి ప్రతాపరుద్రుడు శ్రీకాకుళం అడవులను నరికించి, వాసయోగ్యం, వ్యవసాయయోగ్యం గావించారు. నీటిపారుదల సౌకర్యాలు మెరుగుపరిచారు. (YAZDANI O.PC.T.P.682)

6. కాకతి పాలకులందరూ ప్రజా సంక్షేమానికి పాటుపడినవారు, బోగలాలసులు కారు. ఇతర రాజులవలె వందలు వేల భార్యలను కలిగి లేరు. సతీ సహగమనాలు సాగించలేదు. మందడ, పుష్పగిరి, శ్రీశైలం గోళకీమఠాలు విద్యా, ఆరోగ్య రంగాల్లో ప్రజలకు సేవచేశాయి. నాడు వ్యవసాయం వ్యాపారం చేతిపనులు వృద్ధిచెందాయి. (మలయశ్రీ - కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం)

7. హనుమకొండ నివాసులైనట్టి బౌద్ధ
జనుల రావించి వారిఁ దిక్కన మనీషి
తోడ వాదింపజేసిరి తొడరి వారి
జులకగా సోమయాజులు గెలుచుటయును

(స్థానిక చరిత్రలు)

తిక్కన కవి బౌద్ధుల (జైనులు)తో గణపతిదేవుని పంపున వాదించి గెలిచినాడని అర్థము.

# 4. కాకతీయులు - ఢిల్లీ

1. దేవగిరి రామచంద్రదేవుడు ఉత్తరదేశంలో ముస్లిం ప్రాముఖ్యతను గమనించలేక పోయాడు. గుణపాఠాలు నేర్వలేకపోయాడు. ఈర్ష్యాపరులైన వరంగల్లు, ద్వార సముద్రం, మధురపాలకులు కూడా ముస్లిం సామ్రాజ్యవాదాన్ని కలసికట్టుగా ఎదుర్కొనలేదు - (History of Deccan).

ప్రతాపరుద్రుడు, రుద్రమదేవి మంత్రుల వద్ద, సాంప్రదాయక రాజనీతి నేర్చాడు. రుద్రమదేవి ఆతని 17వ సంవత్సరము నుండి రాజ్య పాలనావకాశం కల్పించింది. ప్రతాపరుద్రుడు కౌటిల్యుని అర్థశాస్త్రము, నారాయణ భట్టు పంచతంత్రము, భర్తృహరి సుభాషితాలు, అధ్యయనం చేశాడు.

2. మాలిక్‌కాఫర్ ఢిల్లీకి మరలిన తర్వాత అంబదేవుడు (కడప, కర్నూలు జిల్లాలో) అతని అనుచరులు, నెల్లూరు నాయకులు, స్వతంత్రత ప్రకటించుకొన్నారు. ప్రతాపరుద్రుడు వీరిపై దండెత్తి వీరిని తన ఆధిపత్యం క్రిందకు తెచ్చుకొన్నాడు.

3. నాడు "నిర్యుద్ధసంధులు" లేవు. దురాక్రమణల నుండి రక్షణలు లేవు. ఢిల్లీ సైన్యాలు నిరంతరం పశ్చిమ ఆసియా దేశాలు నుండి వచ్చే సాహసికులతో నిండియుండేది. వీరందరూ మత పిచ్చితో తరలివచ్చినవారు. అంతేకాక వరంగల్లునందలి అమూల్య సంపద కాశించి వచ్చినవారు ఎక్కువమంది.

4. గన్నమ నాయకుని కుమారుడు దేశభక్తి తత్పరుడై ప్రోలయ నాయక సమాఖ్యలో చేరి తండ్రి చేసిన ద్రోహమునకు ప్రతిగా దేశవిముక్తి కొరకు పోరాడిన కమ్మనాయకుడు.

5. మారేమండ రామారావు. "మొదట దురాక్రమణ అల్లాయుద్దీన్ ఖిల్జీ క్రీ.శ. 1308లో చేశాడు. ప్రతాపరుద్రుని సైన్యాలు "ఉప్పరపల్లి" వద్ద శత్రువుల నెదుర్కొని ఓడించినవి. గియాజుద్దీన్ తుగ్లక్ కుమారుడు ఉలుగూఖాన్ దక్షిణదేశ రాజుల నోడించి సామ్రాజ్యం విలీనం చేసుకొనుటకు దురాక్రమణ సాగించాడు. కాకతీయ సైన్యాల ధాటికి తట్టుకొనలేక దేవగిరికి పారిపోయాడు. ఎంతో సైన్యసంపద నష్టపడ్డాడు. క్రీ.శ. 1323లో మరల మెరపుదాడి చేశాడు. కాకతీయ సైన్యాలు దక్షిణదేశంలో చిక్కుబడియున్నవి. రాజధానిలోయున్న సైన్యాలు ఈ దాడిని ప్రతిఘటించలేకపోయినవి. ప్రతాపరుద్రుడు బందీగా చిక్కి నర్మదా తీరాన అసువులు వీడాడు. (కలువ చెరవు శాసనం).

## 7. వరంగల్లు నగరం

1. మారేమండ రామారావు, "Select Kakatiya Temples"
2. J.D.B. Gribble, "History of Deccan"
3. J.D.B. Gribble
4. మారేమండ రామారావు
5. ఏకామ్రనాథ, "ప్రతాపరుద్ర చరిత్ర"

## 9. ప్రోలయ - కాపయ

1. చోళుల సంప్రదాయానుసారం దేవాలయాలు గ్రామీణులు మిగులు ధనానికి ఖజానాలుగా ఉపయోగపడేవి.

2. ఏకామ్రనాథుని "ప్రతాపరుద్ర చరిత్ర" ఆధారంగా - ప్రతాపరుద్రునకు ఇరువురు కుమారులు. విరూపాక్ష దేవుడు - వీరభద్ర దేవుడు. విరూపాక్ష దేవుడు తన పినతండ్రితో వింధ్య సాత్పుర శ్రేణులలో, అరణ్యములతో నిండిన బస్తరులో సామ్రాజ్య స్థాపన చేశాడు. కొందరు నాయక వీరుల సహకారంతో వీరభద్రుడు స్వతంత్ర పోరాటాలు సాగించాడు. అందువలన నాతడు సమాఖ్యలో భాగస్వామి కాలేకపోయెను.

3. "ముసునూరు" అను గ్రామములు నెల్లూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో కలవు. వ్యవసాయ కుటుంబముల వారెక్కువమంది ఈ ఇంటిపేరుతో వున్నారు. వారు ముసునూరి ప్రోలయను తమ పూర్వీకునిగ చెప్పుకొని కీర్తిస్తారు.

4. ఉదాహరణకు ప్రోలయ వేమారెడ్డి, ప్రతాపరుద్రుని తర్వాత స్వతంత్రుడై అమరావతిని కబళించి అచట నుండి పాలన చేశాడు. నాయక సమాఖ్య ఇటువంటి సామ్రాజ్య విస్తరణ కాంక్ష గలవారిని నిర్దాక్షిణ్యంగా దండించింది.

## 10. విప్లవ విజయము

1. కాకతీయ వంశస్థుడు, వీరుడు, విజేత, ప్రతాపరుద్రుని సమీప బంధువగు నీతని ధర్మ రక్షకుడు, ముస్లింల నుండి రక్షించుట కవతరించిన సాక్షాత్ భగవదవతారమని

ప్రజలు కొనియాడారు. తమ బిడ్డలకు పుల్లయ్య, పుల్లమ్మ, పోలి, పోలయ్య అని పేర్లు పెట్టారు. ప్రోలి నాయక వెలమలు లేక ప్రోలు లేక పోలి వెలమలు అను వ్యవసాయ కుటుంబాలు ఈనాడూ వున్నాయి.

# 12. ఒడిదుడుకులు

1. విలస శాసనము - మల్లంపల్లి సోమశేఖర శర్మగారు దీనిని ప్రకటించిరి. క్రీ.శ. 1330న ఈ దానశాసనము లిఖించబడినది. అప్పటికి దక్షిణాపథము విముక్తి చెందినదని భావించవచ్చును.

2. ఈ విచారోదంతం తరువాత బుక్కరాయలు ఢిల్లీ సుల్తాను ఫిరోష్ షా సాయమర్థించాడు. తన సమస్యలతో సతమతమగుచున్న షా బహమనీ సుల్తానుపై దండయాత్ర చేయుటకు సిద్ధపడలేదు. అంతేకాక అతని మౌల్వీలు, సర్దారులు హిందువుల కొరకు ఇస్లాం మతస్థులపై యుద్ధము తగదని వారించిరి.

వినాయక దేవుని మరణముతో కోపోద్రిక్తుడయిన కాపయ ప్రతీకార సాధనకు తన యావచ్ఛక్తిని పణముగా పెట్టదలచిననూ, విధి అనుకూలించక పరాజితుడాయెను. సుల్తాను 90 మైళ్ళ దూరము నున్న గోల్కొండ నుండి తన శిబిరాన్ని వరంగల్లుకు మార్చెను. రాజులు తరతరాలుగా దాచియుంచిన నిధి నిక్షేపములను స్వాధీనము చేసుకొనెను. (ఫెరిస్తా). ఇవి గత వంద సంవత్సరముల నుండి దాచబడ్డ సంపద మాత్రమే. అంతకు పూర్వము కీ.శ. 1323 నుండి కొంతకాలము వరంగల్లు ముస్లింల ఆధీనములో, వారి రాజప్రతినిధుల పాలనలో యుండెను. ఈ పరాజయము ఆంధ్రులకు తీరని నష్టము కల్గించెను. అభేద్యమయిన గోల్కొండ కోట బహమనీ వారి వశమయినది. బహమనీ రాజ్యమునకు, వరంగల్లుకు ఈ కోట సరిహద్దుగా నిర్ణయించబడినది. 300 ఏనుగులు 200 గుఱ్ఱములు, 33 లక్షల రూప్యములను కాపయ బహమనీ సుల్తానుకు చెల్లించెను. ఇంతేకాక ప్రఖ్యాతి వహించిన మరకత సింహాసనము (పచ్చల సింహాసనము)ను కూడా సుల్తాను స్వాధీనము చేసుకొనెను. ఈ సింహాసనపు విలువ 35 లక్షల రూప్యములుండునని అంచనా వేయబడినది. సుల్తానీ సింహాసనమును గుల్బర్గాలో అధిష్టించి వేడుకలు జరుపుకొని, త్రాగి, వ్యభిచారాది విలాసముల తేలి హిందూరాజులను అకారణ దుర్భాషలాడి అవమానపరచెనన్న విషయము తెలిసి హిందూరాజులు అవమాన భారమున క్రుంగిపోయిరి.

# 13. కాకతీయ నాయకుల వారసత్వము

1. చెడుగుడు దోబూచి చిట్ల పొట్లకాయ గుడుగుడు గుంచాలు గూవనాళ్ళు, చీకటి మెటికళ్ళు సిరిసింగనాపత్తి కుప్పిగంతులు నెట్లు కుందికాళ్ళు, తూరన తువాలు గీరన గింజలు గుజగుజరేకుల గుంటచాళ్ళు, పింపిళ్ళు కుచ్చెళ్ళు పిడిగ్రుద్దులాటలు దాగిలిమ్రుచ్చులు బిళ్ళ, బొమ్మరాలువ్వల పొట్టి వెన్నెలకుప్పలప్పళావాలంకు లందలములు, పుట్ట చెండ్లుప్పన బట్టె లచ్చునగండ్లు పిల్ల దీపంబులు పిల్లగోళ్ళు గంజెన, గాలీనెగాజులు నాల్గు కంబాలాట బట్టిన గోలలాకె, పీకాట బొమ్మల పెండ్లిండ్లు ఓమనగుంటలు గుజ్జెన గూళ్ళనండి, కోల క్రోతుల గొబ్బెళ్ళు, కుందెనగుడి గచ్చకాయలు కనుమూసి గంతలల్లి, చిక్కినా బిల్లలోటిల్లు చిందెలరయ - ఒప్పునాటలపేర్లయి -

మట్టియలుజ్జ్వల మణి నూపురంబులు
  మొల నూలు వస్త్రముల్ ముత్తియములు
కట్టు వడంబులు గట్టినూళ్ళును సుద్ద
  సరితీగె మిణుకులు సందిదండ
లంగుళీయకములు హారి కంకణములు
  చేకట్టు పావెలు చెన్ను మెరుగు
టాకులు సరిపెణలాలస్తకము పూత
  కాటుక తిలకంబు కమ్మ పువ్వు
లాదిగా గల మేలి ద్రవ్యముల నొప్ప
  పసతనమున చేసి యుచిత రూపంబుదాల్చి  - కేతన

**వల్లెడ** : వివాహ సందర్భములలో వల్లెడ పట్టునాచారమిప్పటికీ కలదు. వల్లెడ యనగా ఒక తెల్లని దుప్పటిని గొడుగువలె కఱ్ఱతో అమర్చి నాలుగు చెఱుగులు నలువురు పట్టుకొని మంగళవాద్యములతో దైవపూజలకు బాసికములు మంగళ సూత్రములు ఐరేని కుండలు తెచ్చుటకు ఉపయోగింతురు. ఇది ప్రభులాంఛనమయిన తెల్లగొడుగు (ఛత్రం) కు మార్పు - వెల్లగొడుగు - వల్లెడగా రూపాంతరం చెందింది - అనువాదకుడు.

2. వీరగంధం, వీరపనేని, మాకినేని, మాచినేని, వీరమాచినేని, సూరపనేని, నన్నపనేని, నాగినేని, ముప్పనేని, పర్వతనేని, కొమ్మినేని, రామినేని, త్రిపురనేని, గంగినేని, గోగినేని, కోమటినేని, చోడె, ఓరుగంటి, ఇమ్మడి, ముమ్మడి, గండు, ఒంటరి, రావెళ్ళ కొసరనేని (కాసరనేని), సూరిరెడ్డి, కంఠంనేని, గుత్తికొండ, సాయపనేని, శరణు, నాగళ్ళ, గద్దె, ముసునూరి, అంబడి, కోట, కోటగిరి, వెలుగు, వెలుగోటి, గాదిరెడ్డి, వాసిరెడ్డి, కొమ్మారెడ్డి, కొమ్మిరెడ్డి, రాటకొండ, రాసులకొండ, రేవుల, రేవెల్ల, రావి, రాయిడి, సబ్బి, పల్లె, పల్లెపు, వెలమాటి, అనెగొంది, గొందె, లక్కమసాని, ఒట్టినేని, బొల్లినేని, పెనుగంటి, ఇనగంటి, కోట, త్రిపర్నేని, హనుమోర, లింగం, మాన్యం, మైనేని, చింతమనేని, ముమ్మలనేని, మన్నె, కాతినేని (కౌతినేని), మిక్కిలినేని, మానం, సాగి, నల్లబోతు, కొలసాని, చలసాని వంటి వంశములు ఈ శాఖలే.

3. కాపయ మరణానంతరం, సుల్తానుచే వరంగల్లు గద్దె నెక్కించబడిన రేచెర్ల వెలమ నాయకులు తమ వ్యక్తిత్వమును ప్రదర్శించసాగిరి. ప్రభుస్వామ్యములో ఇది సహజ పరిణామము. వరంగల్లు మహారాజు (రేచర్లవారు) సుల్తానుకు కప్పము కట్ట నిరాకరించిరి. సుల్తాను రేచర్ల నాయకులను ఓడించెను.

4. నాడు ఆంధ్రదేశమున అత్యధిక భాగమునకు ప్రభువులైయున్న వెలమలు, రెడ్లు పరస్పర మైత్రి సహకారములు లేకయుండుటే కాక విజయనగరపు వారికి కూడా సహకరించలేదు. ఈ కారణముననే రెడ్ల ప్రభుత్వము ఒక శతాబ్దము మాత్రమే నిలిచి తుదకు విజయనగర గోల్కొండ సామ్రాజ్యములలో విలీనమయినది. వెలమలు గోల్కొండ సామ్రాజ్యమున సామాన్య భూస్వాములుగా మిగిలిరి.

# వరంగల్లు మహానగరము

ఓరుగల్లు పురం విరాజతే తత్రగోపుర కరాంచితాంబరం
దేవతా భవన భవ్య భేరికా రావరాజిత విమానగహ్వరం
గోపురములనెడు కరములతో ఆకాశమునందు వ్యాపించియున్న ఓరుగల్లు నగరం వర్ధిల్లుచున్నది. మంగళవాద్య ధ్వనులతో నిండి దేవాలయ గోపురములు రాణించుచున్నవి. (ఖండవల్లి శాసనం - ఇందులూరి వారు 1289 విద్దనాచార్యుడు.)

1. ఓరుగల్లు - క్రీడాభిరామం నుండి

సప్తపాతాళ విష్టప మహా ప్రస్థాన
ఘంటాపథంబైన గనప పరిఘ
తారకామండల స్తబకావతంసమై
కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించిన భువనగోళము భంగి
సంకులాంగణమైన వంకధార
మెరుగు రెక్కలతోడి మేరు శైలముబోలు
పెనుపైడి తలుపుల పెద్దగవని
చూచె చేరె ప్రవేశించె జొచ్చె బ్రీతి
సఖుడు దానును రథ ఘోటశకటి కరటి
యూధ సంబాధముల కొయ్యె నోసరిలుచు
మందగతి నోరుగల్లు గోవిందశర్మ!

గడియారము :

మ॥ ఉడు వీధిన్ శిఖరావలంబియగు నంద్రోర్వీశుమోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్
సడలెన్ భానుడు పశ్చిమంబునకు వైశ్యాపూటకూటింటికిన్
గుడువంబోదుమె లెక్కయిచ్చికడునాకొన్నారమిప్పట్టునన్!

అటులనే "ఓరుగంటి పురంబుపై నొప్పారెడున్ చూచితే
ఈరెండల్ మణి హేమకుంభములతో "ఏకాంతమున్ సేయుచున్నవనియు -
"రాజమార్గంబు వారణ ఘటా ఘోటక శకటికా భట కోటి సంకులమనియు"
ధరణీ స్థలీ రజస్త్రరేణు బహుళంబు అనియు చెప్పాడు.
"మండపాకను పెనుమాక మాహురమున
నాగవరమున బోలాస ననిచెనింతి
యోరుగంట వసించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడు ఏకవీర" అని ఏకవీరాదేవి యునికి తెల్పినాడు.

అనుబంధము - 1

# 1. ముసునూరి ప్రోలయ నాయకుని "విలస" శాసనము

ఈ శాసనం తూర్పుగోదావరి జిల్లా పిఠాపురమునకు సమీపంలోని కందరాడ గ్రామంలో శ్రీ హుండి వెంకటరావు పంతులు గారిచే 1856లోనే కనుగొనబడింది. కాని బహుకాలం తరువాత ప్రకటింపబడింది. ఇందులో చతుర్థకులజుడును, ముసునూరి వంశజుడును అయిన ప్రోలయ నాయకుడు చంద్రగ్రహణ సమయమున (సంవత్సరము, నెల ఉటంకింపబడలేదు) భారద్వాజ గోత్రజుడును, అన్నయ కుమారుడును, గణపయ సోదరుడును అయిన వెన్నయ అను బ్రాహ్మణ పండితునికి కోనసీమ (నేటి అమలాపురం తాలూకా)లోని విలస గ్రామమును అగ్రహారంగా దానం ఇచ్చినట్లు అభివర్ణింపబడింది.

1. యాం ప్రేమ్ణా శశిమౌళినా గజముఖో గాఢం సమాలింగిత
శ్చాపల్యా చ్ఛశినః కలాం కరతలేనాదాయ మూర్ధ్ని స్థితాం
నిక్షిప్యేతరదంతసమ్ని సమమాత్ సంలక్ష్య దంతద్వయః
కల్యాణం వితనోతు సా శశికలా విఘ్నేశ్వరః సోऽపి వః॥

2. పుష్టిం కృషీష్ట వః పోత్రి పురాణః పురుషోత్తమః
యద్దంష్ట్రాహరిణాంకస్య వసుధా లాంఛనాయతే॥

3. ఉపాత్త సత్త్వో భగవానాదౌ నారాయణో విభుః
అద్రాక్షీ దమ్మయం విశ్వమున్మీలన్నయనాంబుజమ్

4. తతః పరీతో రజసా గుణేన బ్రహ్మా ముపాశ్రిత్య తనుం మహేశః।
అకల్పయ త్పూర్వవదేవ లోకా న్సర్వాన్ కృపార్ద్రీకృతచిత్తవృత్తిః॥

5. సముద్రద్వీపసంవీతా హేమాచలమనోహరా।
సర్వేషా మపిలోకానాం, మధ్యస్థేయం వసుంధరా

6. తస్యాశ్చ రత్నగర్భాయాః సర్వస్యా మధ్యవర్తినం।
జంబూద్వీపం విదుర్దేశం లవణాంబుధివేష్టితమ్॥

7. ద్వీపేఽపి తస్మిన్నవధా విభక్తే హిమాచలా ద్దక్షిణ మాసముద్రం
భాగం భువో భారతవర్షమాహుః ఫలన్తి కర్మాణి కృతాని యత్ర॥

ప్రోలయ నాయకుడు కమ్మ కులమునకు చెందినవాడని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు నిర్ణయించారు (Forgotten Chapter of Andhra History P.33). ఇందులో సంవత్సరం ఉటంకింప బడకపోయినప్పటికీ, ఈ దానశాసనం క్రీ.శ. 14వ శతాబ్దిలో నాలుగు, అయిదు దశాబ్దాల నాటిదని కూడా నిర్ణయింపబడింది. నేటి అమలాపురం తాలూకా లోని విలస గ్రామమే శాసన ప్రోక్తమైన అగ్రహారం.

శాసనంలోని భాష సంస్కృతం. గ్రామ సీమా నిర్ణయంలో మాత్రం తెలుగు భాషయే ఉపయోగింపబడింది. వెన్నయ నుండి అగ్రహారమును దానముగా గ్రహించిన బ్రాహ్మణుల పట్టిక గల శ్లోకములు, గ్రామసీమా నిర్ణయమును తెలుపు వాక్యములు తప్ప శాసనపాఠమంతయు యథాతథముగా ఇయ్యబడుతూంది. ఎదురుగా తెలుగు అనువాదం కూడా జోడింపబడింది.

1. శివునిచే ప్రేమతో కౌగిలింపబడిన గజముఖుడు తండ్రి శిరస్సుపై గల శశికళను చాపల్యముచే అరచేతిలోనికి తీసికొని, రెండవ దంత ప్రదేశమున నిక్షేపించి (దానినే రెండవ దంతముగా భావించి) దంతద్వయమును కొలిచెనో, ఆ శశికళయు. ఆ విఘ్నేశ్వరుడును మీకు శుభము చేకూర్చుగాక!
2. ఎవరి దంష్ట్రయనెడి చంద్రునికి భూమియే లాంఛనమగుచున్నదో ఆది వరాహుడగు ఆ విష్ణువు మీకు పుష్టినొసంగు గాక!
3. సత్త్వగుణప్రతిష్ఠితుడైన భగవాన్ నారాయణుడు ఆదియందు నేత్ర పద్మములను తెరచి జలమయమైన విశ్వమును పరికించెను.
4. అంతట రజోగుణముచే కూడినవాడై బ్రాహ్మీమయమైన తనువును ఆశ్రయించి దయార్ద్రచిత్తుడై సర్వలోకములను పూర్వమువలెనే సృష్టించెను.
5. సర్వలోకములకును నడుమనున్న ఈ భూమి సముద్రములతో ద్వీపములతో కూడినదై సువర్ణ పర్వతముతో మనోహరమై యొప్పారుచున్నది.
6. రత్నగర్భయగు ఆ భూమికంతటికి మధ్యభాగమున విరాజిల్లుచు లవణ సముద్రముచే పరివేష్టింపబడిన ప్రదేశమును జంబూద్వీపమందురు.
7. ఆ జంబూద్వీపమున హిమాచలము నుండి దక్షిణమున సముద్రము వరకు తొమ్మిది భాగములుగ విభజింపబడిన భూభాగమును భారతవర్షమందురు. అచ్చట చేయబడిన కర్మలన్నియును ఫలవంతములే.

8. భాషా సమాచార భిదా విభిన్నే దేవైరనేకై ర్బహుధా విభక్తే!
వర్షే చ తస్మిన్ కమనీయవాసస్త్రిలింగనామో స చకాస్తి దేశః॥

9. మహర్ధి రమ్యాణి పురాణి నద్యః పుణ్యోదకా రమ్యతరా మహీధ్రాః
వనాన్య సేవ్యాన్యతలాస్తటాకా దుర్గాణ్యధృష్యాణి చ సంతి యత్ర॥

10. ఏవం విధా మంబుధిమేఖలాంతామపీపలన్ ధర్మనయక్రమేణ
సోమార్కవంశ్యా నరపాలవర్యాః పురాణసిద్ధాః పురుహూతభాసాః॥

11. గతేషు తేషు క్షితి పాలకేషు క్షితీశ్వరాః కాకతి వంశజాతాః
కాలే కలౌ సంప్రతి వర్తమానే తిలింగ మాఖ్యాయ శశాసు రుర్వీః

12. తేషామేకశిలానామనగరీ పృథివీక్షితాం।
ఇక్ష్వాకూణా మయోధ్యేవ రమ్యాऽభూత్కులవాసభూః॥

13. కాలక్రమాత్ ప్రయాతేషు తేష్వనల్పపరాక్రమః
ప్రతాపరుద్రో నృపతిః పాలయామాస మేదినీమ్॥

14. సర్వేऽపి దానప్రవణా మనుష్యా ద్విజాతయో యజ్ఞపరాస్సమస్తాః
కలిస్తదాऽసీత్ కృతకాలచిహ్నో యస్మిన్ మహీం శాసతి వీరరుద్రే॥

15. యస్మిన్ మహీం శాసతి శాసనాంకాం ప్రజాః ప్రజాపాలనకర్మదక్షే।
నాస్మార్షు రాద్యాన్నరపాలముఖ్యాన్యయాతినాభాగభగీరథాద్యాన్॥

16. అథైవం శాసతా తేన తురుష్కాణా మధీశ్వరః।
అహమ్మదు సురత్రాణో మహద్వైరం సమాచరత్॥

17. భూపాలలయకాలేన యేన నిశ్శేషతాం గతాః
జామదగ్న్యేన రామేణ హతశేషా మహీభృతః

18. వీరద్భటభట స్సోऽపి వీరరుద్రః ప్రతాపవాన్।
అజయ త్సప్తకృత్వ స్తం నవలక్షాశ్వసాధనమ్॥

19. నీతి ప్రశస్తోऽపి బలాధికోऽపి సహాయయుక్తోऽపి చ వీరరుద్రః।
భాగ్యక్షతే ర్మానుషమండలస్య తురుష్క భర్తు ర్వశతా మయాసీత్॥

20. స నీయమానో నగరీం స్వకీయాం దిల్లీం ప్రయత్నాద్యవనేశ్వరేణ।
సోమోద్భవాయాః సరితః ప్రతీరే దైవాదయాసీత్త్రిదశాధివాసం॥

8. విభిన్న భాషలచే బహువిధములైన ప్రాంతములుగ విభజింపబడిన ఆ భారత వర్షమున త్రిలింగదేశము సుమనోహరమై యొప్పారుచున్నది.

9. ఆ త్రిలింగదేశమున రమ్యములైన నగరములు, పుణ్య జలములు గల నదులు, రమ్యతరములైన పర్వతములు, వనములు, తటాకములు దుర్భేద్యములైన దుర్గములు కలవు.

10. సముద్ర వేష్టితమైన ఆ దేశమును పురాణ ప్రసిద్ధులు సూర్యచంద్ర వంశజులైనరాజవర్యులు ధర్మబద్ధముగా దేవేంద్ర వైభవముతో పరిపాలించిరి.

11. పూర్వరాజులు, రాజవంశములు గతించిన వెనుక కలికాలము ప్రవర్తిల్లుచుండగ ఈ త్రిలింగదేశమును కాకతి వంశజాతులైన రాజులు పరిపాలించిరి.

12. ఆ త్రిలింగ దేశమున కాకతివంశ ప్రభువులకు ఏకశిలా నగరము ఇక్ష్వాకు వంశజులకు అయోధ్యవలె రమ్యరాజధానియై విలసిల్లెను.

13. కాలక్రమమున ఆయారాజులు గతింపగా అమిత పరాక్రమోపేతుడగు ప్రతాపరుద్ర నగరపాలుడు భూమిని పరిపాలించెను.

14. ప్రతాపరుద్రుడు రాజ్యపాలన చేయుచుండగా మానవులందరు దానపరులు, అందును బ్రాహ్మణులందరు యజ్ఞపరులు నగుటచే కలికాలము కృతకాల చిహ్నములు దాల్చెను.

15. ప్రజాపాలనయందు సమర్థుడగు ఆతడు రాజ్యమును శాసించుచుండగా ప్రజలు యయాతి, నాభాగుడు, భగీరథుడు మున్నగు పూర్వచక్రవర్తులను స్మరింపకుండరి.

16. ఇట్లు అతడు పాలించుచుండగా తురుష్క చక్రవర్తియగు అహమ్మద్ సుల్తాన్ అతనితో మహావైరము నవలంబించెను.

17. జామదగ్న్యుడైన పరశురామునిచే చంపబడగా మిగిలిన రాజులెల్లరును, క్షత్రియుల పాలిట లయకాలుడైన అహమ్మద్ షా చేత నిశ్శేషముగ వధింపడిరి.

18. పరాక్రమవంతుడు. మహావీరుడునగు వీరరుద్రుడు కూడ నవలక్షాశ్వపతియగు ఆ తురుష్కరాజును ఏడుమార్లు జయించెను.

19. నయకోవిదుడైనను, బలాధికుడైనను. సహాయ యుక్తుడైనను వీరరుద్ర చక్రవర్తి ప్రజల భాగ్యహీనత వలన తురుష్క ప్రభువుచేత జిక్కెను.

20. ప్రతాపరుద్రుడు తురుష్క ప్రభువుచేత తన రాజధానియగు ఢిల్లీ నగరమునకు కొనిపోబడుచు నర్మదానదీ తీర ప్రాంతమున దైవవశమున స్వర్గస్థుడయ్యెను.

21. ప్రతాపరుద్రతిగ్మాంశౌ లోకాంతరతిరోహితే!
తురుష్కాంధతమిస్రేణ సమాక్రాంతం మహీతలం॥

22. ప్రతాపరుద్రేణ పరం పరాస్తో రిపూ నధర్మో యవనాన్ గతోను।
నో చేద్గతేక స్మిన్ యవనైస్సహైవ కథం నిరాబాధసుఖం జజృంభే॥

23. కేచి ద్ధనాఢ్యాః పరిబాధ్యమానా ధనాయ పాపైర్వివిధైరుపాయైః।
కేచి న్నిరీక్ష్యైవ చ పారశీకాన్ పర్యత్యజన్ ప్రాణనభస్వతోఽన్యే॥

24. ద్విజాతయ స్త్యాజితకర్మబంధా భగ్నాశ్చ దేవప్రతిమా స్సమస్తాః .
విద్వద్వరిష్ఠై శ్చిరకాలభుక్తా స్సర్వేఽ ప్యపాహారిషతాగ్రహారాః॥

25. ఆత్తే కర్షణలాభౌ పాపైర్యవనై ర్బలాత్కారాత్।
దీనాదీనకుటుంబాః కృషీవలా నాశమాపన్నాః॥

26. ధనదారాదికే నృణాం కస్మింశ్చిదపి వస్తుని।
స్వాయత్తతామతి ర్నాభూద్భువి తస్యాం మహాపది॥

27. పేయా సురా గోపిశితం చ భోజ్యం, లీలావిహారో ద్విజఘాతనం చ।
అశ్రాంత మాసీ ద్యదనాథమానాం కథంను జీవేద్భువి జీవలోకః॥

28. ఇత్థం తైర్యవనభటైః ప్రబాధ్యమానం తైలింగం ధరణితలం సురారికల్పైః।
త్రాతారం కమపి హృదా వ్యవిందమానం సంతేపే వనమివ దావవహ్ని జుష్టమ్॥

29. అనంతరం సంస్కృతి యావనం తామాలోక్య పీడామనుకంపమానః।
అంశావతీర్ణో భగవానివాద్యః ప్రోలక్షితీశో వసుధాం బిభర్తి॥

30. పుంసః పురాణస్య పదా దుదీర్ణం వర్ణం యమాహుః కలికాలవర్యమ్।
తత్ర ప్రశస్తో ముసునూరి వంశో యజ్జన్మధామ ప్రథతే పృథివ్యామ్॥

31. స ప్రోలభూపో ముసుసూరివంవశ్య స్తథావిధం యావన మాధిపత్యం।
విశ్వోపజీవ్యేన విశృంఖలేన వ్యసీనశ ద్బాహుబలేన వీరః॥

21. ప్రతాపరుద్రుడను సూర్యుడు లోకాంతరమునకేగి తిరోహితుడు కాగా తురుష్క సమూహమను కారుచీకటి భూతలమంతట క్రమ్ముకొనెను.

22. ప్రతాపరుద్రునిచే తొలగింపబడిన అధర్మము, శత్రువులైన తురుష్కుల నాశ్రయించెను కాబోలు. లేకున్నచో ప్రతాపరుద్రుడు గతించిన వెంటనే తురుష్కులతోబాటు అధర్మము కూడ నిరాటంకముగ నెట్లు విజృంభింపగలడు?

23. కొందరు ధనాఢ్యులు, పాపులైన తురుష్కులచే ధనము కొరకు వివిధోపాయములచే బాధింపబడిరి. మరికొందరు ఆ పారశీకులను చూచిన మాత్రముననే ప్రాణములను వదలిరి.

24. తురుష్కులు బ్రాహ్మణుల కర్మబంధములను వదలించిరి (యజ్ఞకర్మలను నిరోధించిరి). దేవతా విగ్రహములను పగులగొట్టిరి. పండిత వరేణ్యులు చిరకాలముగా అనుభవించుచున్న అగ్రహారములను అపహరించిరి.

25. పాపాత్ములైన యవనులు పండిన పంటనంతయు బలవంతముగా లాగుకొనగా పెద్ద, చిన్న రైతులందరు నష్టపడిరి.

26. అట్టి మహాపదయందు ధనదారాదికములైన ఏ వస్తువులందును రాజ్య ప్రజలకు స్వాయత్తతాభావము కలుగకుండెను.

27. యవనాధములు ఎడతెగక త్రాగునది మద్యము. తినునది గోమాంసము, బ్రాహ్మణులను చంపుట లీలావిహారము, ఇక జీవలోకము భూమిపై ఎట్లు జీవింపగలదు?

28. ఇట్లు రాక్షసులతో సమానులైన ఆ యవన భటులచే మిక్కిలి బాధింపబడుచున్న త్రిలింగదేశమును రక్షించువానికై కోరుచు దావాగ్నిచే తపించు అడవివలె ప్రజాసందోహము సంతాపము పొందెను.

29. పిమ్మట ఇప్పుడు యవనపీడనాలోకించి దయాళువై అవతరించిన విష్ణుదేవుని వలె ప్రోలక్షితీశుడు భూమిని పాలించుచున్నాడు.

30. భగవంతుని పాదమునుండి ఉద్భవించినదియు కవికాలమున శ్రేష్ఠమైనదియు చతుర్థకులము. అందు ముసునూరివంశము భూమియందు ప్రసిద్ధమైనది.

31. ముసునూరి వంశజుడు వీరుడునైన ఆ ప్రోలయభూపతి విశృంఖలమైన తన బాహుబలముచే యవనుల ఆధిపత్యమును నాశమొనర్చెను.

32. నామాస స్య తేషాం యవనాధమానాం మంత్రః కిముచ్చాటన కర్మకారీ।
దీనా యదుచ్చారణ మాత్రతత స్తే దుర్గాణి సంత్యజ్య కుతోఽ ప్యభూవన్॥

33. యాః ప్రజాః సమబాధ్యంత యవనై స్తామనూపమం।
ప్రభవం తం తమేవాగు ర్నిదాఘార్తా ఇవ హ్రాదమ్॥

34. యే పీడితా స్తురుష్కై రనారతం మానుషా ఘోరం।
తే తానేవ నిజఘ్ను ర్బలమాశ్రయజం మహత్ ఖ్యాతమ్॥

35. ఇత్థం పరాస్య ప్రబలం ప్రపంచం యావనం బలీ।
నష్టమాపది కష్టాయాం ధర్మం పునరవీవృతత్॥

36. అపాహృతాంస్తై రతిపాపచర్యైః ప్రత్నాన్ పురాణై ర్మనుజేంద్రవర్యైః।
అనేకశః పూర్వమహీసురేభ్యః ప్రోలక్షితీశోఽ దదతాగ్రహారాన్॥

37. కృత్వా ప్రవృత్తాన్ విరత ప్రసంగాన్ యజ్ఞాన్ హవిర్ధూమపరంపరాభిః।
తురుష్కసంచారణజాతపాపానాంధ్రాన్ ప్రదేశా ననఘానకార్షీత్॥

38. కృషీవలాశ్చాపి కృషేః ఫలానాం యథోదితం భాగమదుః ప్రహృష్టాః
తపస్వినష్టమివ ప్రభాగం పృథ్వీభుజేఽ స్మై తపసః ఫలానామ్॥

39. దుద్య త్కృతం పారశీకైః వ్యత్యస్తం ధరణీతలే।
తత్తత్సర్వం యథాపూర్వం వ్యరీరచదయం బలీ॥

40. ఇత్థం ప్రోలమహీవరేణ బలినా సర్వంసహేయం చిరా
త్కష్టాయా యవనేంద్ర ఘోరనికృతే స్సంమోచ్య హస్తే ధృతా
సంతుష్టా సుకృతోపచార విధిభి ర్విస్మృత్య పూర్వాన్ నృపాం
స్తస్మిన్ భావమనన్యగం వితనుతే సౌస్థిత్య సందర్శితం॥

41. తస్యాస్తి తస్యాంభువి రాజధానీ మహీభృతో మాల్యవతస్సమీపే
గోదావరీ ప్రాంతభువి ప్రశస్తాం యా రేకపల్లీతి వదంతి దేశ్యాః॥

42. దాన భోగోపయోగాభి స్సర్వాభిర్వసుభూరిభిః।
యాఽ తిచక్రామ నగరీ మలకాం చామరావతీమ్॥

43. ముక్తాఫలై ర్విద్రుమభంగజాలకై ర్మణివ్రజై రున్నత హేమరాశిభిః।
రుద్ధాపణా యా సతతం విరాజతే ధనేశ్వరస్యేవ చ భాండగేహభూః॥

32. ఆతని నామము యవనాధములను పారద్రోలగల మంత్రమై విరాజిల్లెను. ఆతని నామము నుచ్చరించిన మాత్రముననే వారు దుర్గములను వదలి ఎటకో పారిపోయిరి.

33. యవనులచే మిక్కిలి బాధింపబడిన ప్రజలు వేసవిచే తపించిన వారు సరస్సును చేరినట్లు ప్రభువగు ఆ ప్రోలయను చేరిరి.

34. తురుష్కులచే ఏ జనులు ఘోరముగా పీడింపబడిరో, ఆ జనులే వారిని చంపిరి. ఆశ్రయము వలన కలుగు బలము గొప్పదని చెప్పబడును.

35. ఇట్లు బలవంతుడైన ప్రోలయ ప్రబలమైన తురుష్క సందోహమును నాశనమొనర్చి ఆపదలో నశించిన ధర్మమును పునరుద్ధరించెను.

36. పూర్వ రాజేంద్రులచే దానముగ నీయబడి, అతిపాపాత్ములైన తురుష్కులచే అపహరింపబడిన అగ్రహారములను ప్రోలక్షితీశుడు ఆయా బ్రాహ్మణులకు మరల నొసంగెను.

37. హవిర్ధూమ పరంపరలతో యజ్ఞములను ఎడతెగక ప్రవర్తిల్లజేసి ఆ ప్రోలయ తురుష్క సంచారములచే పాపాత్మకమునైన ఆంధ్రదేశమును పుణ్యావంతము గావించెను.

38. తపస్వులు తమ తపఃఫలమున షష్ఠాంశమును రాజున కొసగినట్లు, కృషీ వలులు కూడ పంటలో విధింపబడిన భాగమును సంతోషముతో నొసంగిరి.

39. భూతలమున పారశీకులచే ఏవేవి తలక్రిందులు చేయబడినవో వానినన్నిటిని . బలవంతుడగు ప్రోలయ యథాపూర్వముచేసి సరిదిద్దెను.

40. ఇట్లు తురుష్క ప్రభువుచే చిరకాలము ఘోరముగ పీడింపబడిన ఆంధ్రభూమిని విముక్తమొనర్చి ప్రోలభూపతి తన హస్తమున వహించెను. సుకృతోపచారములచే సంతుష్టినొందిన రాజ్యలక్ష్మి పూర్వ నరేంద్రులను విస్మరించి అనన్యమనస్కయై ఆతనినే సేవించెను.

41. గోదావరీ భూభాగమున మాల్యవత్పర్వత సమీపమున ఆతని రాజధాని ప్రశస్తమై అలరారెను. అది దేశీయులచే రేకపలి అని వ్యవహరింపబడుచున్నది.

42. దానమునకు భోగమునకు ఉపయుక్తములైన సమస్తభూరి సంపదలచే విరాజిల్లు ఆ రేకపల్లి నగరము అలకానగరమును, అమరావతీ నగరమును మించిపోయెను.

43. ముత్యములతో, పగడములతో, మణిరాశులతో, హేమరాశులతో ఆ నగరము కుబేరుని భాండాగారమువలె ఎల్లప్పుడు సమృద్ధమై విరాజిల్లుచున్నది.

44. సతామధిష్ఠాయ పురీం సమృద్ధాం ప్రోలక్షితీశః పురుహూతితేజాః।
అపాస్తవైరిక్షితిపాలలోకాం ప్రశాస్తి పృధ్వీం నిజశాసనాంకామ్॥

45. **యద్ధాటీషు** వలత్తురంగమఖుర ప్రోద్యద్రజోమండలీ
**విస్తారైః** పరిధూసరాలకభర ప్రాంతా దిశాయోషితః
దృష్ట్వా భ్రాంతి మవాప్నువంతి మహతీం గంధర్వ కన్యా ము
హుర్భీత్యా దూరతర ప్రధావదహితక్ష్మాపాలయోషా ఇతి॥

46. యత్ప్రతాపతనేన విహ్వలా వైరిణః క్షితిభృతో మహీయసా।
పాదపద్మనఖచంద్ర రోహిణీం శీతలాం పరిచరంతి చంద్రికామ్॥

47. యద్బాహుపీఠం సంప్రాప్య ప్రతాపోష్మలమున్నతమ్।
త్యజత్యంబుధిసంవాసక్లేశమద్య వసుంధరా॥

48. అరత్నమౌళీపరిదంతురేషు నిరాతపత్రావరణేషు యస్య।
ఆజ్ఞానటీ నృత్యతి భూపతీనాం మూర్ధాగ్రరంగేషు సమున్నతేషు॥

49. ఆరోపితగుణం యస్య ధనుస్సాపత్న్యశంకయా।
అరిరాజన్య కాంతానాం కంఠస్థా నరునా ద్గుణాన్॥

50. తస్మాsభవన్ కాపయనాయకాద్యా స్సభ్రాతర శ్శౌర్యనయోపపన్నాః।
యేషు ప్రతిష్టాయ ధురందరాయాః ప్రభు స్స ధర్మార్జన తత్పరోsభూత్॥

51. మహీసురేభ్యః కలికాలపర్యంతం దానరూపం పరమం విదిత్వా।
ప్రాదా త్ప్రశస్తాన్ బహుశోsగ్రహారాన్ మహాన్తి దానాన్యకరోద్బహూని॥

52. యే సూరయస్సంతి మహీతలేsస్మిన్ సత్పాత్రభూతా వసుభూరి తేషు।
దత్త్వాsతిపాత్రే ప్రతిపాదనాయ వ్యచాయయత్తజ్జగతీతవేంద్రః

53. భారద్వాజోముని పూర్వమభవద్యేత దిశ్రుతః
ప్రథతేsనుత్తము గోత్రయదు పక్షం మహీతలమ

54. తద్గోత్రేs న్నయవిదుషః పౌత్రః చ న్నయార్యస్య।
అన్నయనామా విద్వానభవత్ ఖ్యాతో యజుర్వేదీ॥

55. వెన్నయ గణపయ ఘిదుషౌ తతత్రౌ జగతి విశ్రుతఖ్యాతీ।
యత్పాదపద్మసంగాత్ ధరణిరియం ధన్యతాం ధత్తే॥

44. సంవత్సమృద్ధమైన ఆ పురము నధిష్ఠించిన ఇంద్రతేజస్కుడైన ప్రోలక్షితీశుడు శత్రురాజ సమూహమును అణచి పృథ్విని శాసించెను.

45. గుఱ్ఱపు గిట్టల తాకిడిచే రేగిన దుమ్ముచే దిగ్వనితల ముంగురులు ధూళిధూసరితములు కాగా, వానిని చూచిన గంధర్వకన్యలు భీతితో దూర దూరముగ పరువెత్తుచున్న శత్రురాజుల భార్యలను భ్రాంతి నొందుచున్నారు.

46. ఆతని ప్రతాపమును సూర్యునిచే భీతినొందిన శత్రురాజులు అతని పాదపద్మములను, నఖ చంద్రునిచేరి చల్లని వెన్నెలలో చరించుచున్నాడు.

47. ప్రతాపమను వెచ్చదనమును కలిగిన ఆతని ఉన్నత బహుపీఠము నాశ్రయించి భూమి సముద్ర సహవాసము వలని క్లేశమును నేడు వీడినది.

48. రత్నములు లేక వెలవెలపోవు కిరీటములు కలిగి, ఛత్రములు లేని రాజుల యొక్క సమున్నతములైన శిరస్సుల పైభాగములను రంగస్థలము లందు ప్రోలయ శాసనమును నర్తకి నృత్యము చేయుచున్నది.

49. నారినెక్కు పెట్టిన ప్రోలయ ధనుస్సు సపత్నులు (సవతులు, విరోధులు) అనుశంకచే శత్రురాజుల భార్యల కంఠములందున్న మంగళ సూత్రములను త్రెంపుచున్నది.

50. ఆతనికి శౌర్యము, రాజనీతితో కూడిన కాపయనాయకుడు మున్నగు తమ్ములు కలరు. రాజ్యపాలన భారమును వారిపైనుంచి ఆతడు ధర్మకార్య తత్పరుడయ్యెను.

51. బ్రాహ్మణులకిచ్చిన దానములు కలికాల పర్యంతముండునని గ్రహించి ప్రోలయ అనేక ప్రశస్త అగ్రహారములను, పెక్కు గొప్పదానములను ఒసంగెను.

52. ఈ భూతలమున సత్పాత్రులైన పండితులకు భూరిదానములిచ్చుటయే కాక అతిపాత్రులకై దానమిచ్చుటకు ఆ రాజేంద్రుడు అన్వేషించెను.

53. పూర్వము భారద్వాజుడను వేదవిశ్రుతుడగు ముని యుండెను. ఆతని గోత్రము భూతలమున మిక్కిలి ఉత్తమమని పేరొందెను.

54. ఆ గోత్రమున నయకోవిదుడైన వెన్నయార్యుని మనుమడు అన్నమ నామధేయుడు యజుర్వేదియై విద్వాంసుడని పేరు పొందెను.

55. ఆతని పుత్రులగు వెన్నయ, గణపయ అనువారు లోకమున విద్వాంసులని విఖ్యాతులైరి. వారి పాదపద్మ సంగముచే ఈ భూమి ధన్యతనందినది.

56. త్రివిష్టపాదేత్య గురుస్సురాణాం పాతాళలోకాత్ఫణినాం పతిశ్చ।
సౌభ్రాత్ర సౌఖ్యానుభవాయ భూమిం సంప్రాప్తవంతావివ యౌ విభాతః॥

57. జ్యేష్ఠస్తయో ర్వైన్నయ సూరివర్యః ప్రశస్త విద్యావినయాభిరామః।
విస్తారిభిర్యః కుముదావదాతై ర్యశోభిరాశా స్సురభీకరోతి॥

58. యత్పాదపంకేరుహ పార్శ్వనమ్ర క్షితీశ్వరశ్రేణి లలాటలగ్నా।
బ్రహ్మీలిపి ర్భాగ్యవదాస్ఫురద్భి ర్నఖాంశుజాలై స్సువచత్వమేతి॥

59. యత్రాస్తి విద్యా న చ తత్ర లక్ష్మీర్యత్రాస్తి లక్ష్మీ ర్న చ తత్ర విద్యా।
విద్యా చ లక్ష్మీ చ విహాయ వైరం యస్మిన్నుభే తే మతః ప్రహృష్టే॥

60. భోగాదనంతరం దానం ప్రసిద్ధం పృధివీతలే।
త్యక్త్వా భోగం వితరణం యస్మిన్నేవ విజృంభతే॥

61. యద్దానలక్ష్మీ సంప్రాప్తి బుద్ధ్యా స్వర్లోకధేనవః।
ఊర్ధ్వపాదాశ్చరంతీవ చిరం ఘోరతరం తపః॥

62. యస్మాదవాప్తై ర్బహుభి స్సువర్ణై రనారతానుష్ఠితయాగతంత్రాః।
విభాంతి భూమౌ విమలప్రచారా యశఃపతాకా ఇవ యాయజూకాః॥

63. విప్రేభ్యో విధివద్ధేనూః ప్రదత్వోऽక భయతోముఖీః।
యం కరోతి నిజాం కీర్తిం నిర్మలాం సర్వతోముఖీం॥

64. యన్నిసృష్టాగ్రహారేషు ప్రతితిష్ఠంతి భూసురా।
పదవాక్య ప్రమాణజ్ఞా ధర్మస్తంభా ఇవోచ్ఛ్రితాః॥

65. కృతేషు దానేషు మాహత్సు యేన విశ్వాస విభ్రాజిత మానసేన।
చిరాయ దాన ప్రతిపాదకాని ప్రయాన్ని శాస్త్రాణి యథార్థభావం॥

66. నిశ్చిత్య తం ప్రోలనృపోऽక తిపాత్రం సంప్రార్థయద్గ్రామవరం గ్రహీతుం।
ప్రతిగ్రహాత్ సోऽక పి నివృత్తచేత స్తత్కృక్షపోతేన కథంచి ద్యైచ్ఛత్॥

67. తతోనుగోదావరి తుష్టచేత గ్రహే విధీః ప్రాదిశ దగ్రహారం।
కోనావనీ మండల సారభూతం గ్రామం స తస్మై విలసాభిదానం॥

56. స్వర్గము నుండి సురగురువగు బృహస్పతియు. పాతాళము నుండి శేషుడును సౌభ్రాత్ర సౌఖ్యమును అనుభవించుటకై భూతలమునకు వచ్చినట్లు ఆ సోదరులు విలసిల్లిరి.

57. వారిలో జ్యేష్ఠుడగు వెన్నయ విద్యావినయములతో విరాజిల్లుచు తెల్లగలువల వంటి శుభ్రకీర్తులతో దిక్కులన్నింటిని పరిమళింపజేసెను.

58. ఆతని పాదపద్మముల కడ మోకరిల్లిన రాజుల నుదుటిపై గల బ్రహ్మవ్రాత ప్రకాశమానమైన ఆతని నఖకాంతుల వలన స్పష్టముగ చదువదగినదై ఒప్పారుచున్నది.

59. విద్య యున్నచోట లక్ష్మి ఉండదు. లక్ష్మియున్నచో విద్య ఉండదు. కాని విద్యయు, లక్ష్మియు రెండును వైరమును వీడి సంతోషముతో వెన్నయకడ నివసించుచున్నవి.

60. భూతలమున భోగము తరువాతనే దానము అనుట సుప్రసిద్ధము. కాని వెన్నయయందు భోగము కంటె దానమే విజృంభించుచున్నది.

61. ఆతడొసగు దానలక్ష్మిని పొందుతలంపుతో స్వర్గము నందలి కామధేనువులు పాదములు పైకెత్తి చిరకాలముగ ఘోరముగ తపస్సు చేయుచున్నవి.

62. ఆతని నుండి పొందిన బహు సువర్ణములతో యాయజాకులు ఎడతెగక యాగములు చేయుచు భూమియందు ఆతని యొక్క నిర్మల కీర్తి పతాకములవలె ఒప్పుచుండిరి.

63. ప్రోలయ ఇహపరసాధకములైన (ఉభయతోముఖీ:) ధేనువులను బ్రాహ్మణులకు దానమొనర్చి తన నిర్మలకీర్తిని సర్వతో ముఖముగ నొనర్చెను.

64. ఆతడొసంగిన అగ్రహారములందు పదవాక్య ప్రమాణజ్ఞులైన బ్రాహ్మణులు ఉన్నత ధర్మస్తంభముల వలె నెలకొనిరి.

65. విశ్వాసముచే వెలుగొందు మానసముతో అతడు చిరకాలముగా చేసిన మహాదానము దానప్రాశస్త్యమును ప్రతిపాదించిన శాస్త్రముల యథార్థ్యమును నిరూపించెను.

66. ప్రోలనృపుడు వెన్నయను అతిపాత్రునిగా నిశ్చయించి విశిష్టగ్రామమును గ్రహింపుమని ప్రార్థించెను. ప్రతిగ్రహమునెడ విముఖుడైనను వెన్నయ రాజునెడ గల పక్షపాతముచే ఎట్లో అంగీకరించెను.

67. అంతట గోదావరీ ప్రాంతమున కోనసీమలో శ్రేష్ఠమైన విలసయను అగ్రహారమును సంతుష్ట చేతస్కుడైన రాజు వెన్నయకు ఒసంగెను.

68. విభాంతి యస్యాఽ తిపచేళిమాని క్షేత్రాణి శాలీక్షువణోచితాని।
ఆరామభాగాశ్చ భుజంగల్లీ రంభాామ్రపూగీ పనసాది రమ్యాః॥

69. తమగ్రహారం ప్రతిగృహ్య తస్మాత్ ప్రోలక్షితీశాదథ వెన్నయార్యః।
సహానుజో దిత్సత భూసురేభ్యః ప్రదత్తయే తస్య ధనార్జనం హి॥

70. అనేకశాస్త్రార్ణవకర్ణధారాన్ వేదాధ్వ సంలంఘన జాంఘికాన్ సః।
ప్రసిద్ధ శీలాచరణాభిజాత్యా నయూథయద్విప్రవరాంశ్చిరేణ॥

71. ఐశ్వర్య భోగై ర్యుతమష్టసంఖ్యై స్తంమంకయిత్వా నృపశ్చనామ్నా।
అష్టోత్తరేణ ప్రవిభజ్య భాగైశ్యతేన సోఽ దాత్సుమతి ర్ద్విజేభ్యః॥

72. అపాత్ర భాగినాం నామశాఖాది ర్గోత్రవర్గశః।
ప్రవర్ణ్యతే సమాసేన భాగసంఖ్యాచ భాగినామ్॥

73. సర్వేఽ పి భాగినోఽ ర్హంతి ప్రాథమ్యం గుణవత్తమాః।
తథాపి క్రమవృత్తిత్వా ద్వాచో మే నాత్ర మూఢతా॥

68. ఆ విలస గ్రామమునకు చెందిన పొలములు సారవంతములైనవి. చెఱకు విస్తారముగా పండును. తోటలు అరటి, మామిడి, పనస పండ్లు మున్నగు వానిచే రమ్యములై యుండును.

69. ప్రోలక్షితీశుని వలన వెన్నయార్యుడు ఆ అగ్రహారమును ప్రతిగ్రహించి తమ్మునితో కలిసి దానిని బ్రాహ్మణుల కీయదలచెను. ఆతని ధనార్జనము ఇతరులకు దానమిచ్చుటకే కదా!

70. బహు శాస్త్రములనెడి సముద్రములకు కర్ణధారులును వేదాధ్యయన పరులను, శీలాచరణమందు ప్రసిద్ధులైన బ్రాహ్మణ శ్రేష్ఠులను ప్రోగుచేసెను.

71. అష్టసంఖ్యలతోడిఐశ్వర్య భోగములతో ఆ అగ్రహరమును లెక్కించి నూట ఎనిమిది విభాగములు చేసి బ్రాహ్మణులకాతడు రాజు పేరిటనే దానమొసంగెను.

72. ఇందు భాగస్థులైన వారియొక్క నామ శాఖాదులన్నియు గోత్రముల ననుసరించి, వారి భాగసంఖ్యయు మొత్తము మీద వర్ణింపబడును.

73. గుణవత్తములైన భాగస్థులందరును ప్రాథమ్యమునకు అర్హులే అయినను క్రమపద్ధతిని అనుసరించి నా మాట ప్రవర్తిల్లును. ఇందు మూఢత్వ ప్రసక్తి లేదు.

(ఇట నుండి 34 శ్లోకములలో దాన ప్రతిగ్రహీతల నామములును పిమ్మట గ్రామ సీమా నిర్ణయమును లిఖింపబడినవి.

## అనుబంధము - 2

# 2. అనితల్లి కలువచేరు శాసనం

**(శక సం॥ 1345, శ్రావణమాసం, బహుళాష్టమి)**

ఈ శాసనం తూర్పుగోదావరి జిల్లా, కాకినాడ తాలూకాలోని ఆర్యవటం గ్రామంలో లభించింది. తెలుగు అకాడమీ జర్నల్‌లో (వాల్యూము. 93-112) పేజీలలో)

1. అథ సా రుద్రమదేవీ ప్రతాపరుద్రే హృతారినృపభద్రే।
దౌహిత్రే సుచరిత్రే సర్వాముర్వీం నిధాయ ముదితవతీ॥

2. తస్మిన్ రాజని శాసతి క్షితితలం భూమండలాఖండలే
భృత్యామాత్య సుహృన్నిజద్విజబుధాచార్యాదయ స్సమ్మతాః
తల్లక్ష్మీముదితా స్వమందిరగతా శ్శత్రుక్షితీశాః పున
ర్వేలాకానన శైల కందరగతా స్తత్కీర్తి విత్రాసితాః॥

3. విద్యావిశేషై ర్వినయోపచారై ర్వితీర్ణిభి ర్విశ్వజనోపకారైః।
విద్వన్నికాయో వితత ప్రతాపే విద్యోతతే వీతరజ స్యముష్మిన్॥

4. గజపతి రుత్కళనాథః పాశ్చాత్యాధీశ్వరోऽ శ్వపతిః।
తాభ్యాం నరపతిరధికః ప్రతాపరుద్రో యాత స్త్రిలింగేశః॥

5. తస్మిన్ ప్రతాపరుద్రే స్వస్థానం స్వేచ్ఛయైవ యతావతి।
అథ సా భూ ర్యవనమయీ జాతై వాహోమహోమహోమహిమా॥

6. వరాహవద్వారిధివారిమగ్నాం ధరామశేషాం యవనోదరస్థాం
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర స్తతః ప్రతిష్ఠాపయతిస్మ తద్వత్॥

7. స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్య గత్వా।
అపాలయత్కాపయ నాయకేంద్ర స్తదియ్య రాజ్యం తరణి ప్రతాపః॥

ప్రచురించబడింది. ఇది శక సం॥ 1345 శ్రావణమాసం బహుళాష్టమినాడు రాజమహేంద్రవర ప్రభువు వీరభద్రారెడ్డి యొక్క దేవేరియగు అనితల్లి కాళనాథభట్టు కుమారుడును, ప్రముఖ ఆయుర్వేద వైద్యుడునునగు పరహితా చార్యునికి కలువచేరు గ్రామాన్ని అగ్రహారంగా దానమిచ్చిన వృత్తాంతం తెలుపుతుంది. దానశాసనము నందు మునునూరి వంశజులకు సంబంధించిన శ్లోకములు మాత్రమే దిగువ నీయబడుచున్నవి.

1. అంతట ఆ రుద్రమదేవి శత్రురాజుల సంపదలను హరించువాడును మంచి నడవడి గలవాడును తన మనుమడును నగు ప్రతాపరుద్రుని సమస్త రాజ్యమున సమ్మోదముతో నిలిపెను.

2. భూలోక దేవేంద్రుడగు ఆ రాజు భూతలమును పాలించుచుండగా భృత్యులు, ఆమాత్యులు, మిత్రులు, బ్రాహ్మణుల, ఆచార్యులు అందరు సంతోషించిరి. రాజలక్ష్మితో విలసిల్లుచు స్వమందిరములందుండిన శత్రురాజులు ఆతని కీర్తిచే భయపెట్టబడినవారై మరల అడవులు, కొండ గుహల నాశ్రయించిరి.

3. విపుల ప్రతాపుడై పుణ్యాత్ముడై అతడు ప్రకాశించుచుండగా విద్వాంసులెల్లరు విద్యా విశేషములతో, వినయోపచారములతో, దాతృత్వముతో, ఉపకారములతో విలసిల్లిరి.

4. ఉత్కళ ప్రభువు గజపతి, తురుష్క ప్రభువు అశ్వపతి, త్రిలింగదేశాధిపతియగు ప్రతాపరుద్రుడు నరపతి యగుటచే వారిరువురికంటె అధికుడు.

5. ఆ ప్రతాపరుద్రుడు తన ఇష్టముతో స్వస్థానమును (కైలాసము) ప్రాప్తింపగా త్రిలింగదేశము యవనమయముగా మార్చెను. ఆహా! ఆతని జీవన ప్రకాశము ఎంత మహిమాన్వితమో!

6. సముద్ర జలములందు మునిగిన భూమిని ఆదివరాహము ఉద్ధరించినట్లు తురుష్కులు దిగమ్రింగిన రాజ్యమును ప్రోలయ నాయకుడు పునరుద్ధరించెను.

7. శివాజ్ఞననుసరించి ప్రోలయ భూపాలుడు స్వర్గమునకు అతిథికాగా, తదీయరాజ్యమును సూర్యప్రతాపుడగు కాపయ నాయకుడు పరిపాలించెను.

8. అథ పంచోత్తరసప్తతినాయక సం సేవ్యమానపదపద్మః।
కాపావనీశ్వరః శ్రీ విశ్వేశ్వర కరుణయా క్షితి మరక్షత్॥

9. తురుష్కై ర్యై సమాక్రాంతా స్తే చాన్యే కాపభూభుజా।
అగ్రహారాః పునర్దత్తా భూపో భువ మభూషయన్॥

10. విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం
యాతే విభౌ దివి చతత్పదసేవనాయ
తై ర్నాయకై స్స్వనగరాణ్యధిగమ్య సర్వై
స్సంరక్షితా గతవిరోధకథై స్స్వదేశాః॥

11. తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మనా మగ్రణీ
శ్శశ్వద్భారత దివ్య పూరుష కథా ధౌతాంతరంగ స్సుధీః
శ్రీమత్పంటకులోద్భవశ్శివపద ద్వంద్వైక సేవాపరో
విప్రాశీర్వచనోన్నతో జితరిపుస్ఫూర్జత్ప్రతాపోదయః॥

8. డెబ్బదియైదుగురు నాయకులు తన పాద పద్మములను సేవించుచుండగా కాపయ నాయకుడు శ్రీ విశ్వేశ్వర కరుణచేత రాజ్యమును సంరక్షించెను.

9. కాపయనాయకుడు తురుష్కులచే ఆక్రమింపబడిన అగ్రహారములను బ్రాహ్మణులకిచ్చి తన పరిపాలనచే భూమి నలంకరించెను.

10. విశ్వేశ్వరునికి వివిధ సేవలు చేయుచు శివపాద సేవనమునకై కాపయ నాయకుడు దివికేగెను. అంతట డెబ్బదియైదుగురు నాయకులు అందరును తమతమ రాజధాని నగరములకేగి తమ రాజ్యములను, విరోధములను మరచి సంరక్షించుకొనిరి.

11. ధర్మాత్ములైన ఆ నాయకులలో భారత దివ్యపురుషుల కథాశ్రవణముచే ఎల్లప్పుడు నిర్మాలాంతరంగుడును, శివపాదద్వంద్వ సేవాపరాయణుడును బ్రాహ్మణాశీర్వచనములచే ఉన్నతుడైనవాడును, శత్రువులను జయించు ప్రతాపము గలవాడును, పంట వంశమున జన్మించినవాడును నగు వేమ భూపాలుడు అగ్రగణ్యుడు.

## అనుబంధము - 3

# 3. ముసునూరి కాపయ నాయకుని ప్రోలవరం శాసనం

**(శక సం॥ 1267 పార్థివ నామ సం॥ మాఘమాసం సూర్యగ్రహణ వేళ)**

ఈ శాసనం డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్య గారిచే 1934 భారతి మాసపత్రికలో ప్రచురింపబడింది. ఇది కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోని గురజ గ్రామంలో లభించింది. ఈ శాసనం రెండు రాగిరేకులపై ఇరువైపులా వ్రాయబడింది. ఇందు ఏకశిలా నగరాధీశుడైన కాపయనాయకుడు ప్రోలయనాయకుని పుణ్యము కొరకై శక సంవత్సరం 1267కు సరియగు పార్థివ నామ సంవత్సరం మాఘమాసమున సూర్య గ్రహణవేళయందు మలఘ్నీ నదీ తీరమున గల ప్రోలవరము గ్రామమును దానముగా నిచ్చిన వృత్తాంతము అభి వర్ణింపబడింది.

1. అవ్యాజ్జగంతి విభురాదివరాహమూర్తి ర్భర్తా రుచిరబాలతమాలనీలః
ఆవిర్బభూవ కిల యస్య మహాంబులీనే దంష్ట్రామృణాళశిఖరే ధరణీసరోజః॥

2. ఆసీత్ పోలమహీపతి స్సుకృతినామాద్యో జగద్విశ్రుతః
పోతః కల్పమహీరూహస్య విలస ద్విశ్రాణ శ్లాఘయా।
పోతో యో విపదంబురాశితరణే సర్వప్రజానామపి
క్షీరబ్ధావివ చంద్రమా బుధజనాధార శ్చతుర్ధాన్వయే॥

3. తస్యాహ్యభూవం స్తనయా గుణాఢ్యా శ్చతుర్భుజస్యేవ భుజా మహాంతః॥

4. పోచక్షితీశో నరదేవ ముఖ్యో దేవశ్చ కామాధిప రాజభూపౌ॥

5. పోచక్షోణిపతే స్సుతౌ సుకృతినౌ ప్రోలక్షితీశోత్తమః।
శ్లాఘ్యశ్రీ రెఅపోతభూపతిరపి ద్వౌలోక సంభావితౌ॥

6. దేవక్ష్మాధిపతేశ్చ కాపనృపతి శ్రీముమ్మడీశాహ్వయౌ
సంజాతౌ భువి రామలక్ష్మణ నిభౌ సూర్యేందుతుల్యశ్రియౌ

7. కామక్షితీశతనయౌ పునరిమ్మడీశ దేప్రభూ భువన విశ్రుతదానశీలౌ

దాన గ్రహీత శౌనకగోత్రజుడైన కందయ పెద్దిభట్టు అను బ్రాహ్మణుడు. ఈతడు శ్రీశైలమున సత్రయాగము చేసినవాడు. గిరీశ సహస్రకమునకు భాష్యము వ్రాసిన పండితుడు. ఈ శాసనంలో పేర్కొనబడిన మలఘ్నీ నదియు, అనవేమారెడ్డి శక సం॥ 1293లో వేయించిన జుజ్జవరం శాసనంలో పేర్కొనబడిన మలాపహానదియు ఒక్కటియే అని నిర్ణయించబడింది. ఈ మలాపహా (మలఘ్ని) నదీ తీరంలో ప్రోలవరం, జ్యుజ్జవరం, కోడూరు అనే మూడు గ్రామాలున్నాయి. వీనిలో కోడూరు గ్రామాన్ని శక సం॥ 1280లో అనవోతారెడ్డి బ్రాహ్మణులకు దానమిచ్చాడు. శాసనములలోని ధృజ్జవరము, కోడూరు అనే గ్రామాలు గుడివాడ తాలూకా లోని జుజ్జవరం కోడూరు గ్రామాలూ ఒక్కటే. కనుక మలాపహా (మలఘ్ని) నదియు, ప్రోలవరం గ్రామమూ ఆ తాలూకాలోనివే అని చెప్పవచ్చు. కాపయ నాయకుని శాసనంలోని ప్రోలవరం గుడివాడ తాలూకాలోని ప్రోలవరం అనే జమీందారీ గ్రామము ఒక్కటే అని నిర్ణయింపబడింది.

1. మహాసముద్రమున మునుగుచున్న ఏ దేవుని దంష్ట్రామృణాళ శిఖరమున ధరణి అనెడి పద్మము ఆవిర్భవించెనో అట్టి భూభర్తయు మనోహరబాల తమాల నీల వర్ణము గలవాడును నగు ఆదివరాహమూర్తి జగములను రక్షించు గాక!

2. జగద్విఖ్యాతుడగు పోతమహీపతి పుణ్యాత్ములలో అగ్రగణ్యుడై యుండెను. అతడు కల్పవృక్షమునకు విశ్రాంతి నొసంగెనని చెప్పబడెను. ఆపదలను సముద్రము దాటించుట యందు సర్వప్రజలకు ఆతడు తెప్పయయ్యెను. క్షీరాబ్దివంటి చతుర్థకులమున బుధజనాధారుడైన చంద్రునివలె ప్రకాశించెను.

3. ఆతనికి చతుర్భుజుని భుజములవలె గుణాఢ్యులైన నల్గురు పుత్రులు కలిగిరి.

4. వారు పోచయ, దేవయ, కామయ, రాజయ అనువారు.

5. పోచయకు ప్రోలయ. ఎఱపోతయ అను పుణ్యాత్ములు, లోకమాన్యులగు ఇద్దఱు కుమారులు.

6. దేవయకు కాపయ, ముమ్మడయ అను నామధేయములుగల సూర్య చంద్ర సమానతేజస్కులు, రామలక్ష్మణ సమానులునైన కుమారులు కలిగిరి.

7. కామయకు ఇమ్మడయ, దేవయ అను విఖ్యాత దానశీలురైన పుత్రులు జన్మించిరి.

8. పుత్రోకపి రాజనృపతేరన నోతభూప స్త్రాయ్యేటి నామనగరీపతి రార్యబంధుః॥

9. ఏతేషాం సహజన్మనాం సుకృతినాం మధ్యే ప్రసిద్ధోదయః॥
క్షోణీచక్రమవక్రవిక్రమయశస్సంభావ్య బాహార్గళః
ఏకచ్ఛత్ర మపాలయత్ బుధజన శ్లాఘ్య ప్రభోవోన్నతో
లక్ష్మీవాన్మసునూరి ప్రోలనృపతి స్సద్బంధు చింతామణిః॥

10. తస్యానంతర మంతరంగవిమలో భావప్రభావోదయః
శ్లాఘ్య ప్రస్ఫుట ధర్మకర్మ చతురః శ్రీకాపపృధ్వీపతిః
కాశ్యాం విశ్వపతేః ప్రసాదమహిమ ప్రాప్తాఖిల ప్రాభవః
క్షోణీ రక్షణ దక్షదక్షిణ భుజ స్తంభో జరీజృంభతే॥

11. ప్రతాపరుద్ర ప్రతిమ ప్రభావః శ్రీకాపభూపః కరుణాకలాపః।
అశాదశేషాం భువ మద్భుతశ్రీ రేకో వసన్నేకశిలా నగర్యామ్॥

12. ఆసీన్నైమిశనామ పావన వనావాసో మహాసంయమీ
వ్యాప్త ద్వాదశ వర్ష సత్రమహిమా వ్యాసేతిహాసప్రియః
అంహస్సంఘభయానక స్త్రిభువనే సద్దాన కీర్త్యానకః
క్షామక్షీణసమస్త దీనజనతా సంతానక శ్శౌనకః॥

13. తస్యాన్వయే జయతి కందయ పెద్ది భట్టః
శ్రీశైల సీమ్ని కృతవిశ్రుత సత్రయాగః।
వ్యాఖ్యాన కృద్గిరిశనామ సహస్రకస్య
పంచాగ్రహార పరిరక్షిత బంధువర్గః॥

14. శాకాబ్దే గిరతర్క భానుగణితే సంవత్సరే పార్థివే
మాఘే మాసి రవిగ్రహే సుచరితః శ్రీకాపకృధ్వీపతిః
శ్రీమత్ప్రోలమహీపతే స్సుకృతినః పుణ్యాయ పుణ్యాశయః
గ్రామం ప్రోలవరాహ్వయం స్వయమదాత్తస్మై మలఘ్నీతటే॥

15. అస్యగ్రామస్య సీమచిహ్నాని

8. రాజయకు అనవోతయ పుట్టెను. అతడు తొయ్యేటి నగరాధీశుడయ్యెను.

9. ఈ సోదరులలో మునునూరి ప్రోలనృపతి సుప్రసిద్ధుడై అవక్రవిక్రమ కీర్తిమంతుడై, పండితులచే పొగడబడిన గొప్ప ప్రభావము కలవాడై సద్బంధు చింతామణియై దేశమును సకల సంపదలతో ఏకచ్ఛత్రాధిపత్యముగ పరిపాలించెను.

10. ఆ ప్రోలయ తరువాత స్వచ్ఛహృదయుడును, ఉన్నత భావములు గల వాడును, ధర్మకర్మ సమర్థుడును, కాశీవిశ్వేశ్వరుని కరుణచే అఖిల వైభవ పేతుడును, భూరక్షాదక్షమైన భుజాస్తంభము గలవాడును నగు శ్రీ కాపయ భూపతి ప్రభుత్వము వహించి విరాజిల్లుచున్నాడు.

11. ప్రతాపరుద్రునితో సమానశక్తిమంతుడును, దయాపరుడును నగు శ్రీ కాపభూపుడు ఏకశిలానగరము రాజధానిగా సమస్త భూమండలమును పరిపాలించెను.

12. నైమిశారణ్య నివాసియు, పన్నెండేండ్లు సత్రయాగమొనర్చినవాడును, వ్యాసభారత ప్రియుడును. పాపసందోహమునకు భయంకరుడును. సద్దానములచే ముల్లోకములందు కీర్తి నొందినవాడును, దీనజనుల పాలిటి కల్పవృక్షమును నగు శౌనకుడను సంయమీంద్రుడుండెను.

13. ఆతని వంశమున కందయుపెద్దిభట్టు జన్మించెను. ఆతడు శ్రీశైలమున గొప్ప సత్రయాగమొనరించెను. శివసహస్రకమునకు వ్యాఖ్యాన మొనరించెను. ఐదు అగ్రహారములందు తన బంధువర్గమును పరిపోషించుచున్నాడు.

14. శక సంవత్సరము 1267 పార్థివ నామవత్సరమున మాఘమాసము నందు సూర్యగ్రహణవేళయందు పుణ్యాత్ముడు, పుణ్యాశయములు గలవాడునగు శ్రీ కాపభూపతి ఆతనికి మలప్రభ తీరమునందలి ప్రోలవర గ్రామమును శ్రీ ప్రోలమహీపతి పుణ్యము కొరకై దానమొసంగెను.

15. ఆ గ్రామమునకు సరిహద్దు గుర్తులు.

# అనుబంధము - IV - కాకతీయుల వంశ వృక్షము




# ముసునూరి నాయకులు



# అనుబంధము - V

## కాకతి

ఇది యొక దేవత పేరు. ఈ దేవత యోరుగంటివి రాజధానిగాఁ జేసికొని యాంధ్రదేశ మెల్ల నేలిన యాంధ్రచక్రవర్తుల కులదైవము. ఈమె పేరినిబట్టి వారు కాకతీయు లయిరని పలువురు తలఁచుచున్నారు. కాకతి పురవరాధీశ్వరులగుటచేఁ గాకతీయ నామము వారికి వచ్చియుండునని మఱియొక్క తలఁపు. దొరికినసాధనముల నెల్లఁ బర్యాలోచించి కాకతీయ సంచికలో శ్రీయుత కె. రాఘవాచార్యులు ఎం.ఏ., బి.ఎల్. గారిట్లు వ్రాసిరి.

'కాకతీయుల కా పేరెందులకు వచ్చినదో, కాకితమ్మ (కాకతమ్మ) యన నెవరో మనము విచారింపవలసి యున్నది. ఈ సందర్భమునఁ జరిత్రకారులు పెక్కు విషయముల నుద్ఘాటించుచున్నారు. మనకుఁ దెలిసిన విషయములఁ జర్చించి యామె జైన దేవతయా? కాదా యని విమర్శింపనగును. అనితల్లి కలువచేరు శాసనమున "కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లికా కాచిత్ పుత్ర మసూత త దేత త్కుల మనఘం కాకతీసంజ్ఞ మభూత్" అని కలదు. రెండవ ప్రోలరాజు పద్మాక్షీ దేవాలయ శాసనము నందలి జినేంద్ర స్తుతిచే జైనమతావలంబకుఁ డని యూహింపఁబడుచున్నాఁడు. ఇరువది రెండవ తీర్థంకరుని దేవి కూష్మాండిని యని జైన గ్రంథములు దెలుపుచున్నవి. వీని నొక దానితో నొకటి ముడివెట్టి కాకతీ జైనదేవత యనియు నామెయే కూష్మాండిని యనియుఁ గాకతి యన గుమ్మడి తీగ యనుట దీనిని బలపఱుచుచున్నదనియు వ్రాయుచున్నారు. కాకతి (కాకిత) యనునది జైనదేవత యని యెచటను దెల్పఁబడియుండలేదు. జైన గ్రంథములఁగాకతి యను పేరు గానరాదు. కాకతియన గుమ్మడి తీగ యని నిఘంటువులఁ గాని మఱి యే యితర గ్రంథములఁ గాని లేదు. విద్యానాథకృత ప్రతాపరుద్రీయమున 'కాకతీయకుల దుర్గాదేవీ సమారాధనేన విజయ ప్రస్థానమంగళం కృత్వా' అని కలదు. రత్నాపణ వ్యాఖ్యానమున "కాకతి ర్నామ దుర్గా శక్తి రేకశిలా నగరేశ్వరాణాం కులదేవతా, సా శక్తిర్భజనీయా అస్యేతి కాకతీయః' అని యున్నది. క్రీడాభిరామమున నీమె ఏకవీరకు సైదోడని వర్ణింపబడినది. ప్రతాపచరిత్రమున తమ యిలువేల్పయిన కాకితమ్మకు ఉత్సవములు చేయించి 'కాకితదేవి వరప్రసాదంబున ఒక్క సుతునింగని కాకితప్రోలరాజు అను నామకరణమొనర్చి'

అని వ్రాయఁబడినది. కలువచేరు శాసనమునఁ గూడ శివ శక్తి స్వరూపిణి యని కలదు గదా. వీనివలన గాకతియనునది దుర్గ కపరనామధేయ మనియు, నామెయే కాకతీయుల కులదేవత యనియు స్పష్టము. మఱి కూష్మాండవల్లరి నుండి కాకతీయ లుద్భవించి రను శాసనభాగమును బరిశీలింప నది స్థానిక గాథలపై నాధారపడి యున్నట్లు తోఁచుచున్నది. మాధవవర్మ కుమారుఁడు పద్మసేనుఁడు సంతానంబు లేమి బుధాను మతంబున సిద్దేశ్వర శ్రీ మన్మహాదేవుని నిత్యంబును గూష్మాండఫలంబులఁ బూజింపఁ దత్ప్రసాదంబున నొక్క సుతుండు గలిగెనని ప్రతాపచరితాదులఁ గలదు. ఇదియే కూష్మాండవల్లరీ గాథకు మూలమని తోఁచును. పై విషయములఁ బరిశీలింపఁ గాకతి జైన దేవత యనుటకుఁ దగిన యాధారములు లేవు. అవి దొరకు వఱకు నామె దుర్గయే ననియు. నామెను భజించుటచేఁ గాకతీయుల కాపేరు గలిగెననియు మన మూహింపవలసి యున్నది. కాగతి యను గ్రామము నుండి కాకతిశబ్దము పుట్టినదనియుఁ గొందఱు వ్రాయుచున్నారు. అది సరికాదని తోఁచుచున్నది. నా మిత్రులలో నొకరు బౌద్ధవాఙ్మయమునఁ గాకతి యను దేవత యున్నదని తెల్పియున్నారు. ఇదియు భావి విమర్శనమువలనఁ దేలవలసియున్నది. ప్రోలరాజు జైనుఁ డగుటచేఁ గాకతియు జైన దేవతయై యుండునని విల్సనుగా రభిప్రాయపడియున్నారు.

పానుగంటి శాసనమున "శ్రీమతు కాకతిపురవరాధీశ్వర రుద్రదేవ మహారాజునకు" (చూ. కాకతీయ సంచిక 29 నెం. శాసనము) అని కలదు. దీనిఁ బట్టి కాకతి గ్రామనామ మగు నని తత్పురవరాధీశ్వరులు కాకతీయులయిరని తలఁపవచ్చును. కాని కాకతి గ్రామనామము గూడ కాకతిశక్తి నివాస మగుటనుబట్టి యేర్పడినది గావచ్చును. మధుర నాసిక బౌద్ధశాసనములో కాకతేయ, కాఖండి నామములు పేర్కొనఁ బడినవి. తొలుత నా పేరు బౌద్ధుల స్త్రీ దేవత దయియుండ వచ్చును. తర్వాత నది హైందవతఁ జెంది శివునిశక్తిపేరయి మార్పు చెంది యుండవచ్చును. కాకాండి, కాకొలను, కావలి, కావూరు మొదలగు గ్రామనామము లా శివశక్తిపేర నేర్పడినవి కావచ్చును. శక్తిమంత్రములలో 'కాది' మంత్ర మొకటి కలదు. దానికిఁ బంచదశి యనియు నామాంతరము. పంచదశీమంత్రాద్యక్షరము 'క'. ఆ మంత్రమును గూర్చి 'కాదిమతతంత్రము' మొదలగు గ్రంథములు మహావిద్యా విషయకములు కలవు. కాకతి యను పేరు కా + కత్తె సమాసమును బట్టి యేర్పడినది కావచ్చును. కాదిమంత్రాధిదైవతము శివుని శక్తికి మూర్తభేదము. కాకతి దుర్గ యని ప్రతాపరుద్రీయ

వ్యాఖ్యాత చెప్పుట పై విధమున సంగతమే కాఁగలదు. నాసిక బౌద్ధగుహాశాసనములలో 'కాకతేయ' 'కాఖండి' పదములు కూడఁగలవు. కాకతీయులు తొలుత బౌద్ధులుగా నుండవచ్చును. వారు సాతావాహనులు యిక్ష్వాకుల చాళుక్యుల సామంతులు గావచ్చును. కాకతీయ రాజ్యము ప్రధానముగా వ్యాపించిన కృష్ణాతీర మొకప్పుడు బౌద్ధమత ప్రాచుర్యము గలది. కనుక కాకతి గూడఁ దొలుత బౌద్ధదేవత యగుట సంగతమే. కాకతి, ఏకవీర, మాహురమ్మ, మైలారుఁడు. భైరవుఁడు కాకతీయుల యారాధ్య దైవతములు.

కృష్ణాజిల్లాలోని ముక్త్యాల జమీందారుగారి మ్యూజియమునకయి నేను సేకరించిన వానిలో నీ కాకతిదేవి విగ్రహమున్నది. ముక్త్యాలకు చేరువనున్న చౌండపాడు అను గ్రామమున నేఁబది యెకరముల బీడు నేల 'కాకతమ్మ బీడు' అను పేరఁ గలదట! అందులో నీ కాకతమ్మ విగ్రహమున్నది. ఆ గ్రామపువారీవిగ్రహమును కాకతమ్మ యని పేర్కొందురట. కరణీకపు లెక్కలలో నాబీడు కాకతమ్మ బీడు అనుపేరనే కలదట. అసలు రాతివిగ్రహమిప్పుడు ముక్త్యాలలోఁ గలదు. ఈవిగ్రహమునకు నాలుగు చేతులున్నవి. తలపై కబాయి కుళ్ళాయి ఉన్నది. చెవులకుఁ గమ్మలున్నవి. ముందరికుడిచేత డమరుక మున్నది. ముందరి యెడమచేత కపాల (?) మున్నది. కుడివెనుకచేత జింకపిల్ల (?) యున్నది. ఎడమవెనుకటిచేత త్రిశూలమున్నది. నాల్గుచేతులకు మూఁడేసి కంకణములున్నవి. మెడలో కంటె హారములున్నవి. పాదములకుఁ బాజేబులున్నవి. పీఠమునకు దిగువను వరాహ మున్నది. కాకతీయకులదైవత మిట్లు దొరకుట నాకుఁ జాల వేడ్కఁ గొల్పినది. ఈ కాకతమ్మ యేకశిలానగరమున నేక వీరాదేవికి సైదోడుగా వెలసియుండినదని క్రీడాభిరామమునఁ గలదు. ఆ దేవాలయము, విగ్రహము, నగరము, రాజ్యము నన్నియు నంతరించిపోయినవి గదా!

**- శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి**

# ఆచార్య రంగాజీ

రంగాజీ 1900 సంవత్సరం నవంబరు 7వ తేది జన్మించారు. తొంభై అయిదేళ్ళ పరిపూర్ణ జీవితం గడిపి 1995 జూన్ 8వ తేది పరమపదించారు.

అంటే 19వ శతాబ్దాంతమున జన్మించి 20వ శతాబ్దాంతమున స్వర్గారోహణ చేశారు. కాబట్టి రెండు శతాబ్దములను పావనం చేశారు.

రంగాజీ 1924 ఇంగ్లండులో చదువులు సాగిస్తున్న కాలంలో మార్క్సిజం, కమ్యూనిజం, సోషలిజంల ప్రభావానికిలోనై, సుత్తి, కొడవలి చిహ్నంగా ఎర్రజెండాను ఎగురవేసిన తొలి యువతరంలోనివారు.

1935-40 మధ్య కాలంలోనే కమ్యూనిజమంటే ఏకపక్ష కార్మిక నియంతృత్వమేనని ముందుగా అవగాహన వచ్చిన ఇరువురు మహామేధావులలో రంగాగారొకరు. రెండవవారు యుగోస్లావియా కమ్యూనిస్టు పార్టీ నిర్మాత - ఆ దేశ కమ్యూనిస్టు ప్రభుత్వాధినేత మార్షల్ టిటోకు గురువు "మిహిలోవ్ జిలాస్", "న్యూక్లాస్" అనే గ్రంథం ద్వారా ప్రపంచానికి తెలియజెప్పారు.

మార్క్సిజం, కమ్యూనిజం, ఏకపక్ష కార్మిక నియంతృత్వ సిద్ధాంతానికి, మార్క్సు "క్యాపిటల్" గ్రంథానికి ప్రత్యామ్నాయంగా, ప్రజాస్వామ్యం, ప్రాతిపదికగా, దానినే ప్రాణప్రదంగా ఎంచుకొనే విధంగా "కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్" సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. 1944లో జైలు నుండి విడుదలవుతూనే గాంధీతో చర్చించి ఆమోదింప చేశారు.

ఇక ప్రధాని పండిట్ నెహ్రూతో సిద్ధాంత పోరాటాలు - అపజయాలు, పరాజయాలు, పొందుతూనే విజయాలు సాధించిన యోధులు రంగాజీ.

ఆచార్య యన్.జి. రంగా, అరవై అయిదు సంవత్సరాలు పార్లమెంటులో ఉన్న ప్రముఖ గాంధేయవాది. ఆర్థిక శాస్త్రంలోను చరిత్రాధ్యయనంలోను ఆక్సుఫర్డులో పట్టం పుచ్చుకొన్న ప్రముఖ శాస్త్రవేత్త, గుంటూరు జిల్లా నిడుబ్రోలులో 1900 సంవత్సరములో పుట్టి, 1924లో భారతీదేవి రంగాను వివాహమాడారు.

రంగాజీ గాంధేయ సిద్ధాంతాలను వరించిన గిల్డు సోషలిస్టు. అంతర్జాతీయ రైతాంగనేత, భారత పార్లమెంటులో 1930 నుండి ఇటీవల వరకు కాంగ్రెసులోను, ప్రతిపక్షంలోను అగ్రగామిగా నుండి, ప్రపంచ పార్లమెంటరీ వేదికలైన, వివిధ దేశాల సంయుక్త పార్లమెంటు సమాఖ్యలలోను, కామన్ వెల్తు పార్లమెంటు సమాఖ్యలలోను, గణనీయమైన పాత్ర నిర్వహించారు. కాంగ్రెసు ఆర్థిక, ప్రణాళికా విభాగ కార్యక్రమాల్లోను, ప్రభుత్వ రంగ పరిశ్రమ సంస్థల కమిటీలలోను, పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ ఛైర్మన్‌గా ఉండి బహుముఖంగా ఖ్యాతి నార్జించారు.

## జాతీయ, అంతర్జాతీయ సంస్థల స్థాపన :

అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తి దారుల సమాఖ్యను స్థాపించిన ప్రముఖులలో రంగాజీ ఒకరు. వారు అఖిల భారత కిసాన్ కాంగ్రెసుకు వ్యవస్థాపక అధ్యక్షులు. భారత రైతాంగ విద్యాలయం, నిడుబ్రోలు, విదేశ వ్యవహారాల సంఘం, న్యూఢిల్లీ, గ్రామీణ ప్రజాసమాఖ్య, చేనేత, చేతివృత్తుల కాంగ్రెసు సంస్థలకు వ్యవస్థాపక అధ్యక్షులు కూడా. "రైతు కూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని" ప్రవచించి మహాత్మాగాంధీజీచే ఆశీస్సుల నందిన మహాతత్త్వవేత్త.

భారత ప్రతినిధిగా అనేక అంతర్జాతీయ సభల్లో పాల్గొన్నారు. శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభలోను, కోపెన్ హాగన్‌లో జరిగిన ఆహార వ్యవసాయ మహాసభలోను, టోకియో ప్రపంచ శాంతి మహాసభలోను, మిత్ర రాజ్య సమితి పారిస్‌లో నిర్వహించిన గాంధీ శతజయంతి సదస్సులోను, 1969లో పాల్గొని చరిత్రాత్మక పాత్ర నిర్వహించారు. 1988లో జరిగిన నానాజాతి సమితి సమావేశంలో భారత ప్రతినిధివర్గ ఉపనాయకునిగాను, 1991లో అలీన రాజ్యాల సభలకు భారత ప్రతినిధిగాను పాల్గొన్నారు.

## పరిశోధనలో పరిణతుడు :

ఆర్థిక, రాజకీయాధ్యయనంలో ఆక్సుఫర్డు విద్యాలయం డి.లిట్‌ను, సామాజిక శాస్త్రంలో ఆక్సుఫర్డు డిప్లోమాను పొంది, ఆంధ్ర విశ్వ విద్యాలయం చేత గౌరవ డి.లిట్‌తో గౌరవించబడ్డారు.

## పార్టీ స్థాపనలో ప్రముఖ పాత్ర నడిపిన ప్రజా ఉద్యమాలు :

వ్యవసాయదారులైన ఆచార్య రంగా 1917 నుండి ఇప్పటి వరకు జాతీయ కాంగ్రెసు నాయకునిగా ఉండి స్వాతంత్ర్య సంగ్రామంలో ఆరుసార్లు జైలుశిక్ష అనుభవించారు. భారత కృషికార్ లోక్‌పార్టీ, స్వతంత్ర పార్టీలలో అధినేతగా ఉండి గణనీయంగా కృషిచేశారు. వలస ప్రజల, రంగు జాతుల స్వాతంత్ర్య సిద్ధికి, స్వయం వృత్తుల రైతాంగాన్ని, చేనేత, చేనేత కార్మికుల గ్రామీణ ప్రజల స్వాతంత్ర్యానికి, వారి హక్కుల పరిరక్షణకు, వారి అభ్యున్నతికి నిర్విరామంగా కృషిసల్పారు. 1931 నుండి అనేక సత్యాగ్రహ సమరాలు కిసాన్ యాత్రలు, పికెటింగులు నిర్వహించారు. రైతుల స్వంత కమతాలను స్వాహా చేయడానికి, రద్దు చేయడానికి ఉద్దేశించబడిన 17వ రాజ్యాంగ సవరణ బిల్లును సాహసోపేతంగా ఎదిరించి, దేశవ్యాప్త ఉద్యమం నిర్వహించి పార్లమెంటులో విజయం పొంది, స్వయం వృత్తుల వారైన రైతాంగాన్ని కాపాడారు.

వారు 65 సంవత్సరాల పార్లమెంటరీ జీవితంలో ప్రజల అభ్యున్నతికి పాటుబడి, నిరాడంబరుడుగా, శీల సంపదలు కల్గిన గాంధేయవాదిగా గణుతి కెక్కారు. పార్లమెంటులో 50 సంవత్సరాల రికార్డు స్థాపించిన సందర్భంగా ప్రత్యేక గౌరవానికి చిహ్నంగా ప్రభుత్వ పరంగా, స్పీకరు అధ్యక్షతన జరిగిన సభలో ప్రధాని ఇందిరాగాంధీ పార్లమెంటు చిత్తరువు పొదగబడిన లోహ పత్రంతో సన్మానించారు. తోటి పార్లమెంటు సభ్యులందరు దానిలో పాల్గొని నీరాజనాలందించారు.

గత 10 సంవత్సరాల వరకు కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఉపనాయకునిగా ఉంటూ వచ్చారు.

వారు 75 ఏండ్ల రాజకీయ, సాంఘిక సేవా రంగాల్లో ఒనరించిన సేవలకు గుర్తింపుగా వివిధ అవార్డులు పొందారు. భారత్ కృషిక్ సమాజ్‌చే 1983లో "కృషిక్ రత్న" అఖిలభారత రాజాజీ సమాఖ్యచే "రాజాజీరత్న" అవార్డు, 1982-83లోను, ఆల్ ఇండియా ఎడల్ట్ ఎడ్యుకేషన్ సొసైటీ, న్యూఢిల్లీ వారిచే ప్రఖ్యాతమైన "జవర్‌లాల్ నెహ్రూ లిటరరీ అవార్డు' ను, 1984లో ఆంధ్ర మహాసభచే "ఆంధ్రరత్న అవార్డును, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నవంబరు 7న వారు పుట్టిన తేదీని, "కిసాన్‌దినం"గా పరిగణించమని ప్రకటించారు. న్యూఢిల్లీ శిరోమణి సంస్థవారు "శిరోమణి" ఎవార్డును, 1991లో ఇండో జపనీస్ సంఘము వారు టోక్యో "ఓస్కా" ఎవార్డును అందజేశారు. ఇండియా కోరియోట్రిక్ సంస్థవారు "పార్లమెంటు పెద్ద"గా గుర్తించి సన్మానించారు.

## మేధావుల, జాతీయ నాయకుల సరసన రంగాజీ :

భారత జాతీయ నాయకులుగా ఉండి, పార్లమెంటులో నిర్మాణ కార్యక్రమం నిర్వహించిన రచయితల్లో మేటి రచయిత రంగాజీ ప్రసిద్ధ జాతీయ నాయకులుగా త్యాగులుగా ఎంచబడిన గాంధీజీ, రాజాజీ, నెహ్రూ, సర్దార్ పటేల్, డాక్టరు రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణన్, నేతాజీ సుభాష్ బోసు, ప్రకాశం, లాల్‌బహదూర్, గిరి, యస్.యం. జోషి సహజానంద, యాగ్నిక్ నాయకులు సహచరుడుగా ఉండి స్వాతంత్ర్యోద్యమంలోను, కిసాన్ ఉద్యమాల్లోను, కార్మిక ఉద్యమాలలోను అనేక కార్యక్రమములు సంయుక్తంగా నిర్వహించిన విషయం అందరికీ విదితమే. అంతేకాక అతివాద కార్యక్రమాలలోను, సోషలిస్టు, నిర్మాణ కార్యక్రమాలలోను వారితో కలిసి పనిచేశారు. రంగాజీ, జయప్రకాశ్ నారాయణ్, అశోక్ మెహతా, కమలాదేవి, అరుణా అసఫాలీ, లోహియా, నాథ్‌పాయ్, మొదలగు అనేకమంది అతివాద సోషలిస్టు నాయకులతో కలిసి పనిచేశారు. ఇంకా నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించే అనేకమంది సంఘ సేవకులతో, ఆధ్యాత్మిక వాదులతో సన్నిహితంగా ఉన్నారు.

స్వాతంత్ర్య పోరాట నిర్వహణలో పనిచేసిన, సాంఘిక విప్లవకారుల, రైతాంగ నేతల, కార్మిక నాయకుల కార్యకలాపాలపై, భావాలపై, విలువలపై 65 సంవత్సరముల రంగాజీ అనుభవాలు, అభిప్రాయాలకు అత్యున్నత విలువ సంతరించుకొంటుందంటే అతిశయోక్తి కాదు.

## అందుకు దర్పణంగా రంగాజీ రచనలు, ప్రచురించిన గ్రంథాలు : (ఆంగ్లంలో)

రంగాజీ రచించి, ప్రచురించబడిన, ఈ క్రింది గ్రంథాలతో పాటు మొత్తం, అరవై ఐదు (65). 1) 'క్రెడో ఆఫ్ వరల్డ్ పెజంట్రీ', 2) 'ఏగొని అండ్ సొలేస్' - 2 భాగాలు, 3) 'డిస్టింగ్విష్డ్ ఎక్వయింటెన్సెస్' 1976 - 2 భాగాలు, 4) 'కలోనియల్ అండ్ కలర్డ్ పీపుల్స్ ఫ్రంట్, 1957, 5) ఫైట్ ఫర్ ఫ్రీడమ్ (జీవిత చరిత్ర) 1967, 6) గాంధియన్ ప్లాన్, 7) 'హిస్టరీ ఆఫ్ కిసాన్ మూవ్‌మెంట్', 8) 'రివల్యూషనరీ పెజెంట్' 1954, 9) 'బాపూ బ్లెసెస్' (మహాత్మాగాంధీతో చర్చలు, సంభాషణలు) 1969, 10) ఆలీన ఉద్యమం (), 11) 'ఇండియా ఇన్ ది యు.యన్. రంగాస్ పార్టిసిపేషన్' 1983, 12) 'ప్రొటెక్షన్ ఆఫ్ ది సెల్ఫ్ ఎంప్లాయిడ్ పెజంట్స్ అండ్ ట్రైబల్ క్లాసెస్, 13) ట్రైబ్స్ ఆఫ్ నీలగిరీస్, 14) 'సెల్ఫ్ ఎంప్లాయిడ్ సెక్టర్', 15) 'స్మృతీస్ ఆఫ్ భారతీదేవి' - 1973, 16) ఇండియన్ పొలిటికల్ ఇన్‌స్టిట్యూషన్స్ - 2 భాగములు 1933, 17) 'హరిజన నాయకుడు' - 1934, 18)

'ఏరియల్-ఐ-వ్యూ-ఆఫ్ యు.ఎస్.ఎస్.ఆర్. అండ్ యుగోస్లావియా - 1956, 19) ఔట్‌లైన్స్ ఆఫ్ నేషనల్ రివల్యూషనరీ పాత్ - 1945, 20) వరల్డ్ రోల్ ఆఫ్ రివల్యూషన్ 1946, 21) మెనీ మోనోగ్రాఫ్స్ ఆఫ్ పార్లమెంటరీ డెమోక్రసీ ఇన్ ఇండియా అండ్ ఎబ్రాడ్, 22) ఎకనామిక్ కండిషన్స్ ఆఫ్ ఇండియన్ విలేజస్ - 2 భాగములు.

రంగాజీ తన 75 ఏళ్ళ ప్రజా జీవితంలో - అధికార పదవులను ఏమీ ఆశించలేదు. తను అనేక ప్రజా సంస్థల్లో, వివిధ హోదాలలో నైతికస్థాయిని నిలబెట్టి, గాంధేయవాదిగా, విప్లవ పంథాలో ప్రజానాయకుడుగా ప్రఖ్యాతిగాంచారు. సంపూర్ణ జీవితం గడిపి ప్రపంచంలోనే ఒక ఉత్తమ అగ్రగామి పార్లమెంటేరియన్‌గా విఖ్యాతి గాంచారు.

## ఇదివరలోను, ఇటీవల నిర్వహించిన పదవులు - బాధ్యతలు :

1926 - 30 ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వానికి గౌరవ ఆర్థిక సలహాదారు మరియు స్పెషల్ ఆఫీసరుగా ఉన్నారు.

1927 - 30 ప్రధాన ఆచార్యునిగా, ఆర్థిక శాస్త్రంలోను, రాజకీయ శాస్త్ర విభాగంలోను మద్రాసు విశ్వవిద్యాలయంలోను ఉన్నారు.

1928 - 30 అఖిల భారత వయోజన విద్యా సంస్థ - వ్యవస్థాపక ఉపాధ్యక్షులు.

1930 కేంద్ర శాసనసభకు ఎన్నికయ్యారు.

1930 - 51 అఖిలభారత కాంగ్రెసు సభ్యులు.

1933 రాష్ట్ర కేంద్ర భూమి తనఖా బ్యాంకు డైరెక్టరు- మద్రాసు ప్రభుత్వంలో ఉన్నారు.

1935 - 45 కేంద్ర శాసనసభలో ఉన్నారు.

1946 - 51 ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షునిగా ఉన్నారు.

1947 - 51 అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు.

1933 ఇండియన్ పెజెంట్ ఇన్‌స్టిట్యూట్, నిడుబ్రోలుకు-ప్రధానాచార్యులుగా ఉన్నారు.

1935 ఆల్ ఇండియా కిసాన్ మహాసభ - ఫైజపూర్‌కు అధ్యక్షులుగా ఉన్నారు.

1936 ఆల్ ఇండియా కిసాన్ కాంగ్రెసు మహాసభకు (ఢిల్లీ) అలాగే 1946, 1949, 1951, 1952 సంవత్సరాల్లో అధ్యక్షులుగా నిర్వహించారు.

1936 ఆల్ ఇండియా కిసాన్ సమ్మేళన్‌కు వ్యవస్థాపకులుగా, అధ్యక్షులుగా ఉన్నారు.

1940 రాష్ట్ర చేనేత సహకార సంఘాధ్యక్షుడుగా, అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నారు.

1947 అఖిల భారత రూరల్ పీపుల్స్ ఫెడరేషన్‌ను స్థాపించారు.

1946 - 50 కేంద్ర శాసనసభలో ఉన్నారు. పార్లమెంటరీ పార్టీ కార్యదర్శి.

1947 - 50 ఆర్థిక సంఘంలో ఉన్నారు.

1947 - 51 ప్రొవిజనల్ పార్లమెంటులో ఉన్నారు.

1950 - 51 ఎస్టిమేట్సు కమిటీలో ఉన్నారు.

1947 - 85 అఖిల భారత చేనేత కాంగ్రెసు అధ్యక్షులుగా ఉన్నారు.

1952 - 56 రాజ్యసభకు ఎన్నికైనారు, కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ కార్యదర్శిగా ఉన్నారు.

1957 - 62 రెండవ లోక్‌సభలో పార్లమెంటుకు ఎన్నిక.

1958 - 69 ఛైర్మన్ : పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ పార్లమెంటులోని నాయకులందరిచే మన్ననలు.

1962 - 67 మూడవ లోక్‌సభకు ఎన్నిక.

1967 - 70 నాల్గవ లోక్ సభకు ఎన్నిక.

1967 - 68 పార్లమెంటులో అతిపెద్ద ప్రతిపక్ష గ్రూపుకు నాయకుడుగా ఉన్నారు.

1977 జాతీయ వ్యవసాయ సమాఖ్య వ్యవస్థాపక అధ్యక్షులు.

1977 - 79 రాజ్యసభకు ఎన్నిక

1980-84 1984 - 89 మరియు 1989లో మరలా పార్లమెంటుకు ఎన్నిక.

1980-90 పార్లమెంటరీ కాంగ్రెసు పార్టీకి ఉపనాయకులుగా వ్యవహరించారు.

చట్టసభలైన, పార్లమెంటు,రాజ్యసభల్లో ప్రజల కొరకు నిర్విరామంగా కృషిచేస్తూ బయటకూడా అనేక కార్యకలాపాలు రైతు, గ్రామీణ జనాలకై నిర్వహించి, అవిశ్రాంతంగా పోరాడారు. అంతేగాక అనేక అంతర్జాతీయ సభల్లోను, వేదికలపైన ఉపన్యసించి తమ అమూల్య సలహాలనిచ్చారు.

1946 ప్రపంచ వ్యవసాయదారుల మహాసభ లండన్‌కు భారత ప్రతినిధిగాను.

1947 కోపెన్ హాగన్‌లో 1949 - గల్ఫ్ దేశాల్లోను, కెనడాలోను 1959

1984 ఢిల్లీలోను భారత్‌కు ప్రాతినిధ్యం వహించారు. ఇంటర్నేషనల్, వ్యవసాయ ఉత్పత్తి సమాఖ్యకు మెంబరుగా ఉన్నారు.

1948 ప్రపంచ కార్మిక సదస్సు, శాన్ ఫ్రాన్సిస్‌కోకు - భారత ప్రతినిధి.

1949 అంతర్జాతీయ వ్యవసాయదారుల సమస్యలు చర్చించడానికి, అమెరికా అధ్యక్షులు హారీట్రూమన్‌తో సమావేశం మరియు గాంధీశాంతి సంఘ సభ్యులుగా అనేక దేశాల్లో గాంధీ సందేశాన్ని వినిపించారు. గాంధీ స్మారక నిధి సంస్థకు అధ్యక్షులుగా ఉన్నారు.

1957 సహకార కాంగ్రెసు - బల్గేరియాకు భారత ప్రతినిధి.

1954 - 69 ఉమ్మడి దేశాల పార్లమెంటరీ మహాసభ ప్రతినిధి.

1969 గాంధీ శతజయంతి ఉత్సవాల ప్రతినిధిగా సూడాన్, ఈజిప్టు, ఫ్రాన్సు, యు.కె. దేశాల్లో పర్యటించారు.

1983 అలీన రాజ్యాల సభ - ఢిల్లీకి భారత ప్రతినిధి వర్గ సభ్యులు. ఇండియా - శ్రీలంక ఒడంబడికపై సంతకాలు చేయడానికి ప్రతినిధి.

ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ఆఫ్ఘనిస్థాన్ అంతిమ క్రియలకు భారత్ తరపున ప్రతినిధి.

# ప్రముఖుల అభిప్రాయాలు

## "సామాజిక దృక్పథానికి చరిత్ర సజీవ సాక్ష్యం"

### కాకతీయ యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్, ప్రొఫెసర్ వై. వైకుంఠం అభిభాషణం




సామాజిక దృక్పథానికి అనుగుణంగా కాలమాన పరిస్థితులను ప్రతిబింబించే విధంగా చరిత్రకారులు నాటి రచనలను సాగించారు కనుకే అవి నేటికి సజీవసాక్ష్యంగా మనముందున్నాయని కాకతీయ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్స్‌లర్ ప్రొఫెసర్ వై. వైకుంఠం చెప్పారు. మంగళవారం రాత్రి స్థానిక వెంటేశ్వర విజ్ఞాన మందిరంలో జరిగిన కాకతీయ నాయకులు పుస్తకావిష్కరణ కార్యక్రమంలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. వి.సి. తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ముఖ్య విషయాలను రచనల్లో విశ్లేషించడంతోపాటు సమకాలీన పరిస్థితులు, రచయిత భావాలు ఆయా రచనలపై ఉండటం సహజమేనని తెలిపారు. చరిత్ర అన్నది జరిగిన సంఘటనలను విశ్లేషించడమేనని ఆయన అభిప్రాయపడ్డారు. కాకతీయుల సమగ్ర చరిత్ర అధ్యయనం అందుకు వీలుగా విశ్వవిద్యాలయంలో మేజర్ ప్రాజెక్టు చేపట్టనున్నట్లు తెలిపారు. పుస్తకావిష్కర్త డా. కాసరనేని సదాశివరావు మాట్లాడుతూ కాకతీయుల కాలంనాటి గ్రామీణ పరిస్థితులను ఆంగ్లంలో డా. ఎన్.జి. రంగా తన రచన కాకతీయ నాయక్స్‌లో ఆవిష్కరించారని తెనుగుసేత అందించిన డా॥ జక్కంపూడి ఆచార్యుని

భావాలను ప్రస్ఫుటీకరించే రచన చేశారని ప్రశంసించారు. సభాధ్యక్షత వహించిన జెడ్పీ చైర్మన్ యడ్లపాటి వెంకటరావు మాట్లాడుతూ రైతాంగాన్ని గ్రామీణ వ్యవస్థను పరిరక్షించిన వ్యక్తిగా రంగాను కీర్తించారు. స్వాతంత్ర సమరయోధుడు దరువూరి వీరయ్య తన ప్రసంగంలో చరిత్ర అనేది రాజుల కాలం నాటిదే కానక్కరలేదని కారల్‌మార్క్సును సంపూర్ణంగా అధ్యయనం చేసి రంగా కీర్తిగడించారని చెప్పారు. చిత్రకారుడు రచయిత సూర్యదేవర సంజీవ్‌దేవ్ మాట్లాడుతూ అభిజ్ఞ, రసజ్ఞ, వైజ్ఞానిక దృక్పథం రంగాదని కొనియాడారు. ప్రముఖ విద్యావేత్త నాగభైరవ కోటేశ్వరరావు మాట్లాడుతూ చరిత్రలోని చీకటి కోణాలను తన ఆంగ్ల రచనద్వారా రంగావెలుగులోకి తెచ్చారని విరుద్ధ ధర్మాన్ని ఎదుర్కొనే ప్రయత్నాన్ని చేశారని చెప్పారు. నాగార్జున విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ సుందరరామమూర్తి తన ప్రసంగంలో ఫ్యూడలిజం మూర్తీభవించిన నాటి పాలకులు హిందూ మత పరిరక్షణ పేరుతో సంగ్రామాలు సాగించారని చెప్పారు. సభలో రాజ్యసభ మాజీ సభ్యులు డా॥ యలమంచిలి శివాజీ, జెకెసి కళాశాల రిటైర్డ్ అధ్యాపకుడు పులిచెర్ల సుబ్బారావు, వడ్లపట్ల గోపాలకృష్ణయ్య తదితరులు ప్రసంగించారు. తొలుత శంభయాచార్య ప్రార్థనతో సభ ఆరంభమైంది. కార్యక్రమానికి కొల్లా శ్రీకృష్ణారావు స్వాగతం పలికారు. చివరగా పుస్తక రచయిత సీతారామారావు కృతజ్ఞతలు తెలిపారు.

*(వార్త పత్రిక నుండి)*

---

## కీ.శే. జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు

శ్రీ సీతారామారావు గారూ, ఆచార్య రంగా కాకతీయ నాయకులు అనువాదం అందింది. ధన్యవాదాలు. కాకతీయుల కాలం, కాకతీయుల రాజ్యం, విచక్షణ ఎరుగని వ్యవస్థలో అన్ని కులాల సామరస్యం సమన్వయం ఆకాలంలో మనకు కనిపిస్తుంది. దానిని ఆచార్యా రంగా, మీరు చక్కగా చిత్రించారు. మన చరిత్రలో కనీసం తెలుగువారిలోనైనా కాకతీయుల యెడల పరిజ్ఞానం చాలా పరిమితం. మీ తెలుగు అనువాదం వారి కాలాన్ని పరిపాలనను విశదంగా తెలుగువారికి అందిస్తుందని నేను ఆశిస్తున్నాను. అందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను.

## కీ.శే. శ్రీ సంజీవ్‌దేవ్‌గారు

ఈ రచనలోని ఇతి వృత్తంతో నేను బాగా పరిచితుడనై వుండటంతో మీ అనువాదం నాకు అనువాదం అనిపించక మాతృకగానే అనిపించింది. మీ తెలుగు తేట తెలుగుగా రూపొందటంవల్ల చదవటం, చదివినదాన్ని గ్రహించటం, గ్రహించినదాన్ని జీర్ణించుకోటం, జీర్ణించుకున్న దాన్ని ఇతర్లకు తెలపటం ఎంతో ఆనందం అనిపించింది.

మౌలిక రచన చేయటంకంటే అనువదించటం కఠినమైన చర్య. మౌలిక రచనచేయటానికి ఒక భాషలో ప్రావీణ్యం వుంటే చాలు. కాని అనువాద కార్యానికి రెండు భాషల్లోను ప్రావీణ్యం వుండాలి.

ఏది ఏమైనా మీ గ్రంథం గంధమయంగా వున్నది, నందనమయంగా రూపొందింది. ఆంతరంగిక అభినందనలు, నేటికిక వ్రాయలేను.

---

## కీ.శే. డా॥ నాగభైరవగారు

నీవు పంపిన పుస్తకం యిద్దరు చదివాక నావంతు వచ్చింది రంగాగారి చారిత్రక పరిశోధనా శీలానికి జోహార్ చెప్పకుండా ఉండలేం. నీవు అదృష్టవంతుడవు గనుకనే – నీ కంటే ముందు దీన్ని ఎవరూ అనువదించలేదు; భాగవతం పోతనకు మిగిల్చినట్టు – ఇప్పటికి నేను రెండు ఛాప్టర్స్ మాత్రమే చదివాను 1. కాకతీయ నాయకులు, 2. సమాజం వారసత్వం.

మొదటి భాగం అనువాదమనే విషయం చాటుతుంది. రెండో భాగం అలా అనిపించలేదు. ఇది ఒరిజినల్‌లాగా సాగింది. రంగాగారి పదబంధాలు బాగా ఉపయోగించుకొన్నావు.

'ఎన్.జి. రంగాగారి భక్తుడను నేను' – ఈ కుహనా రాజకీయాలూ, దేశభక్తులూ ఎవరూ చెప్పుకోలేనంత గొప్పగా, హుందాగా, గర్వంగా తలయెత్తి, హిపోక్రసీ లేకుండా చెప్పిన నీ తత్వాన్ని నేను పదే పదే మెచ్చుకుంటున్నాను.

---

## డా॥ పి. దక్షిణామూర్తిగారు

పూజ్య రంగాగారి భావాలన్నిటిని చక్కని తెలుగులో అందరికీ సులభగ్రాహ్యమయ్యే రీతిలో అనువదించి కృతకృత్యులైనందుకు నా హృదయ పూర్వక అభినందనలు.

---

# అదృష్ట దీపక్‌గారు

ఆత్మీయ మిత్రులు సీతారామారావుగారికి,

నమస్కారం,

"కాకతీయనాయకులు" పూర్తిగా చదివాను "చాలాబాగుంది" అని రాస్తే మామూలుగా అనిపిస్తుందేమో అయినా వాస్తవం. చరిత్ర రచనను సాధారణంగా కుల, మతాలు ప్రభావితం చేసి ప్రక్కదారి పట్టిస్తుంటాయి. స్వజాతి దురభిమానంతో తన వాళ్ళ గొప్పతనాన్ని అతిశయించి చెప్పడం, ఎదుటివాళ్ళలోపాలను భూతద్దంలో చూపడం సహజంగా జరుగుతుంటాయి. కాని ఈ గ్రంథరచనలో రంగాగారు గొప్ప సంయమనాన్ని ప్రదర్శించారు.

గణపతి దేవుడి పరిపాలనను సమీక్షించడంలోనూ, ప్రతాపరుద్రుడు ఢిల్లీ చెరనుంచి తప్పించుకువచ్చినట్లు చెబుతున్న గుంటూరు జిల్లా శాసనాన్ని విశ్లేషించడంలోనూ (26వ పేజీ చివరిపేరా) సమగ్రమైన శాస్త్రీయ దృక్పథం కనిపిస్తుంది. గ్రీసు దేశానికి చెందిన 'హీరో డోటస్' ప్రపంచంలో చరిత్ర రచనకు నాందిపలికాడు. ఆదేశంవాడే అయిన "తూసిడైడస్" చరిత్ర రచనలో సత్యశోధనకుగల ప్రాముఖ్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పాడు. సత్యాన్ని శోధించడంలోనూ, సాధించడంలోనూ రంగాగారి కృషి అడుగడుగునా ద్యోతకమవుతుంది. అడుగుపెట్టిన అన్ని రంగాలలోనూ రాణించిన అచ్చమైన "కృషీవలుడు' ' గదా ఆయన! మీ అనువాదం ఎంతో ప్రౌఢంగా వుంది – చాదస్తంగాలేదు. అందుకు నా అభినందనలు అందుకోండి. మూలమేకాదు – అనువాదంకూడా "శివజటాజూటవినిర్గత గాంగఝురీ సదృశం" గానే ఉంది.

అయితే మీ అనువాద శైలిలో నాకు కనిపించిన అతిచిన్న లోపాన్ని ఎత్తిచూపుతున్నాను – సహృదయులై అవధరించండి. కొన్నిచోట్ల క్రియారూపాల్లో యూనిఫామిటి లోపించింది. "అవకాశం కూడా వుంది", "బందీలుగా తరలించబడ్డారు", "ఢిల్లీకి మోసుకొని పోయారు' ', "ఎదురు చూస్తున్నారు", "అంగీకరించారు", "వర్ణించాడు" – ఈ రకంగా స్వచ్ఛమైన వ్యావహారిక రూపాలను వాడిన మీరే అక్కడక్కడ "ఉపయోగవడియుండును",

'అసహ్యించుకొనిరి", విపణివీధులున్నవి, గుడిని దర్శించిరి" మొదలైన కృతక గ్రాంథిక రూపాలు ప్రయోగించారు. ఇలాంటి క్రియా రూపాలు రుచికరమైన భోజనం చేస్తున్నప్పుడు పంటికిందపడే రాళ్ళలా తగుల్తుంటాయి. అంతేకాక గ్రాంథికమైనా, వ్యావహారికమైనా క్రియా పదాల్లో ఐక్యత ఉంటే అందం వస్తుంది. ఇది దృష్టిలో ఉంచుకుంటారని ఆశిస్తున్నాను.





సీతారామారావు, అంబటి సుబ్బారావు, రంగాజీ
1980లో చిలకలూరిపేట - సన్మానం

ధూళిపాళ శ్రీ కృష్ణమూర్తి, రంగాజీ, గోగినేని నాగేశ్వరరావు, కందిమళ్ళ బుచ్చయ్య
సీతారామారావు, హరనాథరావు, మేకపోతుల నాగూరుగార్లు

